# శ్రీ రామ రాజ్యము

కవి సమ్రాట్టుల కల్పవృక్షమునకు శేషమైన

## ఉత్తర కాండము

చెఱుకుపల్లి జమదగ్నిశర్మ

ప్రథమ ముద్రణము: వేయిప్రతులు
రౌద్రి వైశాఖము - మే 1980





మూల్యము రూ 10 లు

వలయువారు
చెఱుకుపల్లి జమదగ్నిశర్మ
శ్రీరామనగరం కాలనీ
పానగల్లు
శ్రీ కాళహస్తి, (చిత్తూరుజిల్లా) - 517640



ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్,
మద్రాసు-1

# కృతజ్ఞత

ఈ గ్రంథ ముద్రణము ప్రధానముగా తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యమువారు ధర్మప్రచారక గ్రంథరచయితల ప్రోత్సహించు పథకము ననుసరించి యొసంగిన రూ **3666**ల (మూడువేల ఆఱు వందల అఱువది ఆఱు రూపాయల) భూరి విరాళముతో సాధ్యమయినది. దానికి ముఖ్యులయిన కార్య నిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఎ. ఎస్ గారికిని పౌర సంబంధ నిర్వహణాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారికిని నా ప్రత్యేక కృతజ్ఞతలు.

వారిచ్చిన మొత్తము పూర్తివ్యయమునకు పర్యాప్తము కాలేదు. అందుచే కొందఱు సహృదయవదాన్యుల నభ్యర్థించితిని. స్వామిచే ప్రేరితులై వారెల్లరు యథావకాశముగా విరాళముల నొసంగిరి.

1. శ్రీ జూటూరి రమణయ్యగారు, ప్రొద్దుటూరు — రూ. 200
2. శ్రీ కంద్రిగ రామమూర్తిగారు, శ్రీకాళహస్తి — రూ. 150
3. శ్రీ డి. రామచంద్రారెడ్డిగారు, శ్రీకాళహస్తి — రూ. 100
4. శ్రీ బిశ్వేశ్వర ఛారిటబుల్ ట్రస్టు, మదరాసు — రూ. 251
5. శ్రీ ఎస్. ఎమ్. కె. పరశురామ గురుకుల్ గారు, శ్రీకాళహస్తి — రూ. 100
6. శ్రీ పి. ఆర్. మాధవరావుగారు, శ్రీకాళహస్తి — రూ. 116
7. శ్రీ డాక్టరు పరమాత్ముని వేంకటరామయ్యగారు, శ్రీకాళహస్తి — రూ. 116

8. శ్రీ కె. భక్తవత్సలయ్యగారు, శ్రీకాళహస్తి రూ. 1
9. శ్రీ ఆర్. ఎమ్. సి. వి. రాధాపతి అయ్యవారు, శ్రీకాళహస్తి రూ. 5
10. శ్రీమతి ఎమ్. ధనలక్ష్మిగారు, శ్రీకాళహస్తి రూ. 5
11. శ్రీ కా. కణ్ణన్ గారు, శ్రీకాళహస్తి రూ. 5

ఇట్లు విరాళముల నిచ్చినవారే కాక పుస్తకము వెలువడుట ముందుగనే మూల్యమిచ్చి తోడ్పడిన మిత్రు లనేకు లున్నారు. కెల్లరకు పరమేశ్వరుఁ డితోధికాభ్యుదయ ప్రదాతయై సుప్రసన్ను నెఱపు గాక.

ముచ్చటగా ముఖపత్ర రచన చేసి యిచ్చి దీని నలంకరించి శ్రీ తేజోమూర్తుల కేశవరావుగారికి నా అభివందనములు.

ఈ ముద్రణ మింత ముచ్చటగా వెలువడుటకు క్రాంతి ము ణాలయ యజమానులు మిత్రులు శ్రీ ధనికొండ హనుమంతరా గారు సౌజన్యముతో సహకరించుటయు ప్రాణమిత్రుడు రామలిం శ్వరరావు యెడతెగని పనులున్నను దీనిపై శ్రద్ధ వహించుట హేతువులు. వారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

చెఱుకుపల్లి జమదగ్నిశ

# పరితోషము

శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ గారిది తెలుఁగునాటి చదువరులలో ఇరువైపులుగ ప్రతీతమై యున్న పేరు.

"తొలినాళ్ళ వెలువడిన జమదగ్నిశర్మ కథలు మా గుండెలు పట్టుకొని యున్నవి! ఒకనాఁటి 'మహోదయము' పాటలు ఆంధ్రార్ణవముపై విరిసిన వెన్నెల తేఁటలు! కళాశాలా విద్యార్థులకు ఆయన తెలుగుఁ పాఠమొక శిక్షావల్లి!" ఈ విధమైనది ఒకటి.

"కవి సమ్రాట్ విశ్వనాథ వారి వాత్సల్యములో మెలఁగిన నలువురిలో జమదగ్ని ఒకరు!

శ్రీ కాళహస్తిక్షేత్ర వాసియైన నేఁటికవి ధూర్జటి ఆయన!

వైరభక్తి, త్రిశతి ప్రభృతి కృతులు ప్రచురితములు చూచితిమి.

శ్రీరామరాజ్యము, గిరి ప్రదక్షిణము వెలుఁగు చూడవలసిన మహాకావ్యములు!"

ఈ విధమైన దిం కొకటి!

ఈ యుగళ ప్రసిద్ధికి నాళము ఒక్కటే. కాలము కలసివచ్చి ప్రతిభ పుష్పించును. జమదగ్ని శర్మగారి జనన వత్సరము 'రౌద్రి' యన్నచో ఇపు డాయన ప్రాయము షష్ట మన్న మాట.

'శ్రీరామరాజ్య' మిది ఆనందోద్గమమైన సంస్కృతి. అద్వైతనాంధ్ర సాహిత్య ప్రపంచమునకు రసమయ ఫలప్రదానము చేసిన శ్రీమద్రామాయణ కల్పవృక్ష మహాకావ్యమునకు శ్రీరామరాజ్యము శేషము. శ్రీ మాతృస్తవముతో ఉపక్రాంతమైన యీ కావ్యము శేషభూషణున కంకితము. కల్పవృక్షమునందలి ప్రతి కాండము అయిదేసి ఖండములుగా విభజింపబడినట్లే ఉత్తరకాండ

మైన శ్రీరామరాజ్యము కూడ పంచముఖమై యున్నది. పదుమూడు వందలకు పైబడి పద్యరాశి.

"పరమశివు నోలలాడించు పడఁతి లలిత
లలిత మొనరించుఁ గాక నా పలుకు పలుకు."

అని తలంచిన యీ కావ్యకర్త పలుకు ఎంత లలితమో భావమంత తాండవము చేయును. వాల్మీకమైన మహస్సు శర్మగారి హృదయమునకు ఉన్మేషకారి. తెలుఁగులో ఉత్తర రామాయణ గాథను తిక్కన, పాపరాజు యథామూలముగ జనముల్ మెచ్చఁగఁ జెప్పనే చెప్పిరి. మఱి—ఈ కబ్బము నందలి క్రొత్త యెందున్నది?

శబ్ద బ్రహ్మవేత్తయైన భవభూతి యుత్తర రామ చరితమును భావించి యమృతస్పర్శమును పొంది తత్కథా కళానుభవమును ఈ తెలుఁగునకు జోడించుట యందున్నది. ఏతత్కావ్యారంభమునందలి దైవతస్తుతియు ప్రాక్తనాద్యతన కవి గురు జన వందనాదికము పరిశీలన చేయుచో, శర్మగారి యానుశ్రవిక బుద్ధి ధారయందలి యవిచ్ఛిన్న వ్యుత్పత్తి స్ఫురణము ఆనందము గొల్పును. శ్రీమాత, విఘ్నపతి, భారతి, వాల్మీకి వ్యాసులు, శుకుఁడు, శంకరులు, కల్యాణానందభారతి, రామేశ్వరులు...ఇది వారి దేశిక సంప్రదాయము. శర్మగారి జనకులు బుచ్చిరామ శర్మగారు 'కల్యాణి' యన్న పేరుతో భగవద్గీతార్థ సాకల్యమును జిజ్ఞాసువుల కనుగ్రహించి కైవల్యము నందుకొన్న మహాపురుషులు. జమదగ్నిగారి ఆముష్య పుత్రిక శిష్టజన ప్రశంసాపాత్రమైనది. పితురంతే వాసిత్వ ప్రాప్తమైన ధర్మాచరణ ప్రవణత, సాహిత్య గురువులు విశ్వనాథవారితో తెలిసికొన్న కవితా మర్మజ్ఞత ఈ రెండును జమదగ్ని ప్రణీతమైన కావ్యమునకు లోచనములు.

ఉత్తర కాండ గాథనే కయికొని యీ కావ్యమునకు 'శ్రీరామ రాజ్యము' అని నామకరణము చేయుటలో నొక ప్రత్యే

కత యున్నది. 'సీతాయాశ్చరితం మహత్' అన్న దాని యొక్క వ్యాఖ్యానమే యీ కృతి యన్నట్లు కవి కంఠోక్తి.

"రామా శబ్దము శ్రీ ప్రబోధకముగా రామాయణాం బన్నచో
శ్రీ మన్మోహన సీత తత్త్వమయ చారిత్రంబె యానంచుఁ దా
నా మౌనీంద్రుఁడు తోల్తనే నుడివె నయ్యర్థంబు దివ్యమ్ముగా
నామాత్రంబ్రభి సమర్చకుం డిటులు వ్యాఖ్యానించె సుస్వాంతుఁడై."

శ్రీరామ పట్టాభిషేకా నంతరమున 'శ్రీరామరాజ్య' కావ్య కథా ప్రారంభము "దైవమె రాజుగా నయిన ధన్యు లపాస్తసమస్త దోషులు..." ఇత్యాది పద్యముతోఁ జేయబడుట సాభిప్రాయముగా నున్నది. రాజుకంటె దైవము లేఁడనుకొనుట లోకాయతికుల దృష్టి. అట్టిది వట్టి భౌమరాజ్యము. దైవమె రాజుగా నయినది రామ రాజ్యము. ఇట్టి రాజ్యములోని ప్రజల హృదయములు దివ్యములు. మహోజ్జ్వలములు. తత్త్వతః భక్తి దీప్తియందు వారి కనేకత్వము లేదు. వారి నానాత్వము పుణ్యకర్మ కరణమునందే భాసించును. వార యోధ్యలో ధర్మసంపన్నులైన వేల్పు లన్నట్లే వినుతింపఁబడిరి.

"రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా
రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా"

అని పలికిన మహర్షియు—

"స్నేహం దయాం చ సౌఖ్యం చ యదివా జానకీ మపి ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా" అన్న భవభూతియు శ్రీ రామరాజ్య కావ్యమునకు పరోక్ష ప్రియులైన నాందీ వాదులు.

కథా నిర్వహణములో కవితా రచనలో జమదగ్నిశర్మగారి ఔచిత్య భరితమైన పరిపాకము పఠితను తత్త్వాలోకమునకు గొని పోవును. ఈ కావ్యమునందలి తెనుఁగు పలుకుబడి రసానుభూతమైన సౌకుమార్యము కలది. సంస్కృత సమాసము సుబోధాన్వయ మాధుర్యము కలది. ఉదాహరణము లనేకములు. సముజ్జ్వా ఖండములోని

సీసమొకటి. అడవిలో విడిచిపోనున్న మఱందితో అమ్మ యను చున్నది.

కనులలోఁ గనులుంచిననుఁగాంచి ముదమందు
　　　రామనేత్రాంశు దర్శనము లేక
ఘనసార కస్తూరికా మిళచ్చందనా
　　　సారమౌ రామ సంస్పర్శ లేక
సకల మనోనురంజన సుమస్పర్ధిౘైత్వ
　　　ద్వ్యాకు నాసా గంధవహము లేక
శంఖ సుందరగళస్వాన వీణానాద
　　　మధురమౌ శ్రీరాము మాట లేక

యింద్రియాఖిల తర్పణం బేచు రాము
దివ్య సాన్నిధ్యమెడసి యీ దేహమొక్క
క్షణము నిల్వదు నిజము లక్ష్మణ కుమార
యయ్యొ రాముఁడు క్షేమమే యగును గాద!

ఇంతదాఁక నక్కఱలేదు. ప్రతిజ్ఞాఖండ ప్రారంభ ఘట్టము శర్మగారి లోకజ్ఞతకు పరమోదాహరణము. శ్రీరామ పట్టాభిషేక మహోత్సవములు నెలనాళ్ళు జరిగినవఁట! వచ్చిన బంధుగులు ఎన్నాళ్ళుందురు? ఎవరి సంసారములు వారివి. సీతారాములను విడిచి వెళ్ళలేరు. వెడలఁ జూచినను వారు వెళ్ళనీయరు. కాని తప్పదు. ఈ సందర్భములోని పద్యము

ఎల్లరు బంధుగుల్ కదలి యిండ్లకు నేఁగుట యొక్కయెత్తు తా
నల్ల విదేహభూపతి ప్రయాణకుతూహలుఁడౌ టొకెత్తుగా
నుల్లమునందు ఘొక్కినది యుర్విసుతామణి యా మహాత్ముఁడే
తల్లియుఁ దండ్రి సర్వమును దానయి పెంచినవాఁడు కావుటన్॥

శాంతఋష్యశృంగులు, మాండవ్య, వసిష్ఠారుంధతులు, రుమ, తార, సరమ....ఇట్లే కావలసిన వారొకరొకరే అయోధ్య విడిచి వెడలిపోయిరి. జనకుని యెడబాటు జానకి సహింపలేక పోయి

నది. ఏదో వంక పెట్టి కొన్నాళ్ళు ఆపుచేసినది. చివరకు ఆతడును వెడలిపోయెను. ఈ విధముగా జనకాది బంధు వియోగముతో బెంగటిల్లియున్న జానకిని సాంత్వనపఱచ వలసిన బాధ్యత రామ చంద్రునిదైనది. ప్రాణప్రియార్థ దేహియగు రాముఁడు సీతాను రంజనార్థ ప్రయత్నుఁడాయెను. ఈ సందర్భమున నున్న ఆఱు పద్య ములు వాని కవి సాటి. రాముడు

"పూర్ణ గర్భంబు నిమురు చుప్పొంగు చాత్మఁ
బుత్రపూర్ణోరువయి మహా మోదమెపుడు
కూర్తు నాకని కోమలిన్ గ్రుచ్చియడుగు"నఁట!

ఇచటి రాముని యోదార్పు సాంఖ్యము చెప్పిన ప్రకృతి పురుష వివేకమును వ్యంజింపఁ జేయుచు నెంతో హృదయంగమమై యున్నది. ఇట్లే బహు సన్నివేశములయందు జమదగ్నిశర్మగారి లేఖినితాత్త్విక వర్ణరేఖా చిత్రణములనుచేసి భావుక హృదయము లకు ఆసేచనక మగుచున్నది.

భుజాశ్లిష్టులై సీతారాములు చిత్రదర్శనము చేయుచుందురు. లక్ష్మణుఁడు వదినెకు "యమున యొడ్డునఁ జిత్రకూటాధ్వ మందు నా భరద్వాజుఁడాడిన శ్యామయన్న వట వనస్పతి చూచితే!" అని చూపించును. ఆమె వల్లభుని గాంచి "స్మరియింతే రఘురామ! యీ వటము" ననఁగా రాముఁడు కన్నీరు పెట్టుకొనును. రాముఁడు ఆ వటమును ఎట్లు మరచిపోవును! 'కాల్నడకచే బడలియున్న జానకి ప్రాప్తాశ్లేష సంవాహన స్ఫురణచే సోలి రాముని గుండెపై శిరస్సు చేర్చి నిద్రించినది ఈ వటచ్ఛాయనే గదా! విస్మరించుట యెట్లు?' అన్న తరువాత ఇవి రెండు గీతములు.

ఆత్మనుండి సముద్భవంబైన మనసు
మఱల నాత్మాభి ముఖముగా మలచు యోగి
యవనినుండి సముత్థితంబైన తాను
శిఖల పేరిట మఱలఁ దాఁ జేరునవని॥

జనకు లంతటి సత్త్వమా ఘనవటంబు
తానె వేతెఁచుఁదోఁచు తత్త్వంబుగన్న
యాత్మయే యెల్ల విశ్వమానన్నవారు
నిన్ను నాకిచ్చినారు మనీషులగుచు.

న్యగ్రోధమును గుఱించిన మొదటి గీతము శ్రీమద్రామాయణ కల్పవృక్షములోనిదే. చిన్న మార్పుచేసి దానినే యిక్కడ అనుసంధించుకొనుటలోని ఔచిత్యము తత్త్వార్థ స్ఫోరకమై రోమహర్షణము కలిగించుచున్నది. "అవనినుండి ఉద్భవించిన పెద్ద కొమ్మలు ఊడలుగా చుట్టుకొన్న మఱ్ఱి—ఆత్మనుండి ఉద్గమించిన మనస్సు మరల ఆత్మాభిముఖ మగుచున్న యోగి" యని చెప్పుట విశ్వనాథవారి లోకోత్తర భావనకుఁ జెందిన యొక బిందువు. న్యగ్రోధ ప్రసంగము వచ్చినపుడు ఈ భావమును విడిచి గత్యంతరము లేదు. [విష్ణుసహస్రమునందు 'న్యగ్రోధః' అను గౌణనామమునకు శంకరుల భాష్యము: న్యక్ అర్వాక్ రోహతి సర్వేషాముపరి వర్తత ఇతి న్యగ్రోధః। సర్వాణి భూతాని న్యక్కృత్య నిజమాయాం వృణోతి నిరుణద్ధీతివా।]

"ఆత్మస్థానమైన కల్పవృక్ష మహాకావ్యమునకు ఇపుడీ రామరాజ్య మానసము. కవితాయోగముతో అభిముఖినమై యున్నది" అనెడి సవినయమైన అంతేవాసి భావము జమదగ్నిశర్మగారికి ఆశంసితమైనది అభివ్యంజిత మగుచున్నది.

శ్రీరామరాజ్య కావ్యమునఁ బ్రధానముగానున్న గుణము అన్వయ సుందరమైన అక్లిష్టమైన జాతీయమైన తెనుఁగు పద్యశైలి. అంతకంటెను బ్రాధాన్యము వహించునది ధర్మవ్యాఖ్యాన సరణి. ఈ కావ్యమున 'ప్రత్యభిజ్ఞాఖండము' జమదగ్నిశర్మగారి బహుముఖీన పరిశ్రమజ్ఞానమునకు వేదికగా విరాజిల్లుచున్నది. ఉదాహరణము లిచ్చి అనపేక్షితముగా విస్తరింపను. ఒక్కమాట.

జమదగ్నిశర్మగారు వయసుచే నాకంటె మూఁడు నాల్గు నెలలు చిన్న కావచ్చును. ఆయన నన్ను 'అన్నా!' అని ఆప్యాయముగా పిలుతురు. ఆశీస్సుకోరుట ఆయన ప్రశ్రయభావము. 'అన్యోన్యం గురవో విప్రాః' నే ననుకొనుచు ఆయన ధర్మదీక్ష నభినందించు చున్నాఁడను.

రాజమహేంద్రవరము,

12-3-80.

(సం) మధునాపంతుల
సత్యనారాయణశాస్త్రి

శ్రీః

# మిత్ర సంమోదము

శ్రీ జమదగ్ని శర్మ నాకు చిననాటి మిత్రుడు. ఈయనను శ్రీ విశ్వనాథ కవితా భావుకుని చేసినది నేను. ఈ గ్రంథము శ్రీ విశ్వనాథవారి శ్రీమద్రామాయణ కల్పవృక్షమునకు పరిశిష్టముగా రచింపబడినది. శ్రీ విశ్వనాథవారికి పరమసన్నిహితులైన వారిలో యీాయనయు నేను నున్నాము. కావున నేనీ గ్రంథమును గురించి సవిమర్శగా వ్రాయుటకు చాల పరిమితులేర్పడినవి.

అనంత మార్గములందు విహరించగల శ్రీ విశ్వనాథ కవితా శిల్పము, మహాప్రతిభ, వైదుష్యము, రచనా వైదగ్ధ్యము – అన్నియు గుర్తించి—ఆయన మిగిల్చిన ఉత్తరకాండను—ఆయన వెంటబడి రచించుటకెంతయో సాహసము కావలెను. వ్యుత్పన్నత కావలెను. పూర్వకవి ప్రయోగదక్షత కావలెను. ఎంతయో కొంత కల్పవృక్ష ఛాయలకు గొనిపోగల సామర్థ్యము కావలెను. ఉత్తరకాండను రచించుటకు తగిన అధికారము కావలెను. ఈ యన్నియు నీయన యొద్ద నెంతవరకున్నవి? మరియు నిది లోకోత్తర వస్తువు. తిక్కన గారు, కంకంటి పాపరాజు—యిదివరకే యీా వస్తువును తమతమ పద్ధతులలో తీర్చి దిద్దిపోయిరి. అన్నిటిని మించి భవభూతి మహాకవి ఉత్తర రామచరిత్ర యున్నది. ఇట్టి ప్రతిబంధకములుండగా దీనిని వ్రాయుటకు దలపెట్టుటయనగా మహాశక్తి కలవాడని యర్థము.

ఈ కవికి సర్వపూర్వ కవితా సారభూతమైన శ్రీ విశ్వనాథ యందు పరమాదరము. ఆయన యీా కవికి నిత్యశిరస్థుడు. కళాశాల అధ్యాపక వృత్తిలో యెన్ని పూర్వకవుల రచనలను పాఠములు చెప్పినను యీాయన యభిమానము శ్రీ విశ్వనాథయందే నిలిచి పోయినది.

ఈ 'రామరాజ్యము' లోని 'యవతారిక' చూచినచో శ్రీ కల్పవృక్ష పథానుగామిత్వము కాంచబడును. ఇట్లు దీనియందెన్ని యేని చూపించవచ్చును. కావలసిన గుణములన్నియు కలపోతగా చేసికొని, దానికి స్వతంత్రమైన పలుకుబడిని జోడించి పద్యరచనకు సాగినవాడు శ్రీ జమదగ్ని శర్మ.

శబ్ద ప్రయోగ ఔచిత్యములు, పలుకుబడిలోని ప్రౌఢిమలు, భావ గాంభీర్యములు, శైలియందొక ప్రత్యేకమగు మృదువగు పాకము, అర్థవత్తుగా తార్కిక సంబద్ధముగా సమాస గ్రథనము చేయుటవంటి గుణములు యీ గ్రంథమున కొల్లలుగా నున్నవి. ఉదాహరణలిచ్చుట అక్కర లేని విస్తరించుట.

వేదార్థము-ముఖ్యముగా పూర్వ మీమాంసా వైదుష్యము రామాశ్వమేధ నిర్వహణ ఘట్టమునందు శతధా వికసించినవి. వేదాంత తత్త్వస్ఫూర్తి మద్వాక్యములు గ్రంథమునిండ నున్నవి.

కథను చెప్పుటలో కొత్తరకముగా చెప్పుట, కథాకథన రమ్యత చూపి రచనను సౌందర్యమయము చేయుట శిల్పమనదగినచో నది శ్రీ జమదగ్ని పుష్కలముగా చేసెను. మిత్రుడనైన నేనింకేమి వ్రాయవలయును? సంమోద భరితుడనైనానని వ్రాయవలయును.

మదరాసు-17
12-3-80

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

# నివేదన

దీనిని నేను కవిసమ్రాట్టుల శ్రీమద్రామాయణ కల్పవృక్షము నకు శేషగ్రంథముగా సంకల్పించితిని. తల్లి దయవలన 15-5-75 నాటికే రచన పూర్తిచేసి శ్రీవారి కరకమలముల కందించితిని. వారు దీని నామూలాగ్రముగ చదివి 25-10-75 నాడు ఆశీఃపూర్వకముగ నభిప్రాయము ననుగ్రహించి యుండిరి. అయినను నా దురదృష్టముచే నది మఱునాటి యుదయమున శ్రీకాళహస్తి రైలు స్టేషనులో కొంత దక్షిణతోపాటు చోరదేవతాహస్త గృహీతమైనది. మరల వారినుండి అభిప్రాయమును వ్రాయించి కైకొనుట సాధ్యమయినది కాదు.

'మత్తః ప్రత్యవరః కశ్చి న్నాస్తి సుగ్రీవ సన్నిధౌ' అని లంక నున్న సీతాదేవితో ఆంజనేయుఁడనినాఁడు. అది ఆతని వినయమును సూచించు నతిశయోక్తి. శ్రీవిశ్వనాథ విద్యావంశములో నాకంటె తక్కువవారు లేరనుట మాత్రము యథార్థము. అయినను నాకిట్టి సంకల్పము కలుగుట దైవేచ్ఛ, ఇంతమాత్రమున నిట్టి ప్రయత్నము మఱొకరు చేయరాదని లేదు. ఎవరినుండి యెట్టి రచన ఆవిష్కృత మగునో! దేని విలువ దానిదే కాఁగలదు.

ఆంధ్రపురాణ కర్తలు బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి అన్నగారు దీనిని తమ 'పరితోషము'తో అభినందించిరి. ఆత్మాభిన్న కవియోగి తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు దీని నామోదించినాఁడు. ఇంతకంటె కావలసినదేమున్నది? వారిరువురకు నా సప్రశ్రయ నమోవాకములు.

అసూయరహిత సహృదయలోకమున కిది ఆదరపాత్రము కాఁగలదనియే నా నమ్మకము.

శ్రీకాళహస్తి
రౌద్రి - ఉగాది
17-3-80

చెఱుకుపల్లి జమదగ్ని శర్మ

శ్రీ నిత్య ధర్మలక్ష్మ్యా!
మానితనందీశరూప మంజుల ధర్మా!
కేనోపనిషత్ప్రకటిత
నానాతత్త్వార్థ మథన నవనీతాత్మా! 1

శ్రీ నామాంచితమై చిదగ్ని భవమై శ్రీచక్ర సంవాసమై
ధ్యానాంభోజ వికాసమై వినమ నైకాహ్లాది కారుణ్యమై
జ్ఞానక్షీరపయోధి నిర్మథన దక్షప్రాప్య పీయూషమై
యానందోజ్జ్వల సన్మహస్సువగు నిన్నర్చింతు జ్ఞానప్రసూ! 2

బంధూక సుమబంధ బంధు ప్రభావేణి
మజ్జనం బాడింప ముజ్జగముల
ఘనసార కస్తూరికా వీటికామోద
మాశాంతరము సర్వ మావరింపఁ
గచ్ఛపీన్యక్కారి కమ్ర వాఙ్మాధుర్య
మఖిలమ్ము పారవశ్యమున ముంప
శింజాన మంజీర మంజుల శ్రీపాద
మాత్మ చైతన్యమ్ము నభినుతింప

నతసుజన పాపతిమిరమ్ము నఖమయూఖ
మాత్రమునఁ జిమ్మివైచు శ్రీమాత నన్ను
లౌకికాలౌకికానంద లాభ హేతు
పరమ కరుణా ప్రసన్న దృక్పాత్రుఁ జేయు॥ 3

ఆననాంబర కైశికా సితాంబుద పార్శ్వ
ఖండేందు రమ్యాళి కంబుతోఁప
వదన మంగళ గృహద్వార తోరణ మాలి
కా సన్నిభ భ్రూ యుగమ్ము వెలుఁగఁ

ప్రత్యూషః ఖద్యోత ప్రభాకరాభ క
స్తూరికా తిలకంబు శోభలీన
వక్త్రలక్ష్మి పరీవాహ భ్రమణ శీల
శఫరీవిలాస లోచనము లొప్ప
లలిత కుంకుమ లిప్త లావణ్య దేహాళీ
రమ్యాతి రమ్యాధర మ్మెసంగ

భువన మోహన శృంగారమూర్తిఁ దాల్చి
మందహాసాన నేందు సంభావనమునఁ
బరమ శివు నోలలాడించు పడఁతి లలిత
లలిత మొనరించుగాత నా పలుకు పలుకు॥ 4

ఆదర మొప్ప దేవతల కందఱకున్ భజనీయుఁడౌచుఁ గా
ర్యాది నుతింప విఘ్నహతి నందగనీక కృతార్థుఁ జేయుచున్
బ్రోది సమస్తలోకముల పోషకుఁడౌచు వెలుంగుచుండు న
య్యాదిమ పూజ్య విఘ్నపతి నాత్మ భజించెద నిష్టసిద్ధికై॥ 5

చతురాస్య ప్రతిభా ప్రభావభవ సంసారమ్ము దృశ్యమ్మశా
శ్వత, మానంద విహీనమౌ టెఱిఁగి భావవ్యంగ్య, సంస్థాయి, ని
ర్వృతి శీలమ్మగు సృష్టికిన్ గవుల కావేశమ్ము కల్పించు భా
రతి పాలించుత మామకీన కవితా రాజ్యమ్ము నశ్రాంతమున్॥ 6

శోక శ్లోకత వాసికెక్కి, కవితాస్ఫూర్జ న్నభో నిర్ఝరా
స్తోకాటీకన వేగ ధూర్జటి యశస్స్ఫూర్తిన్ విజృంభించి యా
నాక ప్రస్థిత రామజీవన కథాన్యాసమ్మునన్ మించు వా
ల్మీకంబైన మహస్సుఁ గొల్తు హృదయోన్మేషార్థినై నిత్యమున్॥ 7

వ్యాసున్ విష్ణుని బాదరాయణుఁ గృపావారాశి నెవ్వాఁడు లే
కే సంసార మిదెల్ల చీఁకటుల కొట్టే యౌనొ యెవ్వాఁడు తా
నా సంసారము నంటకుండిన శుకాఖ్యబ్రహ్మమున్ సూనుగా
వాసిం గాంచెనొ వాని గొల్చెదను దత్త్వంబన్న భావంబునన్॥ 8

శంకరు సాక్షాచ్ఛంకరు
సంకటమయ భవపయోధి సంతరణ తరిన్
శంకాపనోదనక్షము
కౌంకుమ వర్ణాంబరోత్థకైవల్య ఝురిన్ ॥ 9

వినత శిరస్కతన్ గొలుతు వీ న్మిగులంగను నట్టివారె యన్
ఘనత వహించి లోకగురుగా నుతి నందిన మద్గురూత్తమున్
నన కులిశమ్మునైన మెద నవ్వ్యల దిద్దిన ధీవిలాసుఁ, జి
ద్ఘనవపు, సమ్మురూపె కనగా నగు మోహన దివ్యదేహునిన్ ॥ 10

కల్యాణానంద యతిన్
గల్య స్మరణీయ చరితుఁ గరుణావీక్షా
మాల్యానుగ్రహ జని సా
ఫల్య మహత్త్వ ప్రపూర్ణ భవ్యచ్ఛాత్రున్ ॥ 11

వినమచ్ఛీర్షత మ్రొక్కి మద్గురుని దద్విఖ్యాత కర్మంది శి
ష్యునిఁ గల్యాణి యనం దెలుంగు నుడితో శ్రోతృప్రియంబారఁ జి
క్కని గీతార్థము విప్పి చెప్పిన యశః కైలాసు రామేశ్వరున్
జనకున్ గొల్చెద భక్తి తన్మయత సాక్షాద్బ్రహ్మ సంభావనన్ ॥ 12

ఆనా తండ్రి యొసంగినట్టిదియె మేనొటన్ ఋణగ్రస్తుఁడన్
నేనై పుత్త్రుని గాంచనైతి నెటు కానీ భ్రాతృ పుత్త్రద్వయం
బూనున్ భారము హీనపుత్త్రతకు నే ముందున్ బరిష్కార మిం
కైనన్ జన్మము లేని యట్లగుటయే యైనన్ మఱీ మంచిదా॥ 13

సౌశీల్యంబున, దానశౌండిమను, వాచానైపుణిన్, భర్తృసే
వా సంపాదిత సద్వివేకమున, దైవబ్రాహ్మణార్చన్, జను
శ్శ్రీ సర్వస్వ పరోపకారమున లక్ష్మీనారసింహాంబకున్
నా సర్వంబగు తల్లికిన్ సమలు కానన్ రారు ముమ్మాటికిన్ ॥ 14

అన్నయ్యన్ సుధి వేంకటప్పయ సదా ధ్యానింతుఁ జిత్తాన నా
కన్నే కా దతఁడయ్యఁగూడనయి విద్యాబుద్ధులన్నేర్పెఁ, గూ
ర్చె న్నాకింతిని మిత్ర పుత్త్రికను, చూచెన్ స్వస్నుషన్నాఁగఁ, జే
ర్చె న్నాకన్నియు బాధ్యతల్ హరిహరీ తృప్తాత్ముఁడై గావుతన్ ॥ 15

వినమచ్ఛీర్షత నంజలించెదను మద్వేదాంత విద్యాగురున్
ఘను సర్వోపనిషత్తులన్ వినుచు లంకా నారసింహాఖ్యు నా
తెనుఁగుం బల్కుల తెల్వి యాతనికడన్ దెల్లంబుగా నేర్చి వి
చ్చిన డెందాన నొకింత నేఁబలికెదన్ జిత్తంబు లుప్పొంగగన్॥ 16

కాళీదాసుని గొల్తు వాణియను విఖ్యాతిన్ జగంబేలుచున్
మేలౌ కూర్పుల హర్షదీధితుల నున్మీలించు ప్రజ్ఞానిధిన్
దేలెంగా కతఁడొక్కఁడచ్చ కవియై దేవీ కృపంగాంచి యీ
నేలన్ లే రితరుల్ సమానులు సుధాస్నిగ్ధాచ్ఛ భావాబ్ధులై॥ 17

సంస్కృతోప జీవ్య సారస్వతాంభోధి
నా తెలుంగు బాస ప్రీతి కొలకు
భాస హర్ష భట్ట బాణ భారవ్యాది
సత్కవీంద్ర పంక్తి సన్నుతింతు॥ 18

హృదయ వీణానాద హేలా సుధాస్విన్న
నవ్యాంధ్రి గన్న నన్నయ మహర్షి
పలుకు వెల్లులలోనఁగల చవుల్ పండించి
కన్నులన్ విచ్చు తిక్కన మనీషి
తనకుఁ దానై యుండి తత్కవిద్వయ వాణి
యనఁగఁ బూరించు నెఱ్ఱన కవీంద్రు
స్వైర విహార వాగ్ధారా మనోహర
నాట్యమ్ము సలుపు శ్రీనాథ సుకవి

వేయునో దూయునో లేక విసరు నొక్కొ
ముసరునో యనఁబల్కు సోముని సుధాంశుఁ

బదము పదమున భక్తి సంభరితమైన
తన మెదన్ బొంగఁజేయు పోతన సుధాబ్ధి॥ 19

నిశితధీ కరవాల నిర్జితో భయలోక
రాట్పదస్థితుఁ గృష్ణరాయ జిష్ణుఁ
దరుణ లావణ్య సుందర మనోజ్ఞాంగ నా
తత్త్వ ప్రవీణుఁబెద్దన మహాత్ము
సన్నివేశ క్లిష్ట చారువాక్ సౌందర్య
రసరాజ్య మేలు సూరన సుధీంద్రుఁ
బటుబంధ విన్యాస భావబంధుర కావ్య
రమణీయ వాఙ్మణి రామకృష్ణు

వీరె కాకింక నెందఱో వీర కవులు
పూర్వ సాహిత్యవీథిఁ బొల్పొందువారు
కలరు వారలనెల్ల నొదలను వాంచి
పదములందేను వ్రాలి సద్భక్తిఁ గొలుతు॥ 20

తెలుఁగు న్నేల శివ స్వరూపమను కీర్తిన్నిల్పనో నాఁగ వే
దలలన్ విచ్చి వహించు శేషఫణి మత్సాహిత్య విద్యాగురున్
విల సత్కావ్య సహస్ర దివ్య మణిదీప్తి ధ్వస్తనాస్తిక్య ను
జ్జ్వల ధీయున్ గవి విశ్వనాథుఁ గొలుతున్ సాహిత్య సమ్రాడ్యశున్ ॥21

సకలాంధ్ర సంస్కృత సత్కవీశ్వర శిల్ప
నిధి, మహాకవి, కావ్యనిధి యతండు
రసమె బ్రహ్మం బౌట రసరాజ్య మేలిన
సార కావ్య రసావతారుఁ డతఁడు
సకలోహ వైభవ సాహిత్య శిఖరాయు
మాణ రామాయణ మాన్యుఁడతఁడు
హేతువాదోద్భూత హేమంత సంపాత
ప్రశమనక్షమ తర్క భానుఁడతఁడు

సత్కవీశ్వర శబ్ద పూజ్యతకు యోగ్యుఁ
డుండునే యన్యుఁడింత యాంధ్రోర్వియందు
విశ్వనాథ కులాంభోధి విధుఁడతండు
సత్యనారాయణాఖ్యుఁ డస్మద్గురుండు॥ 22

అతఁడే సర్వకవీశ రూపుఁడయి యీ యాంధ్రావని న్నిల్పు స
న్మతి యాటన్ నిజమాతఁ డొక్కని నుతింపన్ సర్వులన్ భక్తి స
న్నుతి గావించిన యట్లగున్ హరి యొకండున్ బ్రీతి నొందంగ వి
స్తృతమౌ విశ్వమె ప్రీతినొందుగద యెందే నాతఁడై యుండుటన్॥

పుడమిని వృక్షముల్ గొసలఁబూచిన క్రొవ్విరులన్ ధరించు నొ
బ్బిడిగ నొకండు రెండు మధుబిందుల నంతన ప్రీలి పోయెడిన్
గడక నెడంద పిండి శివుకై నుడితేనియ చెట్టుకట్ట వె
ల్వడినది కల్పవృక్ష మఖిలమ్ము సుధాఘనమౌచు నిల్చెడిన్॥ 24

ఆ మహా కావ్యమందు వారే మొ మొదట
సోత్తరంబుగ నేడు వ్రాయుదు మటంచుఁ
బల్కెనైనది తుదకు నిర్వహణమేమొ
చేయుటయ్యెను పట్టాభిషేక మందె॥ 25

ఉత్తరకాండ మేమియగు నూరక యుండగ రాదు మీరు స
ర్వోత్తర మౌనుగాదె యది యూర్జితులై మఱి వ్రాయకున్నచో
నుత్తర మీయగా వలసి యుండును లోకుల కంచు నేను నా
చిత్తముఁ దెల్పగా వదనసీమ దరస్మిత మొప్పఁ జూచుచున్॥ 26

నేనే వ్రాయఁగ నేల శిష్యులకు దానిం బంచి వ్రాయింతు నా
కౌ నా నల్వురి యందు నీ వొకఁడ వౌ దన్నన్ సరేయంచు భ
క్త్యానమ్రుండను ద్వాదశాబ్దములు ప్రోయం జాలితిన్ గాని య
ద్దానిం బూనెడి తీరు తోఁపదని చింతంగూరి యున్నంతలో॥ 27

ఆనందాదిని కాళహస్తి గుడిలో నయ్యెన్ మహానందమై
కోనల్ నాలుగు మూగునట్లుగ మహాకుంభాభిషేకోత్సవం
బే నా సంబరమందు దేవళములో నేదైన నిత్యంబు శ్రో
త్రానందంబుగఁ జెప్ప నెంచి తొలి మాహాత్మ్యంబు విన్పించితిన్॥ 28

ఆపైఁ గైకొని కల్పవృక్షమును నిత్యంబింత విన్పించుచో
నాపై నెవ్వరొ పూనినట్లుగనె యీనా కావ్యమారంభమై
శ్రీపాదాంబుజ సేవగా నిటులు భాసించెన్ మఱే నైనచో
నీ పాకంబున నిట్లు చెప్పఁగలనే యెంతెంత యత్నించినన్॥ 29

ఏను నిమిత్తమాత్రుఁడన యెంతయు నజ్ఞుఁడ సంస్కృతాంధ్ర వి
జ్ఞానము నంతమాత్రమె యొకానొక శక్తి యెదో వసించి డెం
దాన వచింతు వ్రాయుమన దానికి లొంగిన యుక్త లేఖనం
బైనది యిద్ది నానుడుల నందఱు నమ్మగఁజాలఁ రిద్ధరన్॥ 30

ఏనా నిమిత్తమాటకె
యానందము నందుచుందు నంతియ కాకన్
నేనై వ్రాయుట నా య
జ్ఞాన జనిత దోషములకు జంకుచు నుందున్॥ 31

గురు ఋణ మిట్లు వీగు మిదిగో నిను నొక్కనిగాఁ జేర్కొనెన్
దరుణమిదే యెడందగల దండడి వీడి రచింపు మొప్పుగన్
బరమ ముదంబునంది నిను వత్సలుఁడై దయఁ జూచుఁ దండ్రికై
వరసుతుఁడైన రాముని నటు వ్రాయుము కావ్యము పూర్తియయ్యెడిన్.

అని యెవరో వచించి నటులైనది యా స్వన మేను నిత్యమున్
వినునది యే దయాళువయి వీలునొసంగిన దిట్లు తల్లి నా
కనిన తపస్సు పండినది కల్పనగంబు ననల్ప కీర్తియై
మనినటు లిద్దియున్ మనను వ్రానది యే చిఱుకొమ్మ పెట్టెడిన్॥33

కవినై కాంచెడి దేమి? కీర్తియ, లోకశ్రేయమా, ద్రవ్యమా?
స్తవముల్, మన్ననలున్, మహాసభలలో సన్మానముల్, శాలువల్
వివిధంబుల్ లభియింపవచ్చు నవి యేవీ నన్ను రక్షింపఁ జా
లవి యే బంధము లౌచు మంటి మనసే యందించి మోహంబిడున్॥

తనువున్ మెచ్చను, దానితో నయిన బాంధవ్యంబులన్ మెచ్చ నిం
ధన తుల్యమ్ము ధనమ్ము మెచ్చను, మహోదారమ్ము కానిమ్ము కీ
ర్తిని మెచ్చన్ దనువుండుటన్ బ్రదుకుదున్ దేవా నినుం గొల్వ న
చ్చిన దైవంబవు నీవు మెచ్చవలెనో శ్రీకాళహస్తీశ్వరా! 35

అని నా త్రిశతిని స్వామికి
మనవిం బొనరించి యుంటి మన్నించి దయన్
దనచేయు నీ కృతిన్ భువి
జనములు మన్నించునట్లు సాకును గాకన్॥ 36

భవభూతిన్ భజియింతు భక్తిమెయి శబ్దబ్రహ్మవేత్తన్ మహా
కవి లోకోత్తర రామ జీవిత కథా కల్పాగమావాని నా
చవు లూరించెడి కావ్యకోశ మధువాస్వాదించి లేశమ్ము నా
చవి జోడించి రచింతు దీని నిది యాస్వాద్యంబె యాగావుతన్॥ 37

మును తిక్కన్నయుఁ బాపరాజును యథామూలమ్ముగా నిక్కథన్
జనముల్ మెచ్చగఁ జెప్పి యుండినను బెల్చన్ గూర్తు నిద్దానిఁ దోఁ
చిన రీతిన్ రసబంధురం బగు నటుల్ శ్రీరామరాజ్యంబునాఁ
జను నీ నామము సార్థకం బనఁగ స్వేచ్ఛా కల్పనోపేతమై॥ 38

రామాశబ్దము శ్రీ ప్రబోధకముగా రామాయణం బన్నచో
శ్రీ మన్మోహన సీత సత్త్వమయ చారిత్రంబె యానంచుఁ దా
నా మౌనీంద్రుఁడు తొల్తనే నుడివె నయ్యర్థంబు దివ్యంబుగా
నా మాత్రంగ్రహి సమర్చకుండిటులు వ్యాఖ్యానించె సుస్వాంతుఁడై॥ 39

మాతృ భాషయందు మహిత సాహిత్యంబు
కలదు దాని విలువఁ దెలిసి నేర్చి
ప్రతి ముఖమ్ము నందు వఱలు సరస్వతిన్
భక్తిఁ బడసి యగును పండితుండు॥ 40

నాకుఁ జెప్పినారు నా శిష్యు లెందఱో
వింత ప్రశ్నములను వేసి తెలుఁగు
వారు గురువు లగుదురీ రీతిగాఁ జూడ
నయినఁ బిన్నలగుట నాశిషములు॥ 41

నా తెలుంగు వెలుఁగు నా జీవితాను భ
వంబు సర్వమిందుఁ బడయవచ్చు
నిదియు నీశ్వరేచ్ఛ నిట్టు లావిష్కృతిన్
బడసి యుంట జాతి కిడును శుభము॥ 42

ఇట్లు విచ్ఛిన్న సంప్రదాయమ్ము ననుసరించి యిష్ట దేవతాస్తోత్ర గురుగణాభి వందన సుకవిస్తుత్యాది సహితంబుగాఁ గావ్యావతారికం గూర్చిన యనంతరంబు నా యొనర్పం బూనిన శ్రీరామరాజ్య నామకంబగు నిమ్మహా కావ్యమునకుఁ గథాక్రమం బెట్టి దనిన శ్రీరామ పట్టాభిషేకానంతరమున 43

# కథా ప్రారంభము

దైవమె రాజుగా నయిన ధన్యు లపాస్త సమస్త దోషులా
దేవుని భక్తిమై మొదలు దివ్య మహోజ్జ్వల దీప్తులీన నా
నావిధ పుణ్యకర్మ కరణ ప్రవణాత్మకులై యయోధ్యలో
దేవతలన్న యట్లు వినుతింగని రాత్త సుధర్మ సంపదన్॥ 44

ఎన్నఁడో వెన్కఁ బదునాలుగేండ్ల క్రితమె
రాజుగా నయి యుండ నౌ రామచంద్రుఁ
డిపుడు రాజౌట కెంతో తోరపు ముదంబు
నందు ప్రజ లెన్నొ వేడుకల్ విందులంద॥ 45

నెలనాళ్ళల్లై మహోత్సవంబు కళ సందీపించె సర్వత్ర పొ
త్తులలో బిడ్డయు రామనామ జప మాధుర్యంబు నానన్ మహో
జ్జ్వలమై రామకథా సుధాలహరి యూర్ధ్వస్రోతసింబోలె మి
న్నలమెన్ దృప్త మరుద్గణంబు కృపమై నందింప శ్రేయస్సులన్॥ 46

రామా! జానకి రామ! మాని హృదయా రామా! పరంధామ! ని
స్సీమానంద మహోఽభిరామ! విజయ శ్రీరామ! పట్టాభి రా
మా! మమ్మేలు మనంతకాల మనుచున్ మన్నింతు రారాము ని
ష్కాఁమున్ శూరలలాము సారసుగుణగ్రామున్ కృతజ్ఞ ప్రజల్॥ 47

పిలువ నక్కఱ లేకయే వెడల వలయు
యజ్ఞముం జూడ నల్లై రామాభిషేక
మని తమంతట తామె రానైన జనము
లా యయోధ్యను సకల మర్యాద లంది॥ 48

అందే యుంద మటంచు డెందము లమందా నందముం బొంద రా
మేందున్ జూచుచుఁ గాలముం గడపుచే యేకైక లక్ష్యంబుగా
నందూ బద్ధుల వోలె నిల్తురు ప్రభుత్వాప్తిన్ విరామంబె లే
కెందున్ గానక రామచంద్రుఁ దమయందే చూచుకో నెంచుచున్॥

దినముల్ సాగి మహోత్సవాగత జనుల్ తీర్థాట నంబైన చో
ప్పున స్వగ్రామము లేగసాగిరి మహాంభోధిన్ సమీపించి వెన్
జనగా లేని నదీ నదంబులన వార్ సన్నన్ బురంబే మొ త
గ్గని యల్లెప్పటి యల్లై యున్నది సమగ్రంబౌ పరబ్రహ్మానాన్॥ 50

పిలుపే లేని జనంబు లట్లయిన సంప్రీతిన్ సమాహూతులై
యిలువేల్పుల్ బలెఁ బూజ లందిన జనం బింకెట్లు తామాచు గే
స్తులతో నందురుపోదు మేమనుచు సంతుష్టుల్ పరాధీనులై
మెలమెల్లన్ సెలవంది డెందము డిగన్ మేనేగు నట్లేగుచో॥ 51

క్షణము తీఱిక లేక పనులపైఁ దిరుగాడు
పరిచారికాళి తొందఱలు తగ్గి
ఎడము బెత్తెడు లేక యెల్లెడల్ తామయై
యడరు బందుగుల సందడులు సడలి
వ్యవధానమే లేక వరుస నేర్పాటైన
కార్యక్రమంబుల క్రందు తొలఁగి
మసలు టించుక లేక మహనీయమౌ శ్రద్ధఁ
దీర్పనౌ విధుల యొత్తిడులు వదలి

స్వాత్మ విస్మృతి గనక విశ్వాత్ములైన
యాత్మ యోగులు తుదకుఁ దామైన యట్లు
తత్ క్షణావధి తన్మయత్వంబు వదలి
తాను తానయ్యె రాఘవాంతః పురంబు॥ 52

ఎల్లరు బందుగుల్ కదలి యిండ్లకు నేగుట యొక్కయొత్తు తా
నల్ల విదేహభూపతి ప్రయాణ కుతూహలుఁడౌ టొకెత్తుగా
నుల్లము నందు పొక్కినది యుర్వీసుతామణి యా మహాత్ముఁడే
తల్లియుఁ దండ్రి సర్వమును దానయి పెంచినవాఁడు కావుటన్॥ 53

అంతకుముందె శాంతయును నత్తలు పుణ్యుఁడు ఋశ్యశృంగుఁడ
త్యంతము శ్రద్ధతోఁ జలుపు ద్వాదశ వార్షిక సత్రముంగనన్
సుంత విలంబ మోర్వకయుఁ జాలుకడున్ భరమైన సీత నొ
క్కింత విడంగఁ జాలకయు నేగక తప్పక యేగి యుండుటన్॥ 54

రక్త బంధుత్వ మెంత హార్దమది యైనఁ
బట్టుమని నిల్వ లేదు సవ్యాజ మగుట
మైత్రి నెనసిన యెదలు సమైక్యమందు
వజ్రబంధంబు గాగ నిర్వ్యాజ మగుట॥ 55

రుమయున్ దారయు లంకలోని సరమా రోచిష్మతీ తత్సుతల్
విమలాత్మల్ తను వీడలేక చనఁగా విస్రబ్ధమౌగుండియున్
శమముం బాయక నిల్వరించుకొనె నా శాంతాత్మ, యట్లయ్యు లే
శము తాళంగను జాలదయ్యె జనకున్ శాంతాత్ముఁ బంపింపఁగన్॥56

మదిలో నంతగ నుత్తలంపడు సుతన్ మన్నించి ప్రేమార్ద్రుఁడై
సదయుండున్ గదలండు, కొన్ని దినముల్ సాగన్ బ్రయాణంబు కా
నెదియో వంకిడియాపు సీత, తుదకెట్లెట్లో యతండేగఁ, దా
నెదలో నొంటరియైన జానకి మనం బేఁకారుటల్ మాన్పఁగన్॥ 57

ఆమె పాణిగ్రాహ మర్థించి యెవ్వాఁడు
శ్రీకంఠ విభు ధనుశ్ఛేత్తయయ్యెఁ
బ్రతినగా వనవాస వ్రతమూను చెవ్వాఁడు
తన వెంట నామెఁ గైకొనుచుఁ జనియె
నామె కోరికఁదీర్ప నరియంచు నెఱఁగియు
నెవ్వాఁడు లేడి తే నేగఁ దెగువ
దనుజాప హృతగాఁగ దాన వాన్వయ మెల్ల
నెవ్వాఁడు కూల్చి తా నింటిఁగొనియె

నట్టి శ్రీరామచంద్రుఁడా యవనిజాత
మానసము ఖిన్నమైన నమ్మగువ కొఱకు
నన్నియున్ వీడి ప్రాణప్రియార్ధ దేహి
యనయ మనురంజనార్థ ప్రయత్నుఁ డయ్యె॥ 58

ధర్మాసనంబందుఁ దడయఁ డొక్కింతైనఁ
గనుచూపునసె నిల్చుఁ గాంత కెపుడు
మృదు మందహాస సంపద నోలలాడించు
హాస్యోక్తులం దేల్చు ననవరతము
నతివ కిష్టములైన వన్నియున్ సమకూర్చు
నంతః పురమె సర్వమాచుఁ గడపుఁ
బరిచారికా సేవఁ బరిహరించుచుఁ దానె
ప్రావారమునను వీవనలు పట్టుఁ

పాద సంవాహనమునఁ దాఁ బరవశించుఁ
బూర్ణ గర్భంబు నిమురుచుప్పొంగు చాత్మఁ
బుత్త్రి పూర్ణోరువయి మహామోద మెపుడు
కూర్తు నాకని కోమలిన్ గ్రుచ్చియడుగు॥ 59

లజ్జామంథర ముగ్ధమోహన తనూలావణ్య సీతాహ్రదో
న్మజ్జన్మానసుఁడైన రాఘవుఁడు ప్రేమన్ జానకీ శయ్యపైఁ
బజ్జన్ దానుపవిష్టుఁడై సతి కరాబ్జాతమ్ము హృత్సీమ యం
దుజ్జీవన్మహనీయ సాధనముగా నుంచున్ సమాధిం గనున్॥ 60

మేల్కాంచున్ బ్రియమార నిట్లనుఁ బ్రియా! మేల్మేలు నా మేనహో
పుల్కల్ దేరును నిన్ స్పృశించుచునె సంపూర్ణేందు బింబాననా!
మేల్కన్నాననను మాటగాని తనువే మిన్నైన యట్లాచుఁ దా
నుల్కన్ డెందము సర్వమే మయినదో యున్నామొ లేమో యనన్॥

మిథ్యావాది యనుంగు బిడ్డవయి నా మేలోర్చి మన్నావహో
తథ్యం బియ్యది నీవు నిట్లయినఁ గాంతా! లోక మేమాను? వై
తథ్యం బోర్వక కర్మబద్ధులయి స్వాతంత్ర్యమ్ము లేనట్టిరె
పథ్యంబంచు వియోగ మోర్చికొని దోర్వన్ లేరు తామై గురుల్॥ 62

అవును గృహస్థ జీవితమునం దెటుచూచిన బంధనంబులే
తవులుటఁగాదె కామములఁ ద్యాగమొనర్చి మనీషివర్యులా
ర్జవమునఁ గాననంబులకు సాగి తపంబొనరించు చుంద్రు నీ
వవశత వీడి తేరుకొనవన్న ననుంగను మేమి యైతినో॥ 63

ఉన్నామిద్దర మొక్కటై తనువులం దున్నాము వేర్వేర, నీ
వున్నావంచును నేను నుంటి నిట నన్నా! నీవు కాకున్న నా
కున్నే లోకము? లెమ్ము లెమ్మిఁక సముద్యోగమ్ము దీపింప నా
సన్నంబయ్యె సమస్తమౌ శుభము లుత్సాహమ్ము నందంగదే! 64

అని రాముం డనుచుండఁ గంచుకియుఁ దా నచ్చోటికే తెంచి క
న్గొని రామున్ మనమార మోదపడి నీకున్ రామభద్రా యటం
చని యాగన్ మఱి యాగదేల యిఁకఁ దాతా రామభద్రుండనే
యన రాజా! మునివచ్చు వేచు నిట నీకై దర్శనం బీయవే! 65

ఋశ్యశృంగాశ్రమము నుండి ఋషియు వచ్చె
వార్త యేమున్నదో మన వారి దనఁగ
నింక నాలస్య మేల రప్పింపు మనుచు
జానకియుఁ బల్కె రాముఁ డుత్సాహి యయ్యె॥ 66

వచ్చు మహర్షిఁ గాంచుచునె వాల్చి తలన్ వినయాన మ్రొక్కుచున్
బచ్చని గద్దె చూపు విభు వత్సలతన్ గనుగొంచు మౌని తా
విచ్చిన మోముతో విడియ, మీరు మహోత్సుకులౌచు మౌనిపా!
యచ్చట నెల్లరున్ గుశలు లౌగద, కారణమేమి రాకకున్? 67

సెలవీయంగదె యంచు వేడ ముని యాశీర్వాదముం జల్పి మి
మ్ములనే యెంతురు సర్వులచ్చటి మహాత్ముల్ శ్రీవశిష్ఠుండు వ
త్సలతన్ బంపెను నన్ను మీ కడకు శ్రద్ధా భక్తులన్ విన్ము వే
త్తలమున్ వేత్త యతండు దేహమట యెందంబిందుగా నుండెడిన్॥ 68

సర్వ సర్వం సహాదేవి చానఁగనియెఁ
బితయు జనకుండు తాఁ బ్రజాపతి సముండు
సవితయున్ మేము గురుల మైత్ర్యాపులకును
వారి కోడలుగా నయ్యె వత్స సీత॥ 69

ఆమెకై యేము కోరంగ నైన దేమి
కలదు? వీర ప్రసు వవునుగాక బిడ్డ!
నా మనంబెల్ల వేళ నా రాము నెంచు
బాల రాఘవుఁ గాంచి నా పలుకు వించు॥ 70

అని పలికె వశిష్ఠుండని
ముని యష్టా వక్రుఁడాడ మోదము తోడన్
విని రాముఁడాత్మ సతిఁ గని
విని నావా శ్రీ గురుండు విస్తృత కరుణన్। 71

మన కిచ్చెన్ ఘన సంతతిన్, సుజనులా మాన్యుల్ శుభాకాంక్షతోఁ
గనఁగా నైన శుభంబె కోరుదురు లోకంబందు, నాద్యర్షులే
మనిరో యయ్యది మాట వెంటఁబడి తానొచుండు నర్థాత్తుగాఁ
గనుమీ! యెంత యనుగ్రహించిరి గురుల్ కారుణ్య ముప్పొంగఁగన్॥

మన జన్మంబులు చారితార్థ్యము గనెన్ మన్నించె మా స్వామి యం
చునె యా దిక్కునఁ గేలు మోడ్చి కనవచ్చున్నాఁగ నిల్చుండి వా
ల్చిన శీర్షంబున నంజలించి మునితో శ్రీస్వామి మద్దైవ మే
మని నాతో వచియింపు మంచనియెనో యద్దానిఁ దెల్పంగదే! 73

అని రాముం డవధానియై నిలువ, నయ్యష్టాంగి సీతమ్మయున్
దన తా వందునఁ దాను నిల్చె నపుడద్దాంపత్య మొప్పెన్ గడున్
గన నేఁడో మఱి రేపొ కానుపగు నక్కాంతా లలామంబుతో
విన మచ్ఛిర్షుఁడు రాముఁడట్లు నిలువన్ విస్ఫారితాక్షుండై॥ 74

అష్టావక్రుఁడిటుల్ వచించె వినవయ్యా రామ! విన్పింతు నా
కిష్టం బంచును సీత దౌహృదముతో నేదేనియుం గోరుచోఁ
గష్టంబైనను దీర్పు మంచనియె నక్కాంతాలలామంబు స్త్రీ
సృష్టి స్థాత్మ మహా స్సరుంధతియు నీ చేతంబు నందుంచుమా! 75

శాంతా భర్త వచించె నిట్టులు ధరాజాతా! కుమారీ! నినున్
శ్రాంతిం బొందెద వంచుఁ దేమిటకు శ్రీరామున్ భవత్ప్రీతికై
సంతోషంబుగ డించినార మిఁక నుత్సంగాప్త పుత్త్రోత్సవ
స్వాంతన్ నిన్నుఁ గనంగ నెంచెదము సర్వశ్రేయముల్ నీకగున్॥ 76

తుదకా దైవము శ్రీ వశిష్ఠుఁడిటు సీతోఁ జెప్పు మంచాడెఁ దోఁ
చదు నాకిచ్చుట నున్న యందఱము యజ్ఞంబంచు నున్నామిటన్
బదవిం బొందిన నీవు బాలుఁడవు రాట్ భావంబు క్రొంగ్రొత్త తే
ల్చెదవో ముంచెదొ రంజనాత్త సుయశశ్శ్రీమూర్తు లైక్ష్వాకులున్॥

అత్మ నీనుండు రాముఁ డయ్యర్థ మెల్ల
హృదయ దఘ్నమ్ము గాగ నుద్రిక్తుఁడయ్యు
శాంత గంభీర వదన దుస్సహా మహాస్కుఁ
డగుచు ననె నన్య దుష్కర మగు ననంగ॥ 78

సీతయే ప్రాణమౌ శ్రీరామ చంద్రుఁ డ
ర్ధాంగి దౌ కోర్కె యేదైనఁ దీర్చు
యజ్ఞాభిలాష మెండయ్యె శ్రీరాముఁ డ
ర్ధాంగి రంజింపఁ దానాగి పోయె
పుత్త్ర పూర్ణోత్సంగ మోహనా పాంగ యౌ
సతిఁ జూడ రాముఁ డుత్సాహ మందు
సౌఖ్య దయా స్నేహ సంహతిం గనఁబోక
రామావనీశుఁడే రాజ్య మేలు

ధర్మ సింహాసనంబన్న తత్త్వ మెఱిఁగి
సార రఘుకుల ధర్మ ప్రశస్తిఁ దెలిసి
సిద్ధి దంబగు గురుకులా శీస్సు కలిమి
సర్వతో భద్ర రామరాజ్యమ్ము సాగు॥ 79

అని రామావని నాయకుండనఁ గరంబానందముం బొంది స్వా
మిని ప్రేమార్ద్ర విలోకనంబులను భూమీ జాత వీక్షించి యి
ట్లనె రామా! రఘువంశ ధూర్వహనదక్షా! యిద్ది నీకే తగున్
ఘన కీర్తిం గను రామరాజ్య మఖిలక్ష్మా మండలిన్ దివ్యమై॥ 80

అంతట నష్టా వక్రుఁడు
సంతుష్ట స్వాంతుఁడగుచు స్వా మ్యనుమతి వి
శ్రాంతిం గన నేగఁగ నా
ప్రాంతంబున కేగుదెంచె రామానుజుఁడున్॥ 81

వచ్చిన లక్ష్మణుండు రఘువల్లభుఁ గాంచి నమస్కరించుచున్
మచ్చిక మీర మీరు మును మాన్య చరిత్ర మనోవినోదనం
బిచ్చఁ దలంచి చిత్రగతి నెల్ల చరిత్ర లిఖింపుమన్నఁ దా
మెచ్చుగఁ జేసె నర్జునుఁడు మేకొని చూతురుగాత దేవితోన్॥ 82

అని మనవి చేయ జానకి
కను గోసలఁ గుతుక మొప్పఁ గాంతుని జూడన్
దన బుజమున సతి చేతిని
గొని రాముఁడు మెల్ల మెల్లఁ గోమలిఁ గొంచున్॥ 83

చనియెన్ లక్ష్మణు వెంటఁ జిత్ర రచనా సామర్థ్యముం జూచు వే
డ్కను దన్వంగి మనో వినోదనపుఁ గాంక్షన్ స్థానముం జేర ల
క్ష్మణుఁడన్నా! యిదె చూడు మంచన దృశా సార్థక్యమన్నట్లు పొ
ల్చిన చిత్రంబులఁ జూడసాగిరి భుజాశ్లిష్టుల్ ప్రియావల్లభుల్॥ 84

వ. ఎవరీ దేవత లుప్పరాన? తమకై యేతెంచిరో? తాము భ
క్తి వశుల్ స్తోత్రము చేయుచుండిరిటఁ, జూడ్కికిఁ దృప్తిపొందించెనం
చవనీ జాత యసంగఁ దల్లి! యవి దివ్యాస్త్రంబులా కౌశికుం
డవనిం దాటక రూపు మాపుటకునై యర్పించె నీ స్వామికిన్ ॥ 85

మొనసి కృశాశ్వుఁడూర్జితుఁడు మున్ను వసంత పరస్సహస్రముల్
గనిన తపస్సుకున్ ఫలముగా లభియించిన జృంభకాస్త్రముల్
తను వరియింపఁ గౌశికుఁడు తానవి చేరిచె బాలరాఘవున్
ఘనమహితాస్త్ర సంతతిని గాదె రఘూత్తముఁడింత మేటియౌ॥ 86

అని లక్ష్మణుండు తెలుపఁగ
జనకజ! దివ్యాస్త్ర తతికి సాంజలివగుమా?
యని రాముఁడాడ నామెయు
వినమిత శీర్షాన మ్రొక్కె విస్ఫుట భక్తిన్ ॥ 87

లోకహితంబు గోరి సురలోక మహాత్ములు బ్రహ్మముఖ్యులా
త్మైక పరాయణుల్ బహుసహస్ర సమల్ తపముంబొనర్చి సు
శ్రీకములైన వీనిగని చేసి రవెన్నొ మహోపకారముల్
నీ కమనీయ గర్భమున నిల్చునుగాక మహాస్త్రసంపదల్ ॥ 88

రామ ముఖోద్గతామృతము ప్రాణ పదంబుగఁ దాల్చి సీత తా
నా మహనీయ మా శిశువు నందుటకున్ దలపోసె ధన్యగన్
స్వామి కనుండిదే మిథిల సాగిన సాధు కథాస్రవంతి యం
చామెకుఁ జూపె లక్ష్మణుఁడు సాద్భుతలోచనయౌచు నామెయున్ ॥

నాతి దీర్ఘంబును నాతి హ్రస్వంబును
సమమైన బొమ్మ నేత్రముల కొదిగి
సమ విభక్తాంగమై సౌష్ఠవశ్రీతోఁప
మాంసల స్నిగ్ధ సంపదఁ జెలంగి

దళిత నీలోత్పల ధగధగ శ్యామ సుం
దర తనూ శోభనోత్సవ మెసంగ
నవలీల నౌరౌర శివశరాసన మిట్టె
విఱుచు దోర్వీర్యమ్ము విస్మయముగ

సకల మిథిలాపురీ జన స్తబక నయన
మధుప మధుమాస సమయ సుమ స్రజంబు
కనుల నాకట్టునిదె స్వామి క్రమ దేహ
మిచట విలిఖితమౌచుఁ బర్వేందు వగును॥ 90

అను సీతావచనంబు వించు వదినే! యానిద్ది కన్నావె నీ
జనకుం డర్చనసేయు నిచ్చటనహో సంబంధులన్ బెద్దలన్
ముని లోకార్చనసేయు గౌతముఁడు సమ్మోదంబు నిండార దే
వనికాయమ్మునకైనఁ జూడనగు నీ బాంధవ్య మొప్పౌన్ సతీ! 91

కనుమని లక్ష్మణుఁడనఁగా
జనకులకును రాఘవులకుఁ జను బాంధవ్యం
బనఘా! యెవరి కనిష్టము
కననిచ్చును బుచ్చుకొనును కౌశికుఁడచటన్॥ 92

మతి మన్మఖ్యుఁడు రాముఁడిట్లన సతీమాణిక్య మాసీతయున్
గృత గోదానుల నన్న దమ్ములను రక్తిన్ నల్వురంజూచు చ
ద్భుతమయ్యెన్ మతి నాకు నేనిపుడహో పూర్వోత్సవంబందు ని
ల్చితి నన్నట్టులె తోఁచుచున్నది బలే చిత్రంబు చిత్రంబగున్॥ 93

అన నల్లేయగు జానకీ! కనుమిదే యానంద కందంబు క
మ్మని నీచేయి మనోజ్ఞ కంకణముతో మాంగళ్య [illegible]
ముని నా కప్పుడు హస్తమందునుప సమ్మోద[illegible] నందించె మూ[illegible]
ర్తిని దాల్చెన్ మహనీయమా మహామనన్ [illegible]॥



అనుచాఁనాటి మహోత్సవంబునను దానై యిప్పుడున్నట్లు ని
ల్చిన రాముం డరమూఁత కన్నులను బొల్చెన్ శిల్పరమ్యాకృ
జననీ! మాండవి యీ మెయా శ్రుతయశస్సనొక్కండు నీ ముగ్ధ
చని రామానుజుఁ డూరకున్న మఱి వా రవ్వార లెవ్వారలో?

కనవొకో నీ వటంచు జనకప్రియపుత్త్రిక చూపె నూర్మిళన్
గని తలవాల్చె లక్ష్మణుఁడు కమ్రముఖాబ్జ దరస్మితమ్ముతో;
విని శివచాప భంగమును వెంబడివచ్చిన వీర భార్గవుం
గను వదినేయటన్న నుడిగైకొని కాంచి భయమ్ము నందుచున్ ॥

దడనొక యడ్గు వెన్కకిడి ధారణిజాత వినమ్రమైన రా
ముఁడును నమోవచస్కుఁడయి ముందుకుసాగె ధరాత్మజాత మ
దడుగిడి యాత్మనాథు వినయంబునకున్ ముదమందు చంతలో
నెడఁదకుఁ బుట్టెనిల్లు విడుచెన్నగ నీని యయోధ్య గాంచుచున్ ॥

లలిత మనస్కుఁడై శ్వశురు లాలన నెంచుచుఁ దన్మయంబుగా
నిలిచిన సీత మూర్ధమును నెమ్మది మూర్కొని రాముఁడిట్లనెన్
దలఁపుము తండ్రి యప్పుడమిత ప్రియుఁడుండెఁ, దలంతు రమ్మలుఁ
నెలఁతుక నూతనాగతవు నీవు సుఖంబది యింక వచ్చునే?

కడచిన వాదినంబులిఁకఁ గాంచము, నీవపు డెంతయుంటివే
పడఁతి? శిశుత్వమున్ విడని పట్టివి, తెల్లని మొల్ల మొగ్గవై
యెడముగ నున్న దంతముల నించుక యించుక యావనంబు నఁ
దడుగిడు నల్లనాటి నిను హత్తిన యందము భద్రమెప్పుడున్ ॥

ఇదిగో మంథరయన్న తమ్ముఁగనియాయెన్ బ్రొద్దు, వేగమ్ముఁగనీ
బదమా! చూడఁగఁజాల నున్నదికదా! బాలా! కనుంగొంటి యిఁ
గుది నిద్దాని గుహుండు దీనికడనే కూర్మిన్ నిలంబెట్టి యే
గెద నన్నన్ జననీఁడ దెంతకును రాగిన్ జేసె నన్ ద్యాగినిన్ ॥ 1

అనుచున్ దాటుకపోవు రాఘువుని మర్యాదా స్వరూపంబు తోఁ
చిన డెందాన సుమిత్ర పెద్దకొడుకా చెంతన్ క్షణంబుండి వి
చ్చిన కన్నుంగవ బాష్పసంభరితమై చేలమ్ముతో నద్దుచున్
దనలోఁ దానుగఁ ద్రవ్వికొంచుఁ జనుచున్ దాత్పర్య నిష్ఠాత్ముఁడై॥

కొడుకులఁగాంచి, జీవితముఁ గోలి సమృద్ధిగ, వృద్ధరాఘువుల్
నడపిన తీవ్రమౌ వ్రతము నట్టనడింగని మూత్న రాఘువుం
డడవుల నుండె బాల్యమునయందె యనిష్టముకాని దీక్షమై
పుడమి సమస్తమున్ దనదు పుణ్యపుఁబంట నెడంద కద్దికోన్॥ 102

నా, జనకాత్మజాత యెద నర్తిలె లక్ష్మణు సౌహృదంబు, ని
ర్వ్యాజ పదార్థజీవనము, రామ పదాబ్జ మనోజ్ఞ భక్తియున్,
సాజమవైన సద్గుణ వశంవద చిత్తము, నట్టి పుణ్య వి
భ్రాజితుఁ దానొకప్పు డనుభ్రాంత వచస్సులు; నంతఁగుందుచున్॥

చనుచుఁ బ్రసన్న పుణ్యజల, శాంభవ జూటగుహా వినిస్సృతన్,
బనిత సమస్త పాపఘునపంక నిరాసనదక్ష, జాహ్నవిన్
గని మనమింత తేరికొనఁగా రఘువంశపు టాడుబిడ్డ వీ
వనయము నన్ను గావుమని యాత్మనుతించె నపారభక్తిమై॥ 104

రఘుకులదేవతా! కరుణ రాఘువులన్ మముఁ గావుమమ్మ! సా
రఘుజల! పాపఘుస్మర! చిరంబు తపం బొనరించి రాఘువుల్
విఘుటిత పాపులై సగరవీరకుమారులు వేల్పువీడు పో
నఘదళనన్ నినుంగనిరి యాత్త భగీరథ నామవైతివిన్॥ 105

కుల వధువీమె యీ కుసుమకోమలి నీయెడ భక్తురాలు నా
కలవడ శ్రేయముల్ వనములందుఁ జరింపగ నేగునప్పుడే
సలలిత భక్తి మ్రొక్కినది చానఁగనందగు నయ్యరుంధతిం
బలెనని రామచంద్రుఁడు శుభంకరుఁడౌచు వచించు చేగుచో॥ 106

యమున యొడ్డునఁ జిత్రకూటాధ్వమందు
నా భరద్వాజుఁ డాడిన శ్యామయన్న
వట వనస్పతిఁ జూచితే వదినె యనుచు
లక్ష్మణుఁడు చూప నామె వల్లభుని గాంచి॥ 107

స్మరియింతే రఘురామ యీ వటమనన్ సాశ్రుండు రాముండు వి
స్మరణంబెట్లు ఘటిల్లుఁ గాల్నడక శ్రాసంబై సుమాభంబులా
తరుణీదేహ లతాంగముల్ బడలఁ బ్రాప్తాశ్లేష సంవాహన
స్ఫురణన్ సోలి మదీయమా నెద శిరస్సున్ జేర్చి నిద్రించితో॥ 108

ఆత్మనుండి సముద్భవంబైన మనసు
మఱల నాత్మాభి ముఖముగా మలచు యోగి
యవనినుండి సముత్థితకంబైన తాను
శిఫల పేరిట మఱలఁ దాఁ జేరు నవని॥ 109

జనకులంతటి సత్త్వ మీ ఘనవటంబు
తాన వేఱౌచుఁదోఁచుఁ దత్త్వంబుఁ గన్న
యాత్మయే యెల్ల విశ్వమా నన్నవారు
నిన్ను నాకిచ్చినారు మనీషులగుచు॥ 110

అనుచునె తాదాత్మ్యముఁగను
ఘనాఘనాప ఘను రాము కత్రమ శరీరం
బునుగాంచి సోలు జానకి
వినుచున్ లక్ష్మణునిమాట వీథిక నడచెన్॥ 111

విపులారణ్య విరాధ రోధన కథావృత్తాంత మిందున్న ద
సత్రుఁడై యడ్డి మృతింగనన్ విబుధుఁడై సాధ్వాధ్వముందెల్పె నీ
కపుడెంతేని భయంబు కల్గె వదినే యన్నన్ ధరాజాత భూ
మిపుఁడీ రాఘవుఁజూడు వీచుకొను నెమ్మిన్ దాళవృంతంబుతోన్॥

అన శ్రీరాముఁడు దానికేమి లలనా! యా కొండ యెల్ల బండిన్
గనుమీ తాపసవాసముల్ మునిజనౌఘంబుల్ పథిశ్రాంతులన్
నిను గన్నట్టులె యాతిథేయ పరముల్ నీవార ముష్టింపచుల్
గనుచుండ్రెప్పుడు వారలెల్లరు నమస్కారార్హు లెవ్వారికిన్॥ 113

అనినంత సీత యా దిక్కునకుఁ దలవాంచి నమస్కరించి 114

అరరే యెన్ని నెమళ్లు పింఛములు వృత్తాకారతన్ విప్పి సం
బరమై యంబరమెల్లఁ దామె యగుచున్ బారాడు, నక్షత్రముల్
విరియున్నా విలసిల్లు పుష్పములతో వృక్షమ్ములున్ బొల్చు నీ
గిరి పేరేమి? వచింపవే మఱది కోర్కెన్ డెంద మూగాడెడిన్॥ 115

అనఁగా లక్ష్మణుఁడద్ది ప్రస్రవణమానమ్మా మహాపర్వతం
బన యంబందు సుమాళితో బహుకదంబానోకహశ్రేణి యొ
ప్పును నిత్యంబగు నేళ్ల గుంపులవి నిల్పున్ దాని పేరెప్పుడున్
ఘనమాలా పరివేష్టితాప ఘనుఁడకాంతార శైలుండహో! 116

విహారన్మృగ బహుసుందర
మహిత జనస్థాన విపిన మధ్యగుఁడమ్మా!
విహరించితి రీ రచ్చట
బహుతర సేవావకాశ భాగ్యము నిడుచున్॥ 117

అని యాఁగక యా పర్వతప్రాంత మహితానుభూతులనే
బహుధా ప్రశంసించుచుండ 118

స్మరియింతే సుతనూ! మనోహరముగా మన్నాము మున్నిచ్చటన్
బరిచర్యల్ మన లక్ష్మణుండొనరుపన్ స్వర్గంబు నా నొప్పి; సం
స్మరియింతే సరసాంబు సంభర విలాసన్ లాస్య గోదావరిన్
వఱలున్ నా మదిలో రహో విహరణ వ్యాహార సంభారముల్॥119

మెలమెల్లన్ దరికొగ్గి సక్తిమెయి నెమ్మేనుల్ సమాశ్లేష వి
హ్వాలమై చెక్కిలి చెక్కిలింగదిసి యయ్యోమాట లల్లల్ల ను

ల్లల దానంద తరంగ తుందిలత నాలాపించు చున్నంతలోఁ
దెలియంబోకయ రాత్రులెన్ని గడచెన్ దీర్ఘాంబు భూతాత్మికా! 120

శ్రీరాముండటు లంచు నుండఁగ శిరస్సీమంత చూడామణీ
స్మేరాంశుల్ ప్రియు పాద పద్మములపై సిందూరముల్ చల్లగా
నా రామా మణికుంచితాంగ యయి లజ్జాపాంగముల్ చారులై
వారింపంగనె రామచంద్రు మఱఁదిన్ భావింపఁగాఁ జేయుచున్ ॥ 121

అంతట లక్ష్మణుఁ డింకొక
ప్రాంతపుఁ జిత్రమ్ముఁజూపి వదినే యిదిగో
వింతైన దేవతాకృతి
సొంతము రూపమ్ముదాచు శూర్పణఖ యిదే! 122

అట నా పంచవటిన్ సయూటములు నై శాటీకృతారంభముల్
జటిలాలై విటతాటమై కటువులై సంగ్రామ తీవ్రంబులై
చటులాటోప పరాక్రమ స్ఫురణ వింశద్వీర సాహస్ర దు
ర్ఘట మాంసాశన ఘోర సంహరణ రుద్రఖ్యాతి తెచ్చెంగదే! 123

అనఁగా జానకి యాపయిం బతి ముదంబారన్ గనుంగో నభా
గ్యను రక్షోపహృతిన్ వినష్టనయి నే నంచున్ జనస్థాన మం
దను భూతంబగు దుఃఖమద్ది యపుడేయాచున్న దన్నంత వే
దన కల్గింపఁగ విహ్వలించునెడ సీతన్ రాముఁడోదార్చుచున్ ॥ 124

దుర్జన లక్షణంబె యిది దుఃఖమునే యెటులైనఁ గూర్తురా
కర్జముచేత నప్పుడును గార్యగతి స్మరణాన నిప్పుడున్
భర్జిత సాధులోక పరిభావన నిష్ఠురులంచు నాడఁగా
దుర్జయుఁడైన లక్ష్మణుఁడు తోరపు రాముని దుఃఖమెంచుచున్ ॥ 125

కఠినంబులౌ శిలల్ కరఁగి కన్నీర్వెట్టి
వజ్రంపు టెడఁదయున్ బ్రద్దలయ్యె
మాయామృగ వ్యాజ మానినీ హరణ వృ
త్తాంతమ్ము నెఱిఁగి విభ్రాంతుడఁపుడు

సీతామహాసాధ్వి చిన్నె కానక నాఁడు
వికలమ్ములైన సర్వేంద్రియముల
శోభాదరిద్రాణ శూన్య జనస్థాన
నిర్జనారణ్యా కంధిని మునింగి
వెక్కి వెక్కేడ్చుచున్న యీ ప్రియునిగాంచి;
దేని కదియాను కూడి రాదీ జగత్తు!
మాయ లేడిని చంపిన మాట వేఱు,
మానినిం గోలుపోయిన మాట వేఱు! 126

అనుచున్న తన్ను విని సీత స్వామీ! నా మూలమున నే గదా మీ కింత కష్టము వచ్చినదని తాను కన్నీర్వెట్టగా నాందోళన మందుచు శ్రీరామచంద్రుండు గూడ నట్లయిన నిదియేమన్నా యనుచు లక్ష్మణుఁడు 127

తెగిన సరాన ముత్తెముల తీరున వారక బాష్పబిందువుల్
తెగబడి జాఱు ధారణికిఁ; దేర్ప నదెంతగ బిగ్గఁబట్టినన్
బగిలె నెడంద యన్నటుల పైకిని గ్రిందికి నుద్ధృతంబుగా
నగడగు ముక్ పుటంబు లధరా ధరమున్ వివరించి చెప్పెడున్ ॥ 128

నా విని రాముండు 129

నాటి ప్రియా వియోగ మది నాకు సుదుస్సహమయ్యు శత్రువున్
మీఱెడి తీవ్ర కాంక్షబడి మేకొని తాళగ నయ్యెఁ దమ్ముఁడా!
నేటికి దుఃఖవహ్ని మదినిండి పునర్జ్వలితస్థితిన్ బడే
నూటిగ హృద్వ్రణంబు కలఁచున్ మఱి దుర్భర వేదనం బిడున్ ॥ 130

అనినన్ సీత యయో యయో యసహామా నాకష్ట మానాడు న
న్ననుమానింపక దుష్టుఁడౌ యసుర బాహాకృష్టగావించి గో
ల్లున గొంతెత్తి విలాపమున్ జలుపు నన్ లుప్తస్మృతిన్ మింటికిన్
గొని చన్నప్పటి భీతి యేచి యిపుడున్ క్షోభంబు గావించెడిన్ ॥ 131

ఒకరి నోదార్ప నొకరుగా నూహచేసి
తామె దుఃఖాన మునుఁగు నా దంపతులను

దేర్పఁగా నెంచి లక్ష్మణుం డోర్పుతోడ
నవలి చిత్రమ్ము కనఁజేయు చవని పుత్రి! 132

బహు మన్వంతర జీవి యాతఁడు పితృప్రాణుండు త్వత్ప్రీతికై
సహసోత్థాపిత పక్షతి ద్వితయ సంస్ఫాలన్మహావేగుఁడై
విహరించున్ దివి రాక్షసాధముని దోర్వీర్యమ్ము మర్దించుచున్;
విహసాక్షుల్ విడి తల్లి చూచునదె తృప్తిన్ దాత నుద్దండునిన్॥ 133

కనుఁడీ యన్న సతీ పతుల్ దివి దెసన్ గై మోడ్పు సంధించి యో
ఘనబంధూ! నినువంటి జీవుఁడొకఁ డింకన్ గానరాఁడయ్య నీ
మనసేమీ నెనరేమి స్నేహమయ సామ్రాజ్యాధిపా! వైరిహా!
చన లేదీవు దురాత్ముఁడే మడిసె వంశంబెల్ల నిర్మూలమై! 134

అనుచు జటాయువు నా సీతయున్ రాముఁ
డంజలించుచు భక్తినళ్లె నిలువఁ
బరికింప నింకను బహుచిత్ర పటములు
కలవన్న దృష్టి లక్ష్మణుఁడు కదలి
చనుచు జనస్థానమునకుఁ బశ్చిమ దిశఁ
గుంజవంతంబను కుధర మిదియె,
యా ప్రక్కనే దండకారణ్య భాగాన
దను కబంధుండుండె, దాని ప్రక్క

ముని మతంగుని యాశ్రమమున వసించి
శ్రవణి యన్ సిద్ధ శబరి తా శ్రమమువాపె
నదియె పంపా సరస్సు ఫుల్లాబ్జ బహుళ
యని యొకొక్కటి చూపుచు నరుగుచుండ॥ 135

పంప యనుమాట చెవులలోఁ బడిన యంత
నచ్చటే కద శ్రీరాముఁ డధిక దుఃఖ
భార మోర్వంగ లేక యీ ప్రాణి నెంచి
ధైర్య మెడలిన వాఁడయి తల్లడిలియె॥ 136

అన్న ప్రియురాలి మాట తా నాలకించి
పరమ గంభీర హృదయుఁడౌ వల్లభుండు
తొందరం పడు తమ్ముని బొందఁ జూచి
యున్నచో నిల్చి హృదయమ్ము నోలుకఁ బోసె॥ 137

ఓపఁ జాలని దానవై యుంటఁ జేసి
చాల సేపిందు నిల్వగాఁ జాలవనుచు
సాగుచున్నాఁడు మఱది నాస్వాంతమేమొ
యా కబంధాదులను వీడ దట్టె తగిలి॥ 138

ఈవు విరాధునే యెఱుఁగు దీ ఘనబంధు కబంధుఁ డంతకున్
జేవ గలాఁడు వానివలెఁ జేడ్పడి దేవతయై వచించె సు
గ్రీవుని జేరి మైత్రి పొనరింపుఁడు మీకు శుభంబు గల్గు నం
చావిధి నాచరింపఁగదె యంగన నీవు లభించి తింతకున్॥ 139

ఆ మతంగ మహర్షి మాహాత్మ్య మింత
యని వచింపఁగఁ బూన సాధ్యంబు కాదు
ఆ మహామహు పూర్ణదయా విశేష
మున నె నే నిప్డు జీవించి యునికి యందు॥ 140

ప్రేయసిం గోలు పోయి నిర్భిన్న హృదయుఁ
డై యొకానొక జీవుఁడే యడవులందు
తమ్ముఁ డొక్కండె తోడుగాఁ దన్వి కొఱకు
దేవులాడు నటంచు నా దేవుఁ డెఱిఁగి॥ 141

నా కొఱ కెంతచేసె లలనా! యది నీవెఱుఁగంగ లేవు నా
రాకను వేచి యుండుమని రామకుఁ జెప్పి తపఃఫలంబుచే
నా కమనీయ కాననము లన్ని ప్రభావితముం బొనర్చి నే
నాకడ చేరునప్పటికి నాంతర తాప మడంగఁ జేసెఁబో॥ 142

అ ముని దివ్యమా మహిమ యంతటి తాప మడంపఁబట్టె యా
రామ గుణాభిరామ, యవిరామ తపః పరిపక్వ జానకీ

రామ మనో౽భిరామ ననురాముని నిన్ను బలెన్ గనంగ నే
నామెను వృద్ధురాలి మనమార భజించి నినున్ స్మరించితిన్॥ 143

దేహమిది మట్టిముద్ద వై దేహి నిజము
ఆ శబరి నాఁడు నన్నట్టు లాడుకొనక
యున్న నేమయి యుండునో యూహకంద
దామె పుణ్యాన నేఁడు నిన్నందుకొంటి॥ 144

దేవీ! పంప కడున్ మనోహరము తత్తీరంబు నందుండి యం
దావర్తించు మనోజ్ఞ హంసకుల పక్షాఘాత పద్మమ్ములన్
స్రావద్బాష్ప విరామకాలములలో రాజీవనేత్రా! నినున్
భావంబందున నిల్పి చూచితి పునర్బాష్పాంబుధారాప్లుతిన్॥ 145

అనుచుండ నీయనయే యార్య హనూమంతుండని లక్ష్మణుండు
చూప 146

చిరనిర్వ్యాథ సమస్త జీవగణ సంజీవన్మహా పుణ్య ని
ర్భరుఁడీ ధీర మహానుభావుఁడని సంభావించెనా సీత, స
త్కరుణన్ మమ్మును లోకమున్ దగఁ గృతార్థత్వంబుపొందించె నీ
పరమాభీలుఁడు వీర్యవత్తముఁడు దైవంబంచు రాముండనెన్॥ 147

అంత సీత అయ్యా! లక్ష్మణా! ఈ గిరి పేరేమి? దుఃఖభార
సమ్మూర్ఛితుఁడై చెట్టుకొమ్మ నాలంబించి యార్యపుత్రుఁ డిట
నున్నాఁడన 148

మాల్యవంతంబు తల్లి తన్మహిత నగము
క్లృప్త ఘనజాల మకుటంబు కకుభ సురభి
అని లక్ష్మణుఁ డనుచుండ 149

చాలు నిఁకఁ జెప్పఁబోకు దుస్సహ మదంత
తిరిగి సీతావియోగమున్ దెలుఁగుఁదోఁచె॥ 150

అని వారించుచు రామచంద్రుఁడవనీజాక్రాంత బాహుద్వయీ
ఘనసమ్మోదము నందుచుండ నటుపైఁ గాలాభులౌ వానరుల్

చెనకంగా ఘనరాక్షసుల్ మఱియు నిస్సీమ ప్రతాపోన్నతుల్:
ననవోలెన్ వసివాడె నీమె చనుమన్నా యింక విశ్రాంతికిన్॥ 151

అనఁగా లక్ష్మణుఁ, డన్న యల్లైయని కాంతాపాంగ మీక్షించుచున్
గానకే చిత్రము తీర్చె నర్జునుఁడు నాకున్ జెప్పు నాన్ దేవి య
గ్గిని శుద్ధింగని తేఱి వచ్చుటని భక్తిన్ సోదరుండాడ ని
ల్చిన రాముండిట నిల్చి యిట్లు పలికెన్ స్నిగ్ధాంతరంగంబునన్॥ 152
శుద్ధోత్పత్తి గలట్టి సీతకు నహో శుధ్యంతరం బేల సం
శుద్ధిన్ గోరునె వహ్ని? పావనతర స్రోతస్వినీ వారికిన్
శుద్ధుల్ కావలెనే? స్వతః పరమ సంశుద్ధా! జగత్పావనీ!
సిద్ధాంతాఖిల! యజ్ఞసంభవ! మహచ్ఛ్రేయోనిధానా! సతీ! 153
అంచున్ రాఘవుఁ డామెఁ గొంచుఁ జనుచో నాయమ్మ సాకూతయై
నించున్ నామది చిత్రదర్శన విధిన్ స్నిగ్ధాభిలాషం బొకం
డంచున్ స్వామిని జూడ దేవి! యది యేదైనన్ సరే చెప్పవే!
పంచెన్ శ్రీగురుపత్నిగూడ నది తీర్పన్ నిర్విలంబంబుఁగన్॥ 154

దేవి యాదేశమును శిరసావహించి
దెప్పరంబయ్యెఁ గోర్కె నేఁ దీర్తు నిజము
తెలుపవే యన్నఁ గనులలో దీప్తు లొలుక
తల్లి యిట్లనె పరమ శాంత స్వభావ॥ 155

శాంత గంభీర మునిగణ చరణ పుణ్య
వనము లందేను తిరిగి రావలెను స్వామి!
సౌమ్య శిశిరావగాహ శ్రీ రమ్యగంగ
పుణ్య సలిలావగాహంబు పొందవలయు॥ 156

మునిపత్నుల్ నను దల్లులన్ బలెనె సమ్మోదంబునన్ సాకి రా
ర్య నుతల్ దేవతలన్ సభక్తిక సమర్చన్ దృప్తులం జేసి దీ
వనలందన్ జనిరావలెన్ విధిగ దేవా! నన్ను మన్నింపవే
పనులంచున్ జనదిట్టి కోర్కెయన కీవై తోడుగా రాగదే! 157

అని పెనవేసి కొంచదుగు నాయమ వంక నొకింత జాలిగాఁ
గని తగునిట్టికోర్కి జనకప్రియ పుత్త్రికనీక, తోడుగాఁ
గను నను రమ్మటంచు నడుగన్ వలెనే దయ లేదు నీకనన్
జనకజ రాము మోము జలజమ్మున ఝుమ్మన భృంగమై చనెన్ ॥158

వత్స లక్ష్మణ! వింటివా వదినె వాంఛ
దౌహృదము గానఁ దీర్పంగఁ దగును మనకు
సముచితంబుగ నర్జును సత్కరించి
వలయు సన్నాహమున నింక వలలు మీవు॥ 159

రామాజ్ఞన్ గొని లక్ష్మణుండు చనఁగా శ్రాంతన్ సతిన్ గాంచుచున్
సామోదానిల వీచి సొగునిట విశ్రాంతిం గొనంగా నగున్
స్వామైపోతివి సుంత కే యరుగ దే చల్లంగ మేన్వాల్చి ని
ద్రామోదంబునఁ దీర్పుమా బడలికల్ తన్వంగి భద్రంబగున్ ॥ 160

అనుచున్ రాముఁడు సిగ్గునం జడియు నయ్యర్ధాంగి కేలూని మె
ల్లన వేదిన్ దరియంగ నామెయట నుల్లాసాన మేన్వాల్చఁబో
ననుగుం బ్రేయసి నల్లనానుకొని తానందుండి సాకూతిమై
నను నిట్లాత్మవశుండు రామవిభుఁడుద్యన్మానసాబ్జుండహో! 161

ఇందుకరచుంబిత స్యంది హిమకరమణి
హార విభ్రమ మూచు సన్నాహరించు
సాధ్యస శ్రమబిందు సంశ్రయ మనోజ్ఞ
మైన నీ బాహులతిక—కంఠార్పితమ్ము 162

చేయవే ప్రియా! నాకు నుజ్జీవనముగ
ననుచు నన్నల్లె తత్కరం బంది కొనుచుఁ
గంఠమణిహారముగఁ దాల్చి కనులు మూసి
యేమియను భావమయ్యె నిదేమి యనుచు॥ 163

సుకమో దుఃఖమొ మోహమో నిదురయో చోక్కానో
సుక్కొనొకో

సకియా! నిన్నిటు సోకినంతటనె నా సర్వేంద్రియంబుల్ జడా

త్మకతం జెందు నదేదియో వికృతి నందంజేయు సర్వస్వమున్
వికసించున్ ముకుళించు నే మనెదనే విద్యుత్ప్రసారాంబకా! 164

చెవులకు విందులై, మనసు చేవ గడింప రసాయనంబులై,
తవిలి హృషీక సంతతికిఁ దన్మయతన్ ఘటియించుమందులై,
మివులగఁ దర్పణం బొసఁగు మేల్చవులొ చును వాడి వత్తలా
పువు వలె సోలు జీవమును ఫుల్లమొనర్చెడి నీదు వాక్కులన్॥

కలకంఠీ! తలపోసెద
బిల బిల నినదించు గహన వీథుల సోనల్
పలుకుల చెవి పలికించిన
విలసిత మృదువీథి కచ్ఛపీ నినదంబుల్॥ 166

అని శ్రీరాముఁడనంగ మోహకముగా నన్పుండ నత్యంత తృ
ప్తిని దానందియు సీత స్వామి యిది మీ ప్రీతి ప్రభావంబగున్
గన నాశ్చర్య మదేమి యున్నదిట నైనన్ నాకు మేన్వాల్పుఁగా
ననిపించున్ నిదురేమొ వచ్చునటులై యన్నన్ ప్రియుండంతటన్॥

అర్థమయ్యెను దేవి నీ యంత నీవు
చెప్పవలెనో త్వదీయ హృత్సీమయందె
యెల్ల వేళల నుండు నా హృదయమునకు
నిదురకున్ సాధనంబు సన్నిధినె కలదు॥ 168

అహహో! ఉద్వాహమైన దాదిగ సతంబానంద సంధాయియై
గృహమందున్ వనమందు బాల్యమునఁగా కీ యౌవనంబందు ప్ర
త్యహమున్ సీతకె స్వాపహేతువగు చన్యాసంగ భావంబె దు
స్సహ మా రాముని బాహువే తలగడో స్వాపంబు నందంగ దే! 169

అనుచు సీతామనోహరుండపుడు తానె
యెడమ కొత్తిగిలి పరుండి యెడమచేయి
మహిత పౌష్కల్య సుస్నిగ్ధ మాంసలంబు
చాచి సంకోచమందు నాచానఁ దిగిచి॥ 170

మెల్లగా బుజ్జగింప నెమ్మేనువాల్చి
కుడికి నొత్తిగిల్లుచుఁ దలగడ యనంగఁ
దనదు చేయిపై నామెయున్ దల నునుపఁగఁ
గన్నుల న్నీడఁజూచి కొంచున్న యంత॥ 171

చిత్రదర్శన వేళ నా సీత పడిన
దైహికశ్రమ యట్లుండ నూహా చేతఁ
బూర్వ దుఃఖానుభూతిఁ బ్రభూతమైన
బడలి కగుటను గట్టిగాఁబట్టె నిద్ర॥ 172

అప్పుడు శ్రీరామచంద్రుండు 173

అపుడె నిద్దురపట్టె నీ యతివ చాల
నలసినది పాపమన్ని బొమ్మలను జూచి
పరమ సుకుమార గాత్రి యీ పడఁతి మిన్న
యెంత పుణ్యంబొ నాకు నీ యింతి దక్కె॥ 174

ఈమె ప్రత్యంగ దీప! మాయింటి లక్ష్మి!
కనుల కమృతంపు వత్తి! నా తనువునందు
మంజులా లేపనార్ద్రి సమ్మర్ద సురభి!
యీమెదోర్వల్లి కంఠమందింపు లొలుకు 175

శిశిర మౌక్తిక సరముగాఁ జెలఁగుచుండు
నీమె సంబంధమైనది యేమి గాని
క్షణమె చాలును ప్రాణ తర్పణము చేయుఁ
గర మసహ్యముగా నగు విరహ మొకటె! 176

అని యనుకొనుచుండగాఁ బ్రతీహారి వచ్చి 177

వచ్చెనయ్యా యటంచుఁ దాఁ బలుకుచుండ
నేమిరా యని రామావనీశుఁ డడిగె
వచ్చె దుర్ముఖుఁడనియె దౌవారికుండు
నగు నుపశ్రుతి కాత్మ విహ్వలతఁ గనుచు॥ 178

జనపదంబుల పౌరు లీ జనుని గూర్చి
యేమి యనుకొంచు నుండిరో యెఱిఁగి రాఁగ
మత్ప్రయుక్తుండు చారుఁ డిమ్మాని సనుచుఁ
ద్వరగ లోనికిఁ బంపుమవ్వాని ననియె॥ 179

ప్రతీహారి నిష్క్రమించి రహస్య సమాచారము సేకరించుటకై దుర్ముఖ నామంబున వ్యవహరించు రామభద్రుని బాల్య మిత్రుం డయిన భద్రునిఁ బ్రవేశపెట్టిన నా గూఢచారి 180

అయయొ సీతామహాసాధ్వి నధికరించి
యింత యనరాని మాట నే నెట్లువినుతు
రామునకు బహిః ప్రాణ మా రామగాదె!
విధి బలీయమ్ము; తెలుపుఁటే విధియునాకు॥ 181

అనుకొనుచు వాఁడు చేతులు కట్టుకొని నిలిచియుండ 182

ఎక్కడున్నావు సౌమ్య! రావేమి నాథ!
యని కలవరించు ప్రేయసి మనసు నెంచి
యయయొ యీయమ యెదకుఁ దాహత్తు కొనియె
చిత్రదర్శన జాత విచిత్ర భీతి! 183

మద్విరహ భావనమ్ము నేమఱదొకింత
యతి భయంకర మాట నాయడలు విడదు
ఇప్పుడగుచున్న యట్టులే యెప్పుడుండు
నీమె నేకాదు నన్ను నట్లే యదల్చు॥ 184

అని రామచంద్రుండు తలపోయుచు నామెకు స్వాస్థ్యము కలిగించు తలంపుతో మెల్లగా నామె దేహవల్లరి నిమురుచు 185

అద్వైతంబయి సౌఖ్యదుఃఖముల సర్వావస్థలన్ వ్యాప్తమై
యుద్విగ్నంబగు గుండె శాంతిఁగను భద్రోద్దేశమై వార్ధకం
బద్వేష్యంబగు ప్రీతికి న్నిలవుగా నావారకంబెల్లఁ బో
హృద్వీథిన్ జిరమైత్రి సారమగు నీ యేకత్వ మగ్గించెదన్॥ 186

ఈ సుమానుష మెవరు ప్రార్థింపరకట
ఆలు మగలాటకింత మహత్తరంబు
పేరు వచ్చుటె యార్య సంస్కార మెంత
మహిమగలదానో తెలుపు మర్మంబు విప్పి॥ 187

అని తానొనర్చిన యుపచారమ్ముల నామె సుఖనిద్ర నందు
చుండ రాముఁడు దుర్ముఖున కభిముఖుండయ్యె నంత నతఁడు జయము
జయము దేవా! యని యూరకుండిన నుపలబ్ధమైన దేదియో వెల్ల
రింపుమని రాముఁడొత్తిడి పెట్ట 188

పౌరజాన పదులిది సంబరముగాగ
రామ రాజ్యంబునందు సర్వత్ర సుఖులు
తలఁచుచున్నారు మదుల నా దశరథుండు
మఱపు పడె రామ దేవుని మహిమ ననుచు॥ 189

అని పలికి మరల దుర్ముఖుఁ డూరకుండిన 190

సర్వసామాన్యమైన ప్రశంస యిదియు
దీని నంతగ మనము ప్రధానమంచు
నెంచ నేరాదు దోషమ్ము లేవియైనఁ
దెలియవచ్చిన నవ్వానిఁ దెలుపుముందు॥ 191

అని రఘూత్తముఁ డతఁడదేమైనఁ దెలుపు
నేమొ యని శాంతమతి యయి యెదురుచూడ
నసలు భద్రుఁడు దుర్ముఖుఁడైన వాఁడు
పేరుమార్పున సర్వమున్ మాఱినట్లు॥ 192

రాము చెవిచెంతఁ జేరి యారాటపడుచు
నోరురాక యుండగ నరుంతుదమునైన
యార్తినందుచుఁ దుదకుఁ బ్రయత్నమొప్ప
నేదియో చెప్పి చెప్పట కేడ్చుచుండ॥ 193

ఊరక విశ్రాంతి గాగఁ దా నూరుచూచు
చున్న వేళను వినయాన నొదిగి యొదిగి

యెవ్వరో వచ్చి యోమ్మునం దేపుమీాఱ
గ్రుద్దిచన్నట్టులై పతి కూలఁబడిన॥ 194

భద్రుఁడు రామభద్రుకయి భావమునన్ గొలలేని బాధ ను
న్నిద్రతనంది యాతురత నేర్చినరీతి ననేక శైత్య ర
సార్ద్రవ సేచనమ్ములను గాయము తాపము వాసి తేఱ న
క్షుద్ర సపర్య చేయఁదుదకున్ స్మృతివచ్చిన రాముఁడార్తుఁడై॥ 195

అయ్యయో యెవ్వరేమి సేయంగలారు
రిపు బలాత్కృతి వత్సరం బపుడు నిలువ
వలసి వచ్చెను దానికై పడినపాట్లు
వ్యర్థమైనవి నేఁడు నిష్పచ్చరముగ॥ 196

అద్భుతోపాయములను మాయంగఁజేసి
పోయెనై పోయెనని తలపోసి యుంటి
సూటి నయ్యది తిరిగి ప్రస్ఫుటితమాచు
పిచ్చికుక్క విషంబు నాఁ బెరుగు నిపుడు॥ 197

మందభాగ్యుల నాకంటె మహితుఁడెవఁడు
సుఖవిరాముఁడు రాముఁడై స్రుక్కినాఁడు
ఏది యెటులైన నిపుడు నేనేమి చేయ
వలయు-నిట్లగుంగాక తప్పదిఁక నాకు॥ 198

సజ్జనుల కెంత దురవస్థ సంభవించి
నప్పటికి లోకమలరించుటగు మతంబు
తండ్రి నెమ్మెను వాల్చె నీ ధర్మమందు
నేను వలసిన ప్రాణాలనైన విడుతు॥ 199

అస్మదాచార్య భగవంతులౌ వశిష్ఠు
లింతకున్ ముని సందేశమిడిరి గాదె
అప్పుడే మంటినో యది యక్షరాల
నాచరింపగనైన కార్యంబు వచ్చె॥ 200

ఆ సవిత్రుఁడాదిగాఁగ సర్వావనీశు
లున్నతుల్ ధర్మచారిత్రు లుత్తములును
మత్కృతంబుగ వంశాన మచ్చయగుట
యనఁగ నింద్యము నాకంటె నధముఁడున్నె? 201

హా! దేవయజ్ఞావనీ దృష్ట నవశిశూ!
జన్మ పవిత్రతత్త్వా తనూజ!
హా! రామజీవితా! హా! శీలశాలినీ!
హా! మహాముని జనకాత్మజాత!
హా! వశిష్ఠారుంధతీవహ్ని సంస్తుతా!
హా! తాత సుప్రియా! హా! మనోజ్ఞ!
హా! సర్వ వనవాసహారి మత్ప్రియసఖీ!
హా! మితభాషిణీ! హా! ప్రశస్త!

ఇంత సద్గుణశోభిత వే, యనేక
ముని జనానంద హేతు నందన వె, యింత
సర్వ సుజన ప్రశస్తవే స్వాధి! నీకు
నేమి యీ దుష్టమగు పరిణామమేమి? 202

నీ వలన సర్వలోకముల్ పావనములు
నీ వపావన వంట జనావళికిని
నీవెదిక్కౌదు దేవి యీ నిఖిలమునకు
నీవ దిక్కౌదు దానవైనావు నేఁడు॥ 203

అని కృత నిశ్చయుండయిన యానవభూపతి రామరాజు భద్రుని దన చెంతకుం బిలిచి తొందరగాఁజని నీవు లక్ష్మణుం గని నవధర్మనేత మహీకాంతుఁడు నిష్ఠురుఁ డాజ్ఞ యిచ్చె నిట్లని వచియింపు మీ వనుచు నాతనికిన్ జెవిఁజెప్పె నేదియో! 204

తన చెవిలో రాముని బడి
వినవచ్చిన పలుకు విషము విగతప్రాణుం

డన నున్న భద్రు నసువులఁ
గనఁ జేయుటె కాక మిగులఁగనలఁగఁ జేయన్॥. 205

అగ్ని పరిశుద్ధయై సుజనాభి నంది
తాత్మయై గర్భభారాల సాంగియయిన
దేవి దుర్జన వచనావ ధీరితయయి
విభునిచేఁ బరిత్యక్తయా విధి యిదెట్లు? 206

అనఁగనే శ్రీరామచంద్రుండు 207

ఏమయా నీవు దుర్జను లెవరినందు?
పౌర జానపదుల? పౌరపాటు మాట!
అగ్ని పరిశుద్ధి జరిగిన దచట నెచటొ
నమ్మ నెట్లగు నిచటి జనమ్ములకును? 208

సవితృ వంశాభిమతులైన జనములందు
దైవవశమున బీజ ముద్భవత నందె
పాలకాచరణీయ మవశ్య మదియె
కానఁ బొమ్మింక రాజాజ్ఞ కాదునాక! 209

అనుచు గద్దింప వాఁడు హా! దేవి జానకీ! యని యింతటి యనర్థమునకుఁ దానే కారకుఁ డన్నట్టు లాక్రందించుచుఁ బోగా శ్రీరామనేత 210

కష్టమతి కష్ట మెంత భీకరము కర్మ
మిచట నీ నృశంసుఁడు రాముఁడే తగునటె!
ఉభయతో భ్రష్టుఁ డయ్యె నీ యున్మదుండు
ధర్మ బుద్ధిని జేయు నధర్మ మిపుడు॥. 211

పిన్నతనము నుండియుఁ బెంచుకొన్న ప్రియను
అధిక విశ్వాస, నన్యాశ్రయంబు లేని
దాని నర్పింతు మృత్యుహస్తమున వంక
నంతకున కిచ్చు పెంపుడు జంతు వనఁగ॥. 212

పరమపావన జానకి పాపి నేను
తాకి యపవిత్రఁ జేయఁగాఁ దగదు నాకు
ననుచు రాముఁడు చాచిన తన కరంబు
వెన్కకుందీసి మొగము కప్పికొని పొగిలి॥ 213

ఓ యమాయిక! నన్నింక నుజ్జగింపు
మీ యపూర్వకర్మ కతను బోయవాని
విషకుజంబును చందనోర్వీరుహంబు
నాఁగఁ దలపోసి చేరియున్నావు నిజము! 214

అనుచు నచ్చోటినుండి లేచి దీనితో జీవలోకమంతయుఁ దల క్రిందైనది. నేటితో రామజీవితము నిండుకొన్నది. ఇఁక నీ జగత్తు నాకు జీర్ణారణ్యమే! సంసారము నిస్సారము. ఈ శరీరము నిర్జీవమగు నట్టి యెండు కట్టియ. నా కింక దిక్కు లేదు. నేనేమి చేయుదును? ఎచటి కేగుదును? 215

ప్రాణ మున్నది దుఃఖాను భవము కొఱకె
యౌను కాఁబోలు నీ రాము మేన నిజము
కాక ప్రీలి పోదేమి ముక్కలుగ నగుచు
వజ్ర కీలిత మయ్యెఁ గావలయు నిద్ది! 216

ఓ గురుపత్ని! సీతాగతాఖిల ప్రత్య
యా! యల్క ననుఁజూడ నందువేమొ?
ఓ మహేశ్వరులు విశ్వామిత్ర గురు వశి
ష్ఠ మహర్షులారా! ప్రసన్నులగుదు
రా నాయెడల? నోయి ప్రజల ద్వహ్ని! వి
స్మయ హత దేవతల్ సాక్షిగాఁగ
హిమసమాన తను మహిమగల మహిజాత
నొసఁగి నావప్పు డనూహ్యముగను
ఓ వసుంధర! యో విదేహోర్వి పాల!
దానవాపహృత జనకజానయన మ

హా కృతి ననంత విపుల సాహాయ్య మమర
గెల్పుఁ దెచ్చిన సుగ్రీవ! కీశరాజ! 217

ఆపదుద్ధారకా! ఆంజనేయా! వీర!
శరణంది రిపు రహస్యంబు తెలిపి
పరమోపకారంబు జరుపు విభీషణా!
నన్ను నా సీత నా సన్న మరణు
లను గల యాథార్థ్యమును దెల్పి యన్యోన్య
మసువులన్ నిల్పిన యసుర త్రిజట!
రాక్షసీ రూపామరీ! క్షమింతురె నన్నుఁ
బరమ కఠినుఁడు, నుత్పథ విగామి

నమ్మ రానట్టి వాఁడు నేత్రమ్ములకును
దోఁపఁజేయున దొకటి లోఁదోఁచునట్టి
దిం కొకటి గాఁగ నెల్లర నెల్ల వేళ
నెల్లచోట్లను నైపుణ్య మేపుమీఱ॥ 218

మోసగించెడి రామావ నీశుఁడన్న
వంచకాగ్రేసరుండు, నిర్వక్రలోక
చక్రవర్తిచే నెల్లరున్ సాధుమతులు
వంచితుల్ పరివంచితుల్ పాపమయ్యొ! 219

ఇంత కంటెను నవమాన మేమియుండు?
మిమ్ము నేమి రాముండేమి నమ్ముఁడంచుఁ
బిలుచుటేమి! మీర్ బదులింకఁ బలుకుటేమి?
బట్ట బయలయ్యె రాముని గుట్టుమట్టు! 220

ఈ కృతఘ్నుఁడు దుర్మతి యీ కఠినుఁడు
పిలుచు మాత్రాన పరమ పవిత్రులైన
మీ రపుణ్యాతఁ బాపులై నారలయ్యె
పాప సంస్పర్శనమున నిష్పాపులట్లు! 221

ఇంత పేర్కొ-నరాని చూడరాని మూఁజూడరాని ముట్టరాని చవిఁజూడరాని తలపోయరాని కష్టాతి కష్టచరితుండనైన నేను 222

నమ్మకము చేత హాయిగా నమ్మునాని
యాదమఱచి నిద్రించు నిర్వ్యాజ సఖిని
ఇంటియాలిని ప్రియురాలి నింటి వెలుఁగు
నెన్న నెపుడైన ప్రసవింప నున్నదాని॥ 223

మాంసభక్షక ఘోర విధ్వంసకారి
పక్షి జాతికి బలిగ నర్పణ మొనర్తు
ననుచు రాముఁడు వినయాన జనక జాత
చరణ జలజాతములయందు శిరసుఁ జేర్చి॥ 224

ఈ జీవునకీ యదృష్ట మిదియే తుట్టతుది కాఁబోలునని భళ్ళు మని పగులబడ నెటనుండియో తెలియరాకుండ దయఁజూడుఁ డను నార్తాలాపముతో 225

యమునాతీర నివాసులు
యమిజను లమితార్తినంది యాశ్రిత కల్ప
ద్రుమమైన నిన్ను జేరిరి
జము వీడంపించి లవణు సాకుము వారికిన్॥ 226

అను నబ్రహ్మణ్యోక్తి వినవచ్చినంత నే రాముఁడకృత్య కరణ దుఃఖావేశమంతయు మహా వాయునిర్ధూత నిర్జలాంబుదంబుల వలెఁ బటాపంచలు కాఁగా 227

ఇంకనున్ రాక్షసార్తి యీ యిలని దెట్లు?
దుష్ట కుంభీన సీజుఁడు, శిష్టలోక
బాధకుండయి చెలఁగు నమ్మాధురుండు
దునిమి లవణుని వచ్చు శత్రుఘ్ను డిపుడె॥ 228

అని దుష్టరాక్షసారి వీరవహుండయిన శత్రుఘ్నుని బంపి యా పీడ నివారించెదనని నిశ్చయించి హాయిగా నిదురించుచున్న సీతా

దేవి యమాయికంబయిన మోము కనవచ్చినంతనే మరల దుఃఖ
ముబుక 229

అయ్యయో దేవి యిట్లు నీ వరుగు టెట్లు?
తల్లి భూదేవి! లోకమంతటను నిండి
యుంటి వీవమ్మ యేపాప మంటరాని
పరమ పావన చరితఁ గాపాడు మమ్మ! 230

అధిక పుణ్యాద దేవ యజ్ఞాంగణమున
జనక రాఘవ పుణ్యవంశములు కలిపి
యే మహాగోత్ర మంగళం బెంచి ఋషులు
జానకీరాము లన్నారొ?—జరుగునిట్లు! 231

అని కుసుమకోమల హృదయుఁ డయిన రాముఁ
డిట్లు కదలాడి వల వల నేడ్చు చవ్వ
డచటు విడిచి పరిభ్రాంతుఁ డెచటికో చన
నులికిపడి లేచి సీత యయ్యో యటంచు॥ 232

పాడు కలవచ్చెఁ గలఁచె భావమ్ము సర్వ
మెక్క డున్నావు సౌమ్య! రావేమి యిటకు?
దర్శనం బీయు మార్యపుత్త్రా యటంచు
భీరు వగుచును గొంతెత్తి పిలిచి పిలిచి॥ 233

కలను నేఁగాంచు విప్రయోగమ్ము నాదు
వెంటఁ బడినట్టు లిచటఁ గన్పింపఁడయ్యొ
రాముఁడే మయ్యె? గట్టి నిద్రను మునింగి
యొడలు తెలియక యున్న న న్నొంటరి విడి॥ 234

ఎచటికో యెట్లు పోయెనో యెఱుఁగరాదు
సరియె కానిమ్ము నేఁడిటుల్ చనుట తోనె
యయినదా యేమి రేపు నా కగపడఁ డొకొ
పరముఁ డవ్వాఁడు నా కంటఁ బడిన యంత॥ 235

కరఁగకే నిల్వారించుకోఁ గలిగితేని
నడుగు దాటంగ నీయక కడిగివైతు
నెటులు చేయంగఁ గల్గె నింతటి యకృత్య
మేమి యనుకొనె సాధింప నేమి కలదు? 236

సర్వముం దేల్చివైతు లక్షణముగాఁగ
ననుచు నెవరురా యక్కడం చరసినంత
దుర్ముఖుఁడు వచ్చి చేతులు దోయిలించి
దేవి! యవధారు లక్ష్మణుం డీవిధముగ॥ 237

మనవి సంపెను రాజు నాజ్ఞను వహించి
తాము కోరిన మునిపత్ని దర్శనాభి
లాషముం దీర్ప సిద్ధమ్ము చేసినాఁడు
రథము లక్ష్మణుం డింక మీా రధివసింప॥ 238

వచ్చునని చెప్పి వాకిటన్ వఱలు నతఁడు
రాగదే దేవి! యాత్రార్థ రథము కడకు
ననఁగ సరి నేనిదే వత్తునని తెలుపుము
అనుచుఁ గదలంగ దుర్ముఖుం డగ్ర సరుఁడు॥ 239

దారి చూపుచునుండ నారార నిలచి
యధిక భారాల సాంగి నిరాశ్రయముగ
మెల్ల మెల్లంగ నేగుచు నుల్లమందు
మంగళం బెంచుకొంచును దల్లడిలుచు॥ 240

ఆప్త రఘుకుల దేవతాభ్యాం నమో న
మస్తపోధనేభ్య యనుచు న్యస్తపదస
రోజ చిహ్నితావని సరసీజ వనమొ
నాఁగఁదోపంగ రథమున్న యటకుఁ జనియె॥ 241

చనిన జనక తనయ తన వెంటఁ గొనిపోయె
రామచంద్ర హృదయ ధామకాంతి

మిగిలినట్టి వాఁడు మేదినీ కాంతుండు
తంత్ర గతిని నడచు యంత్రమతఁడు॥ 242

## ఖండాంత పద్యములు

ఇది ప్రతిజ్ఞ, శ్రీరామ రాజేమి చేసె
నో యదేల చేసె, నదియెటో యదెల్లఁ
దెలుపుఁ దెల్లంబుగా ధర్మదీధితులను
దీనిఁ గొని స్వామి! దయను మద్ధీవసింపు॥ 243

పొదలెదు హృద్గుహాన్ నిదుర
పోవుచు నుందువో యేమొ యెప్పుడో
కదలిన మొగ్గులో రస జ
గత్తునఁ దేలుచుఁ బల్కెదిట్టు లీ
కదలిక యెంత మేలయినఁ
గానఁగఁ జేయునె నిన్ను స్వామి యే
కదలిక లేక నిద్రఁగన
కన్ దయఁ జూడుము నిత్యజాగరా! 244

మాలిని. రజత గిరి నివాసా! ప్రాణమూలా! ఉమేశా!
నిజ విమలకళాభా నీయమానాథ్య విశ్వా!
అజముఖ సురపూజ్యా! ఆత్మతత్త్వైక రాజ్యా!
గజముఖగుహతాతా!* గార్త్స్న మద్గేయ నేతా! 245

* మాది ఏకార్షేయ శౌనక స గోత్రము. గార్త్స్న మదుఁడు మా ఋషి.

# సమజ్ఞాఖండము

## ౨

## వామదేవము

శ్రీవిశ్వనాథ! సత్కవి
తావియ దుద్యోతితార్క! తర్కాతీతా!
జీవాభ్యుదయాధాయక
భావోత్పాదక నిజానుభావ సమేతా! 1

సీత తా నెక్క లక్ష్మణా నీతరథము
భీత భీతమ్ముగాగ నుద్వేగ మొప్ప
నలస గతి నెక్కి యాసీనమయిన యంత
బోనునం బడ్డ సింహియుం బోలి యామె॥ 2

తనయెదఁబుట్టు కోర్కెయిది తత్క్షణమే ఫలియించుచుండ సాం
త్వనము లభించి డెందము ముదంబును బొందుట మాని యింతకుం
దనుకతమేమి యన్న తపనంబడి యామె మనస్సు బుస్సుమం
చని పడగెత్తు భోగియయి యాంతర లోకములెల్ల వేల్చినన్॥ 3

జీవ చరిత్రమే బహు విచిత్రము భావము వెంట భావమై
భావనలెల్లఁ గార్యగతిఁబట్టి విహాయసవీథి వాయువుల్
చేవ గడించి రూపమును జెందు విధంబున లోకసంతతుల్
గా వలలోనఁ జిక్కుకొనుగా మఱి ఱెక్కలులేని పక్షియై॥ 4

తనకొక కోర్కె యెప్పుడును దానయి కల్గదు లోకదర్శనం
బున నె ఘటిల్లు దానిబడి పుట్టు భయంకర సన్నివేశముల్
తనకును నైన వారికిని దద్గతమై చనునార్తి యెంతయుం
డి నను శుభాళినే విధి గడించును లోకహితంబు నెంచుచున్॥ 5

అప్పుడు మాయలేడిఁ గని నప్పుడు పుట్టిన కోర్కి యెంతయా
ముప్పును దెచ్చె నిద్దఱకు మోయఁగరాని వగల్ ఘటించె నిం
కెప్పుడుఁ గోరఁ గూడ దనిపించి విరక్తిని బెంచె నంతమం
దప్పటి కార్తిఁగూరు జగమంతకు శాంతినొగూర్చె వింతఁగన్॥ 6

ఇప్పుడు చిత్రముల్ గనుట నేర్పడినట్టి విచిత్రవాంఛ యే
ముప్పును దెచ్చునో? కలయు ముంచుక వచ్చిన దింతముందె, యా
ముప్పె నిజంబుగా నగునొ? మోహాన రాముఁడటుల్ పొనర్చునే?
చెప్పినమాట చెప్పకయె చెప్పెనుగాదె హృదంతరార్ద్రితల్॥ 7

నాకును వానికైన యవినాస్థితి నిత్య, మదెట్లు భగ్నమా
నాక విరోధి వంచనమునన్ గొనిపోయి యటుల్ వినాశమై
మాకు వియోగ మాననెడి మాట తలంచుట కెట్లు సాధ్యమా?
నే కళ నుండెనో యడిగి తిప్పుడె యిప్పుడె తీర్చు చుండెగా॥ 8

నీవును రావలెంజుమ వనీస్థలి కంటిని నిర్దయాత్మకా
యా విధి నాడనేల యని యన్న మహాత్ముఁడు తాను వచ్చెనే?
యీ విధిఁ బంపుచుండె, నిపు డేవియొ తప్పని రాచకార్యముల్
ప్రోవయి వచ్చె నంట, యనురూపతఁ దమ్ముని బంపెఁ దోడుగన్॥ 9

తోడున్నట్టి వియోగ మియ్యదియుఁ దోడ్తో నట్టి దెట్లానొకో
నేఁ డిట్లేగుట యాశ్రమాళిగని మానీంద్రాళి యాశీస్సులన్
వాడం జాలని పూవులం గని సుధా వాస్సింధు వా గంగలో
నేఁడే స్నాన మొనర్చి వెంబడి పునర్నీతిన్ గనంజాలనే?॥ 10

ఇందేమి ముప్పు గల, ది
క్కుం దేల ఘటిల్లు చుండెఁ? గోరు నెడందన్
జెందిన డిం దిపు డిట్లున్
గుం దందఁగఁ జేయు నంతె, కూర్కెదె వచ్చెన్॥ 11

రథముం దోలుచు ముందు నుండిన సుమిత్రాసూతి డెందాన దు
ర్వ్యధికిం దోడుగఁ దానె యీ పనికి నుర్వీనాథు నాజ్ఞం బడిన్

విధిగా రానయి యామెఁ గాంచగ మహాభీతిన్ విధూతాత్ముఁడా
చధమత్వంబునఁ గుందుచున్ వెనుక నేమౌనో కనంజాలకన్॥ 12

వెనుక నొకింత సవ్వడియు వీనుల కందక శూన్యమైన మె
ల్లన వెనుదిర్గి యామె మృదులమ్ముగ దేహముఁ దాకుచున్న పా
వన పవనాన నిద్రఁ గన భావము తేలిక యాచు నంత మె
ల్లనఁ జనుచో వనంబు లవి లాగవుగా యని యాత్మ నెంచుచున్॥13

జీవిత మెల్ల కాల మిటు చేయుచు నుండు వనాళి యెంతకున్
రావు వచింప నాకు విన రాఘవపత్నికిఁ దప్పు దుస్థితుల్
పోవలె నేమి దొందరగఁ బూన్చిన కార్యము పూర్తిచేయకే
పోవుట దెట్లు రాఘవుఁ డపూర్వత నేమి తలంచు నింతలో॥ 14

ధీ వంచన మననిదె తా
నే విధిగా నయిన విధిని నేమార్చుటకై
భావన చేయును గానీ
యావిధి తప్పదు గుభిల్లుమని పై దూకున్ 15

ఒక వేగమ్మునఁ బోవుచున్న రథ మీ యూహన్ బ్రయాణంబు సా
గక యాగెం బలెఁ దోఁచి మేల్కను నొకో కల్యాణి యన్నంతలో
నెకసక్కెంబుగ నామె మేల్కనుట తన్నేదో యనం జూచుటిం
చుక విన్నట్లయి వెన్కఁ జూడక యెదో శూన్యత్వమై తోలుచున్॥

చనుచున్నంతట లక్ష్మణా! పుర బహిస్థానంబె రా లేదు వే
చని రా నౌ నని యెంచితిన్ రథమహో సాగంగ నే పోవదే
లని యన్నంతఁ గశాభి ఘాతమయి నశ్వై సుంత యోజించి యే
మననుం జాలక యామె తొందరను మాయంజేయు భావంబునై॥17

కుదుపును దాళఁజాల వను కొంచు నిదానము గాఁగఁ దోలుచుం
డెద, నిఁక వేగిరం పడి గడించెడి దేమియు లేదుగాదె, చే
రెద మెటులో వనాళికిఁ, జరించెద వచ్చుట కోర్కె వెంబడిన్;
గదలిన రామ బాణ మటు కాంక్షితమున్ గనకుండ నాగునే? 18

అని తన వంకc జూడక యె యాడిన లక్ష్మణు మాటవించుc దే
జిన దనుకొన్న మానసము రేగి యతండను మాట మాట దా
గిన పెర యర్థమేదొ హృదికిన్ గడు చాటుగ వచ్చి తాకు మా
ర్గణమయి నొవ్వc జేయc బెనురాయిడి నందు నెడందc బట్టుచున్॥

జనకజ లక్ష్మణా! యిదియుc జాల విచిత్రము గాcగc దోcచు నా
చను వనముల్ మరావిభుని సంగతితో నని కోరియుంటిc గో
ర్కి-ని నెఱవేర్చుటన్నc దగు రీతిని నాతcడు రాcగc జెల్లు రా
జని కదలంగ రాని పనులంచు ననుంజనుమంచుc బంపుచున్॥ 20

బయలుదేరు వేళ బండి చెంతకు వచ్చి
పోయి రమ్ము చాన హాయిగాను
రాజ కార్యవశత రాలేను నే నని
చెప్పవచ్చు గాదె శ్రీవిభుండు॥. 21

ఆతc డేమొ యట్టు లాచరింపcడు సరే
లిప్త గూడ తీఱు లేదొ యేమొ
రథము కడకు వచ్చి యధిరోహనము చేయు
నపుడు గూడc జూడవైతి వీవు॥. 22

వచ్చితి నెక్కి-తిన్ గదల వచ్చున యంటివి యెట్లొ చూచుచున్
వచ్చిన దందుకే యగుట వచ్చున యంటిని తోలసాగి తీ
విచ్చుట నిట్లు నే నడుగ నీవు వచించిన మాట మాట నా
కచ్చెరువయ్యె నా వదన మందునc జూచుచుc జెప్పవైతివిన్. 23

ఏమిది? మీకు నిర్వురకు నేను పొనర్చిన సేగియేమి? నా
మోమును జూచుటే తగని పొచ్చెము పుట్టెన? పర్ణశాలలో
నామెయినాడి నా ననుచునప్పటి కోపము తీఱకుండెనో
నీ మది నిన్నినాళ్ళకును; నిల్పుము బండి, వచింపు మంతయున్॥ 24

కొండల మందు డెందమునc గోమలి జానకి యట్టు లాడుచో
నెందుల నుంటి? యేమిగతి? యెట్లు వచించుట? మార్గమధ్యమం

దెందుకు చెప్పు మెట్లు వచియింపగనే వలె నక్కడంచుఁ ద్రో
యందల పోసి దాచినను నాంతరమున్ గనిపెట్టి నిల్పెదున్॥ 25

అతని కాతఁడె వజ్రాయి తాత్మ్యఁడకట
నియమ పాలన దీక్షా మనీషి తాను!
ఈమె కీమెయె యెంతగా నేర్పు హృదయ
మంత పడినది పాప మత్యంత శుద్ధ! 26

సకల లోక సమారాధ్య సారభూత
పరమదైవ స్వరూపులన్ భావమున - నె
వీరి సేవింతు నెద నిల్పి వీరదేమొ
యెంత మాత్రము నన్నుఁ బట్టించుకోరు! 28

తన యెద నున్న భక్తికిని దాను భరింపక తప్పనట్టి వే
దనకును బొంత నెక్కడ? సదా తపనంబడు టొక్కటే యగున్
విని ప్రభునాజ్ఞ స్పందనము వీడిన డెందము తోడ బొమ్మనై
చని యిది యేమి యన్నఁ బెలుచన్ మఱు మాటననీక నొక్కెఁబో॥

అదయుఁడు స్వామి నా హృదయ మందలి భావము వెల్వడంగ నీఁ
డెదియెదియైన నే ననడి దేదియొ నెమ్మది నాలకించి యా
పిదప వచింపవచ్చుగద; వ్రేల్మిడి సర్వము సాగిపోవలెన్
బదపద మంచునన్ దఱిమె భావ జగత్తు లడంగి పోవఁగన్॥ 29

ఈమెయు నట్టులే యపుడదేదియొ పట్టిన యట్టులాడెఁ దా
నేమి వచించినన్ మది వహింపక స్వామిని దేర్చి ఘోర సం
గ్రామ మొనర్చి ద్రోహి కధికంబుగ శిక్ష నొనర్చియుంటిమే;
నా మది నాటి సంస్మృతులు నాటిన యట్లుగఁ బల్కనేలొకో! 30

ఆ మాటీమె యనంగ నా మది నహో యత్యంతమున్ భీతియా
నే మంచెంచునొ యీమె? యీ కఠినమా కృత్యమ్మునందేను శ్రీ
రామాజ్ఞన్ వినియుక్తుఁడైతిగద, ప్రారబ్ధంబు కాకిందు నా
కేమైనన్ గలదే యెడంద? పొడలే డెందున్ ననున్ నమ్మునే? 31

నమ్మంజాలదు, మోము ద్రిప్పి కననైనన్ ధైర్యమే లేదు నా,
కెమ్మోమ్మడ్కిన్ బధ మెల్ల నే గడుపు, దింకెట్లీ మె డెందమ్ము శాం
తమ్మై యుండగఁ జేయఁగల్లుదు, నసాధ్యంబయ్యెనో రాఘవా!
యిమ్మై ప్రాణము లాగిపోయినను మే, లీ కష్టముల్ దప్పెడిన్॥ 32

అని తలపోయు చింతవలఁ కంతకు నంతకుఁ బట్టరాని వే
దన పెనుదుఃఖమై పొరలఁ, దల్లెగయన్ గడు వెక్కుచున్న ల
క్ష్మణు దురవస్థఁగాంచి జనక ప్రియ పుత్త్రి యెడంద గాడఁ బ
ల్కిన తనమాట తీవ్రతకుఁ గీడ్వడు లెంచుచు, నొవ్వునందుచున్॥

అన్నా! లక్ష్మణ! యేల యేడ్చెదవు? నే నన్నట్టి యా మాటకే
ఖిన్నుండైతివో యింతగా? విధి హతన్ గీడెంచఁబోకయ్య! నేఁ
గన్నా నింతకు ముందె పీడకల, మేల్కన్నంత నీ యాత్ర యి
ట్లున్నన్ భీతమతిన్ వచించితి నెదో యూహింపుమా జాలిమై! 34

నీ వయినం బెఱుంగనొకొ నీవు వినిర్మల భక్తియుక్తి మ
త్సేవ యొనర్చుచుండెదవు ధీనిశితాతి బృహస్పతీ! నినున్
గేవల దేవతాకృతిని గిల్బిషమంటునె? వ్యర్థమా నహం
భావము వెంట నాయనిన మాట గణింపకు మన్న లక్ష్మణా! 35

నా మనసేలొకో విధుర నాట్య మొనర్చుచుఁ జేటు మూడి న
ట్లేమొ వచించెడిన్ గనదొకింతయు శాంతి మఱీవు నిట్టులై
నా మును నిల్చినన్ గనుము నాయన! యెంతగ వేగుచుంటినో
క్షేమమె యాగదా పతికిఁ జెప్పుము డాపక యున్నదంతయున్॥ 36

అని తగ్గి యాడు జానకి
మనముం గని తేఱుచున్న మది లక్ష్మణుఁడున్
మిను వాకఁ జేరు నంతకు
జనకజ కెల్లైనఁ దెల్పఁ జన దనుకొంచున్॥ 37

తల్లీ! జానకి! నన్ క్షమింపఁగదవే తాళంగ లే నింతయున్
ఫుల్లాబ్జాత సహస్ర మండిత సుధాంభోరాశి పర్య[illegible]



దుల్లా సంబున సర్వ జీవగణ భక్త్యుత్సాహ సంసేవ్యవై
యెల్లన్ లోకము లేలుచుండఁ దగు నీ వి ట్లేవనం బేగుటల్॥ 38

కోరెన్ జానకి దింపి రమ్మనుచు నాకుం జెప్పె నా రాముఁ డీ
ఘోరం బేమని గోలపెట్టితిని కోర్కుల్ కోరు వా రెట్టిరో
వారింపం జనఁబోక వాని నిటు తీర్పన్ జూచు వా రట్టిరే!
మీరున్ మీరు నమేయు లౌదురు ప్రకంపించున్ జగజ్జాలముల్॥ 39

నన్నే యేల నియుక్తుఁ జేయుదిట నన్నా యంచు బామాలితిన్
విన్నాఁడా రఘురాముఁ డేమి యనెనో విన్నన్ మనంబెల్ల వి
చ్ఛిన్నంబై తనువేల రాలదని గాసింబొందితిన్ లక్ష్మణుం
డన్నన్ దల్లి యెడందలేని కొఱకంచై పోయె మండింపఁగన్॥. 40

నీ యాజ్ఞంబడి నాఁడు పోనయితిఁ గంటే యప్పుడేమయ్యె, నేఁ
డీ యాజ్ఞం బడి నిన్ను కాఱడవి కేనే చేర్తు, నే మానొకో,
భూయో భూయ ఉగ్రోహుతాశన పరిప్లుష్టాత్ముఁడ న్నేను నా
కాయం బిద్ది యనంత పాప ఫలమా కామేశ్వరీ సాకవే! 41

అని తన వన దర్శన కాం
క్షను మనమునఁ గంటగించి క్ష్మాకాంతునితో
నని తత్ఫలముగఁ దానే
పనిఁ బూనఁగ వలసి నవయు వాఁడిటు పలుకున్॥ 42

తా కని యెంచి జానకియుఁ గానన దర్శన కాంక్ష గూర్చి తా
నే కరణిన్ విచార మొనరించెనొ యట్లై యతండు సేయుటల్
తాకి మనంబు భీతి బహుధా పరివర్ధన మంద లక్ష్మణుం
డాకృతి గొన్న శోక మన నార్తి నహించుట కుమ్మలించుచున్॥. 43

అతనికిఁ దానునున్ వనకు నాతఁడె దిక్కగు తత్పరిస్థితిన్
వితగ మఱంది దుస్సహము వేదన నందుట మాన్ప నెంచి భూ
సుత పలికెన్ సుధీ వినయశోభిత! దోష మదెల్ల వేళ మ
త్కృతమగుచుండ నీవయిన రీతి వృథావ్యథ నందె దేలొకో? 44

ఎపుడు న్నీవు హితంబునే పలికె దేమే నిన్ను కాదంచు ని
ద్రప్రపతన్ సర్వ నియంతృ భావమున బోధంబెల్ల మాదన్న కొం
చెపు బుద్ధిన్ జని హానినందెదము రాశీభూత సౌజన్య! య
చ్చపు భక్తిన్ మను నీయెడన్ దొసఁగు లేశంబుండునే లక్ష్మణా!

నీ ధర్మంబును నీ వొనర్చు తఱి కన్నీర్నింపఁగా నేల? మా
బాధల్ మావియ యౌను, వానికి నెటుల్ బాధ్యుండ వీవౌదు వ
న్నా ధర్మజ్ఞ? కృతాంతుఁడైన సుఖదుఃఖాదుల్ స్వతంత్రమ్ముగా
సాధింపంగను లేఁడు జీవి గుణ దోషంబుల్ నిమిత్తంబులౌ! 46

అనుభవింపగఁ దగు కర్మ ననుసరించి
బుద్ధి పుట్టించుచే దైవముం బొనర్చు
దాని బడిగాదె జీవయాత్రయును సాగు
నగున దేదియు మంచికే యగును తుదకు॥. 47

ధైర్యం బూను మటంచుఁ దల్లి పలుకన్ దత్త్వజ్ఞుఁడౌ స్వామి లో
నార్యా చిత్తము తేఱి కొంకెఱిఁగి భావజ్ఞాత్రియౌ నామెకున్
స్థైర్యంబున్ దెలియంగనైన తన కస్థైర్యంబు కల్గన్ మహా
శ్చర్యం బందుచు నా యమాయికతకున్ జాలింబడెన్ సాధువై! 48

వనవీథిన్ రథమేగుచో నుభయ పార్శ్వ స్థాగ సంతానముల్
గను చా జానకి మోదమందుచు వనౌకస్సత్త్వ సంచారముల్
మనమున్ రంజిలఁజేయఁ గొంతవడి కాత్మన్ భావి యేమౌనొకో
యను నాందోళన విస్మృతిం బడగ దృశ్యాకృష్ట చిత్తస్థితిన్॥. 49

సందులం బడి నీడ జాఱు నెండల పొడల్
మలయు నన్పించు కుందేలుల గములు
చెంగునన్ దూకి నిల్చిన సోయగముతోన
మెఱపుఁ గన్నులఁ జూచు మృగ చయమ్ము

తల్లి యా భూమి వాత్సల్యమ్ము పొంగు మం
చెత్తు నాఁ దోఁతెంచు నేళ్ళ చలువ
మన సిచ్చు చెలుల నిర్మల మంజు లాలాప
గతిఁ జొక్కఁ జేయు పక్షి తతి రుతులు

నిన కర స్పర్శ తన మేని నెనయ నీక
దారి పొడుగునఁ గాచు పాదప సమూహ
మనిల వీచులఁ గదలి క్రొన్ననలు రాల్చి
తనకు నది పుట్టినిల్లను నెనరు చూప॥. 50

ఎందెం దేగిన నందు నందె తన కెంతే కూర్మి నత్యంత మా
నందమ్మున్ సమకూర్చుచున్ విపులమై నైక ప్రకారంబులన్
విందున్ జేయుచు నంటియుండు జననిన్ విశ్వంభరన్ గాంచుచున్
డెందం బూరట నంది భూమి సుత తుష్టిం జెందుచున్నంతలో॥. 51

ఎడమీక కౌగలించెడి మేఘముల చాయ
నావరించిన కాననాళి వీడి
ఎడఁద సర్వము విప్పి యిది నీదె యన్నట్లు
విరియు బయళ్ళ విస్తరము కడచి
గాఢాను బంధ పౌష్కల్యమ్ము తెలుపు నం
బర చుంచి భూధర పంక్తి నెడసి
అమృత పయస్సు లియ్యవియె క్రోలుండన్న
సరణి జాల్వారు నిర్ఝరుల దాటి

మానమున్ వీడి పల్కరింపంగఁ గడఁగు
తలఁపుఁ గలిగించు జనపదంబులఁ గ్రమించి
ధరణి జాతను గొంపోవు నరద మెట్లొ
చేరుకొన్నది గోమతీ తీరమునకు॥. 52

అధిక రాగ ఫలంబె యగు దుఃఖ తమమని
సాంధ్యరాగ మడంగి చనుట తెలుప
నెంత దుఃఖంబైన సుంత సుఖంబుండుఁ
నని మిన్కుమను నుడు గణము తెలుపఁ

బగలు మేల్కొనుటెల్ల వగలఁ గుందుటె యంచు
నిజము మైమఱపించు నిదుర తెలుప
నింద్రి యోద్ధతి మాసి హృదయ మేకాగ్రమై
నిల్వసిద్ధి యని చందిరుఁడు పొడువ

రాత్రి యగుటను సాగింపరామి యాత్ర
రేయి యటఁ బుచ్చి మఱునాటి రేప కడయ
బయలు దేరుదమన్న భావంబు నంది
సీతయున్ లక్ష్మణుండు విచ్చేసినంత॥ 53

తీరస్థాశ్రమ వాసులౌ ఋషుల యాతిథ్యమ్ము స్వీకార్యమై
యారే యచ్చట నెట్టులో గడపి కల్యంబదె తత్కాల్యముల్
తీరంగానె పునఃప్రయాణమగుచో దేవిన్ మునుల్ పత్నులున్
గారామొప్ప విడంగలేక పనుపన్ గన్నీళ్ళ పర్యంతమై॥ 54

ఒక్క పూటయె యదియు నన్యోన్యముగను
మాటలాడుటను కనువైన పూటగాదు
అయిన నేమాయెఁ బుట్టిన దాది యింట
నుండి పెరిగిన తమ బిడ్డయో యనంగ॥ 55

జానకిం జూచినారు వాత్సల్య మొప్ప
నిండు చూలెంత పుట్టింట నుండకుండఁ
బురుటికై వేఱుచోటికిఁ బోవు టెంత
మాత్ర మొప్పని తలిదండ్రు లాత్ర మొప్ప॥ 56

జానకియు వారినట్లె డెందానఁ దలఁచి
తాను తెచ్చు ననర్ఘ వస్త్రముల నొసఁగి
వందనాదిక మొప్ప దీవనల నంది
యందు నుండి కదలుట కడింది యయ్యె॥ 57

జానకీదేవి కచట విశ్రాంతి కలిగెఁ
బలుకరించుచుఁ దన మనోవాంఛఁ దెలిపె

లక్ష్మణుఁడు మాత్ర మచట విలక్షణముగ
బెరుకు బెరుకుగఁ గడపెఁ దత్తఱము గనుచు॥ 58

ఎట్లో వీడ్వడి గుంపులై పొదువు నా యిల్లాండ్రకున్ డెంద మ
ట్లిల్లై పొర్లగ సీత మ్రొక్కులిడి తా నెక్కెన్ రథంబంతఁ జీ
కట్లన్ వీడుట పోయి కప్పికొనుచై క్లాంతాస్యుఁడై లక్ష్మణుం
డెట్లో తోలఁ దొడంగె తేరు కని ప్రొద్దెక్కెన్ నభంబంతటన్॥ 59

కనులలోఁ జురుచురుక్కని తీక్ష్ణముగ నె ప్రే
ముడి వీడి యెదురెండ పొడుచుచుండ
వీనులన్ లోని పెన్ బెదురె ముబ్బడి యాచు
నెపపొందు దడలు విప్పడుచు నుండ
మనసులో నెనరెల్ల మాని యమ్మానినిన్
విడనాడ జగమాడు నుడులు కదలఁ
దనువునన్ నిలువెల్లఁ గణకణలాడు ని
ప్పులు చల్లు వేదనల్ సలుపుచుండ

యోజన శతంబు దూరమందుండి పేరు
పేర్కొనిన మాత్ర నఘతాప కర్కశతను
మాన్పు గంగమ్మ యటుమాని మత్సరమున
దరియ దరియంగ నేచి తన్నరియఁ జేయ॥ 60

రామావనీశు తమ్ముఁడు
రామం గొని పోవుచున్న రథముం దోలెన్
రామబహిః ప్రాణంబగు
భూమీ సుత కన్నతల్లి పొలుపుం గనఁగన్॥ 61

మేనికార్కశ్యమ్ములోని వాత్సల్యమ్ము
నుద్భిజ్జములు మిన్ను లొలసి తెలుప
నాత్మ నేకంబయ్యు నణుభిన్నమైన యౌ
దార్యంబు జీవసంతతులు నుడువ

ఘనత గగనమందుఁ గలదంట ఘనతయే
క్షమ ఘనత్వంబు శైలములు నిలుపఁ
బై మెత్తఁ దనము నిష్ఫలము కర్కశమయ్యె
గుండె కోమల మాట గుణమటంచుఁ

బ్రతి పదంబునఁ దల్లి విస్పష్ట పఱుప
నందుకోరాని యాశ లందందఁ ద్రోచి
పరమ సుకుమారమైన యంబరము మనసు
శూన్య మొనరించు చొప్పు విస్ఫుటముగాఁగ॥ 62

తల్లి జానకి తన తల్లి తత్త్వ మాత్మ
కింపుఁ గలిగించుచుండ న ర్తించు మనసు
పొంగులం దేలి యాడు చుప్పొంగు చరిగె
మనసె జగమాట నిజము మున్మాటి కెపుడు! 63

ఎట నుండి వచ్చెనో యెఱుఁగ రాకయె గ్రద్ద
నేలపై పాముఁ దన్నికొని పోయె
బండపై పదముంచి పశువు నీరాన నా
బండయే మొసలియై పట్టి మ్రింగె
దినము రాల్చు ఫలాలె తిను పాము తత్పక్షి
గూడున కేగఁ బ్రాకి గ్రుడ్లు మెసవె
నడినుంత కననీక యడఁగి యుండిన బల్లి
పెను నాల్క సాచి పట్టినది పురుగు

నింత నయవంచనము కన్ను లెదుట జరుగ
జానకీదేవి వాత్సల్య భరితమైన
తల్లి సంతాన మింత ఘాతకముగాఁగ
హేతు వేమని మది విచారించుచుండ॥ 64

కుడికన్నుఁ గుడి బుజంబును
వడి వడిగా నదరె నెదుటఁబడి వఱడఱచెన్

నడి పగలె గూబ కూసిన
దెడమనుబడి వచ్చి గరుడి యెగిరెను కుడికిన్॥ 65

గిర గిరను దిరిగినట్లయి
ధరణియు ధరణీ తనూజ తద్దయు భీతిన్
జురచుర పొక్కెడు మది తీ
వర మడఁపఁగ లేక సుంతవారని వగతో॥ 66

అంతవరకమ్మ యొడినున్న యనుఁగు బిడ్డ
నెవ్వఁడో క్రూరుఁ డెగచి త్రోపిడె ననంగఁ
గాలనిష్ఠుర లాక్షసాభీల హస్త
బద్ధమానస యగుచు నంబా యటంచు॥ 67

అన్నా! లక్ష్మణ! యేమి యీ శకునముల్ వ్యర్థమ్ములౌనే మనం
బున్నట్లుండి మహార్తి బ్రుంగెడు నెదో యూహింప లేనయ్యెదన్
గన్నావా మఱి నీవు నాయెడల నింకన్ డాపనేలయ్య యే
మున్నన్ జెప్పుము చెప్పవే నెడఁద వ్రయ్యున్ జుమ్ము నిక్కమ్ముగన్॥

రామ బాహూపధానన్నై శ్రాంతి దీఱ
నిద్దురం గని నిద్రలో స్నిగ్ధ హృదయుఁ
బ్రియుని నెడఁబాసి చన్నట్లు పీడకలను
గాంచి మేలఁకువం గని రాముఁ గానలేక॥ 69

ఉరము లదరంగ నిలఁబడియున్న యంత
దుర్ముఖుఁడు వచ్చి చెప్పె నీదుమన వనుచు
వచ్చి రథమెక్కితిన్ బ్రిమువార్త నడుగ
నన్నిటికి నన్ని చెప్పి ప్రయాణమైతి॥ 70

నేనేమైనను నాకుఁ జింతయని లేనేలేదు తండ్రీ ననున్
దీనన్ దేర్పుము నాప్రియుం, డెడఁదలో దీపంబు, నాప్రాణ, మీ
మేనున్ మైనపుబొమ్మఁ జేతనత సంప్రీతిన్ దయంగూర్చు నా
క్ష్మానాథున్ గనుగొందునే నయన కాంక్షల్ దీఱఁ బ్రాణంబుతోన్॥

కనులలోఁ గనులుంచి నను గాంచి ముదమొందు
రామ నేత్రాంశు దర్శనము లేక
ఘనసార కస్తూరికా మిళచ్చందనా
సారమౌ రామ సంస్పర్శ లేక
సకల మనోఽనురంజన సుమస్పర్ధి యై
తాఁకు నాసా గంధవహము లేక
శంఖ సుందర గళస్వాన వీణానాద
మధురమౌ శ్రీరాము మాట లేక

యింద్రియాళుల తర్పణం బేచు రాము
దివ్య సాన్నిధ్య మెడసి యీ దేహ మొక్క
క్షణము నిల్వదు నిజము లక్ష్మణకుమార!
యయ్యొ! రాముండు క్షేమమే యగును గాద! 72

బొగ్గుల్ గుట్టలలోని దుర్వికృత రూపుల్ రాక్షసుల్ చుట్టగా
వ్రగ్గం జాలియు నగ్గిఁజొచ్చియును గంపంబొంద దీమేను తా
బుగ్గైనన్ మఱి చింతలేదకట రాపుంబొందు నీ గుండెయే
యెగ్గున్ గానక రామచంద్రుఁడొకఁడున్నే క్షేమమై చెప్పుమా! 73

ఆకాశాఖిల మాకృతిం గనిన నీలాంభోదమాలా ద్యుతి
స్వీకారం బొనరించు మేని సొగసై జీవాంధ్యముల్ ధ్వస్తమై
సోకంగా నెదలెల్ల విచ్చుకొను మేల్ చూపుల్ ప్రసారించు న
య్యాకర్ణాంత విశాల నేత్రముల విందౌ మోముఁ గన్గొందునే? 74

అగ్గలముగ బెగడొందుచు
డగ్గుత్తికతోడ మిగుల డయ్యుచు నట్టుల్
బెగ్గడిలు జానకింగని
యెగ్గేమియు లేదు జీవితేశున కమ్మా! 75

కఠినంబౌ నృపధర్మమున్ నడపుచోఁ గార్కశ్య మందెన్ గటా!
శతతం బూనక తప్పదామె నృపుఁడై స్వాన్య ప్రభేదంబులన్

బలియింపన్ జనరాక కన్నకొడుకున్ బంధింపఁగాఁ బూనువార్
లుర దాత్ముల్ నృపులన్నవారి కనుజుల్ చుట్టాల్ సతుల్ నిల్తురే?
ఆరోగ్యంబున కేమి దేహమతులం దవ్యాహతుం డాతఁడీ
దారిన్ నీదగుకోర్కి వెంట మునులన్ దర్శింపఁగాఁ బంపుచో
నూరీకృన్మతి వారికిష్టమని నవ్యోద్భాసి తామూల్య భూ
షా రత్నాంబరకోటి నంపెఁగదవే సాధ్వీ శిరోభూషణా! 77

యమునా తీర నివాసులౌ మునుల యార్తాలాప మేతేర సం
యములం గొందల మందఁజేయు లవణాఖ్య క్రూర రాత్రించరున్
సమయం జేయగ సైన్య సంచయముతో శత్రుఘ్ను పంపించు య
త్నము సందుండి నినుంగనందు విభుఁడన్నన్ హానియే మానినీ! 78

పతికి నచ్చుటె మనబంధు తతికి నెల్ల
క్షేమమే తల్లి సుఖము మాటేమొగాని
అది మనస్సునుబట్టి తా నౌనుగాదె
వన నివాసంబుకోరి తా పగిది నీవు॥ 79

ఎవరో పంపిన నిష్టమౌ నెడ సుఖంబే యౌను గాదేని త
ద్వ్యవహారం బతి దుఃఖమౌఁ దమకుఁదామై కోరుకొన్నట్టి దె
ట్లవు దుఃఖంబు? సుఖంబు దుఃఖమవురా యంతస్స్థముల్ తల్లి య
య్యవి బాహ్యంబులు కానెకావు భయమేలా నీకు స్వస్థాత్మకున్॥ 80

చెడ్డ శకునాళి కీవు విచ్ఛిన్నమతివి
కాకు మో తల్లి! రఘువంశ గర్భమడలు
నఖిల కులదైవతములు సర్వామరులును
నిన్ను నీ గర్భమును గాచి నిల్తురుగాక! 81

ప్రళయాంభోధి గభీరుఁడౌచును సుమిత్రాసూతి ముంజూపుతో
లలనన్ దేర్పగ నిట్టులాడి మన ఉల్లాసంబు కల్పింప ను
జ్జ్వల పూర్వావని పాలకోత్తమకథా సంపత్తిఁ గొండాడుచోఁ
దెలియం బోకయె యొయ్యఁజేరె రథమున్ దివ్యాపగా తీరమున్॥

ఆ దివ్యాపగ రాఘువాన్వయ మహాహ్లాదార్ద్ర హృద్వేణి యా
గాదే జానకి దానినిం గనుచు రంగత్తుంగ వీచీ కరా
మోదాహ్వానము నంది కొంచరిగి సామోదాని లాశ్లేష స
మ్మోదం బందుచు శ్రాంతివీడి తటిపై ముగ్ధాంబు జాతాస్యయై॥ 83

నిమురంగా ముదియాడు బిడ్డ వధువున్ నెమ్మేను రోమోద్గమం
బమరన్ నిస్తుల మోదముంగను విధంబై హాసరమ్యానన
శ్రమ తోయంబు లడంగి ముంగురులు పెల్చన్ ఫాలమందాడఁ జే
లము చుంగుల్ వెస రేగి దేవతలఁ బిల్వంబోవు నానొప్పఁగన్॥ 84

ఆ వేళన్ జనకాత్మ జాతదగు బాహ్యాభ్యంతరాభిన్న ని
స్స్వానానంద మదెన్నఁగాఁ దరమె సంసార ప్రమేయంబు లే
కావిర్భూతము కాక సాజమగు నిత్యప్రస్ఫురద్దివ్య త
త్త్వావిష్టం బనిపించె దానిఁగను భాగ్యం బబ్బునే యేరికిన్॥ 85

స్వానందంబున స్వేతరంబులగు బ్రహ్మాద్యంబు లానందముల్
లీనంబై లవలేశతం గనును తల్లీ! యోగి మార్తాండ ని
ర్ధ్యాన స్థిత్యనుభూతి వేద్యవగు నీ యానంద చిద్రూప మె
ద్దానన్ మాయక భావుకార్ద్రహృది నిత్యంబై విజృంభించుతన్॥ 86

మాతృశ్రీ పదపద్మలగ్న మతియౌ మాన్యుండు యోగీంద్ర వి
ఖ్యాతుండై యెవలో నెఱింగినను నేత్రాలోక నాదృష్ట ము
ద్ధూతంబౌట నధోముఖుండగుచు నుద్భూతాంతరంగ వ్యథన్
భీతుండయ్యును నా వికాళి నటకున్ వేవేగ రప్పించుచున్॥ 87

కనుఁడీ దేవి సమస్తలోక నుత దీక్షాశీలి రామావ నీ
శుని దేవేరి సురాపగా తటగత ప్రత్యంత తత్త్వజ్ఞమా
ని నికాయంబును భక్తిమై గొలువఁ గంధింబోలు డెందంబుతోఁ
దనుదానై చనుదెంచె యోగ్యమగు పాత్రంబొండు కూర్పందగున్॥

చనుఁడీ యన్న వినీతి మోహనులు బెస్తల్ వెన్కకొయ్యొయ్య భ
క్తిని నాల్గడ్గులు వైచి యంతట మహోద్వేగంబునంబోయి చ

క్కని రాజోచితమైన నావనొకఁ డుత్కంఠంబునం దెచ్చి ని
ల్చిన తల్లీ! యిదె నావ సిద్ధమయి నిల్చెన్ జాహ్నవిన్ దాటఁగన్॥

శ్రుతి శిర స్సీమంత శోభాయమాన సిం
దూరమౌ నే పదధూళి సతము
సకల యోగీంద్ర తీక్ష్ణధ్యాన జాతౌష్ణ్య
మున నే పదమ్ములు ముదురెఱుపులు
దుష్టరాక్షస శిక్ష శిష్ట సజ్జన రక్ష
సహజమ్ములే పాద జలజములకు
నేమియుం బట్టని స్వామి కన్నియుఁబట్టు
నట్టులే పదయుగ మాచరించు

నీ మఱందికి నుభయ సంధ్యా మనోజ్ఞ
సమయముల నిత్య మభివందితము లగుచును
పరిచయాధిక్యమునఁ బ్రాణ పదములైన
నీ పదమ్ములనుంచి మన్నింపు తల్లి! 90

పాదస్పర్శను పూతమై యెసఁగు నావన్ నిన్ను నాతీర మం
దా దార్యావధులైన తాపసుల పుణ్యావాసముల్ చూడ రా
జా దేశంబున దింపి కింకరత నా యందుంటు పాపంబు నా
పై దానన్ దొరలించి పాసెదు గదమ్మా నన్ను రక్షింపవే! 91

రామాజ్ఞన్ వనవాస వాంఛనిటు తీర్పన్ బుద్ధికిష్టమ్ము లే
కామైఁ బల్కను లక్ష్మణుండనెడి యూహన్ దాను సోత్సాహుఁడై
మో ముల్లాసముగాఁగ నున్న నతఁడున్ మోదంబుతోనుండు నం
చా మోదా నిలపిచి డోలన విధా వ్యాలోల యానావకున్॥ 92

జానకి మెల్లగా నడచి చన్నపు డా యమ తేల్చితేల్చి నే
లా నగనుంచు నొక్కొక పదాంకము లక్ష్మణుగుండెపై యమ
స్థానముఁ జేర్చు ఘాతముల చందముగాఁగ మఱింత క్రుంగుచున్
జానకి నావనెక్కిన యనంతర మాతఁడు నెక్కె నీడయై॥ 93

అపుడా తల్లి యెడంద నిశ్చలత స్వాత్మానంద సంప త్తిమై
తప నీ యాకృతి సర్వవిశ్వమున కూ తై నిల్చె ధ్యేయమ్ముఁగన్
విపులన్ దానె పరాత్మ వంచన విధా విధ్వస్త బుద్ధ్యాత్ముఁడన్
త్రప నంతంతకుఁ గ్రుంగిపోయెను సుమిత్రాసూతి హేయమ్ముగన్ ॥94

అభిజిల్లగ్నము, సూర్యుఁడాకసము నందారూఢ తేజస్వియై
యభిత ప్త మ్మొనరించు సర్వము, స్వజాత్యా ప్తత్వ మెన్నండు, వీ
రుభయుల్ నావ నొకళ్లు పెన్వెలుగు నింకొక్కళ్లు నీడై సమ
ప్రభ నెండన్ బడి తాపమంద; నది తాపంబెల్లఁ జల్లార్పఁగన్ ॥ 95

ఎవరి స్వభావము వారిది
యెవరున్ దమ స్వీయమార్గ మించుకయైనన్
జవదాటి సంచరింపరు
ప్రవిమల ధర్మానుర క్తి రాజిలుచుంటన్ ॥ 96

లక్ష్మణుఁడధో ముఖుండయి
లక్ష్మపద పంకజములె లక్షించు నెదన్
సూక్ష్మముగ నెంచుఁ దా నె
ట్లాత్మా జాతకు నృపాజ్ఞ యందిం తనుచున్ ॥ 97

తన కేమి కాఁగ నున్నదొ
యణు మాత్రం బెఱుఁగనట్లె యాయమ తానై
మినువాఁక శాంతనిస్వన
మును వినుచున్ గదలు పోతమును గనుగొంచున్ ॥ 99

ఈ సంసార మిదెల్ల దా నెయగుఁ దానే దుఃఖభూయిష్ఠమై
వీసంబో యఱవీసమో మఱియు నల్పిష్ఠంబొ సౌఖ్యంబుతో
మోసంబైన జగత్తు పన్నుకొని సంపూర్ణంబుగా మున్ని యా
యాసంబంది విర క్తిఁ జెంది తుది నిత్యంబౌ పదంబందెడిన్ ॥ 99

తెలిసి యనర్థ చక్రగతి దీని నిటుల్ నిరతంబు త్రిప్పు త్రి
ప్పులు పడనేల యన్న నదెపోఁ త్రకచక్రమమైన తీరు వ

ర్గులబడి చేటవోలె ననుఁగుల్ తెలివొందఁగ నిద్ది తప్ప దం
దులకయి కాదె దేహములతోఁ జరియించుట భిన్నమూర్తులై॥ 100

అపుడభిషేక మాగినపు డాయన యొక్కఁడె పిన్నతల్లితో
రపు వరమర్థిఁదీర్ప వనరాజి చరించుట కేగఁబోవ దూ
రపు మతి నేనునున్ విడువరాక పదానుగ నైతి నందుచే
రిపు హననాత్త కీర్తియయి ఱేఁడుగ నేఁడు వెలుంగఁగల్గెఁబో॥ 101

ననువిడి తాను నిల్వఁడనినన్ సరిలో నను వెంటఁగొంచుఁ బో
ననుకొని పైకి వల్దనిన యట్లుగ నప్పుడు మాటలాడె నే
మనినను దోషమేయగుఁ గటా! యతఁడిప్పుడు సింహపీఠమె
క్కిన తఱి నెంత యుండియును కేవలతన్ ననుబట్టి వచ్చునే? 102

ఒక దేహమ్ముగ నుండు నాల్మగల కెందున్నన్ వియోగంబె లే
దిఁక నీ సృష్టిని స్త్రీయుఁ బూరుషుఁడుఁ బై కెట్లున్నఁ దద్భిన్న మొ
ద్దిక నవ్యక్తత నుండి యెచ్చటికటే దీపించు సంపూర్ణమై
యొకటై క్రీడన లేక భిన్నముగఁ దానొప్పున్ వినోదార్థమై॥ 103

అకటా! భిన్నత మోహదుఃఖము లవశ్యంభావు లెవ్వారు వా
నికి లోఁగాక తమంత తాముగ వినిర్ణీతాధ్వమెట్లైన వీ
డక ధైర్యంబున సాగుచుండెదరొ చూడన్ వారె క్షేమంకరుల్
చకితుల్ తాము వినష్టులై జగతి కస్వాస్థ్యంబె కల్పింత్రహో! 104

రామస్వామి యొకండె మేరు నగ ధైర్య ప్రాభవుండౌ కుల
క్షేమా కాంక్షి వశిష్ఠమౌని సుమహాశీర్వాద మందించి భూ
స్వామిత్వంబునఁ దత్పరోక్షమున నిర్వాహంబు శంకింపఁ దా
నేమన్నాఁడు రఘూత్తముండది యతండే చేయఁగల్గున్ భువిన్॥105

ఔనౌఁ దానయినన్ బ్రజన్ నిలుపునట్లైనన్ జగత్ క్షేమ ధ
ర్మానుష్ఠానము మార్గమందున బలిష్ఠాటంకముల్ గాన నే
నైనన్ సౌఖ్యము స్నేహమున్ దయయు నన్నడ్డంగఁబోవంచు నా
త్మన్మ నాథుండసఁగల్గెఁ; నన్నటులె రాజ్యంబేలు మున్నాటికిన్॥106

తన ప్రియురాలు కోరినది, తానిడె సమ్మతి, తోడుతానె యే
గను దలపోసె, నైన నృపకార్యము ముంచుక వచ్చినంత నా
పనిపయి నిల్చి ప్రేయసిని పంపుటకై నను రాకపోయె భూ
పనయ మహర్షి ధర్మ పరిపాలన కియ్యదెనాంది యానాకో! 107

అని సామ్రాజ్యగదేక మాతయగు రామార్ధాంగి లోలోదనం
తన దానొచు జగత్కలాపమును నిత్యం బాత్మసాయుజ్య మం
దను వీలొనటు ధర్మమార్గమున దిద్దం జూచుచున్నట్లు భా
వన చేయన్ నదిదాటి నావచని తత్పారంబు ముట్టెన్ వెసన్॥ 108

సీతాలక్ష్మణు లిర్వురుం గుదుపుతోఁ జేతంబులన్ దేలి తత్
పోతంబున్ డిగి మ్రొక్కి నావికులు తృప్తుల్ గాగ నారణ్యక
వ్రాతంబెప్పుడు వాహినిందరియు త్రోవంబట్టి తత్ప్రాంత వి
ఖ్యాతుండైన మను నా కుజాత ముని పుణ్యావాసమే లక్ష్యమై॥ 109

గర్భ భారాలసాంగి భూగర్భ యపుడు
తానిరాలంబ యగుచు మందముగ నడుగు
లిడుచుఁ జనుచుండ లక్ష్మణుం డడుగు వెంట
నడుగు వైచుచు నెద భయం పడుచు నడిచె॥ 110

అడుగులు లెక్కపెట్టి దశ యన్నదొ లేదొ ధరాత్మజాత తా
బడలిక నంది చుట్టు నొక వర్తుల వేదిక నొప్పు రావి కన్
పడ నట కూరుచుండి తన పాదములన్ దనుదానె నొక్కి కొం
చెఁపడి వచ్చు లక్ష్మణు నొకించుక చూడఁగ మోము త్రిప్పు చో॥ 111

జానకీదేవి గుండె నిశ్చలమ యయ్యె
నంత దుఃఖించు టేలొకో యనుఁగు మఱఁది
సంతత స్రవంతిఁగ నీరు జాఱు కనుల
నతని మోమయ్యె నొక వర్షదంబు దంబు॥ 112

ఎవఁడీ లక్ష్మణుఁ డెందు కింత వృథగా నెన్నండు లేనట్టి దుః
ఖ వశత్వంబునఁ జుమ్మచుట్టుకొను నిక్కంబేదియో దాచి చె

ప్ప వశం బెంతకుఁ గాక వేదన భరింపన్ రాక యీరీతిఁ బె
ల్లవియన్ గుండియ తూలుచున్ నడచు నాకర్థంబు కాకుండెడిన్ ॥113

ఇతఁడేనా మఱి యప్డు నాకునయి ప్రాణేశుండు సర్వావనీ
స్థిత వృక్షాదిక జంతుసంతతి నహో సీతాగతిం జెప్పఁ డం
చతి దీనంబుగ వేఁడుచున్ విసివి దేహంబే విసర్జించునో
బ్రతుకం జాలక యన్నటుల్ తిరుగ నిల్వన్ జాలె ధీరాత్ముఁడై ॥ 114

ఇతఁడేనా యటు రాము నాదికొని సుంతేనిన్ బ్రమాదంబు నే
స్థితియందున్ గనఁబోక కాచికొనుచున్ దిత్యన్వవాయోగ్ర మా
రుత మాలాశన శేషభోగి యగు చింద్రున్ గెల్చినాఁడన్న య
ద్ది తిజున్ గూల్చిన శౌర్యశాలి హిమవద్ధీరుండ కంప్యుండహో! 115

అతనిం గూరిచి యామె యిట్టు లనుకొంచల్లే నిరీక్షింప నా
సతికిన్ జాగిలి మ్రొక్కి లేవకయ వక్షం బుర్విఁదాడించు చ
ల్లి తనుత్యాగ మొనర్ప నెంచుచును దాల్మిన్ శ్వాసముండయ్యె నేఁ
డతి దీనుండగు లక్ష్మణుంగని కుమారా! లెమ్ము నా మాటపై॥ 116

ఏమయ్యా యిది యేమి దుఃఖ మిటు నన్నేలా పరీక్షింతు? నీ
కేమయ్యెన్? రఘురామచంద్రునకుఁ దా నేమయ్యె? నాసత్ర వీ
క్షా మోదాత్మలు మూఁగు రత్తలు వశిష్ఠారుంధతుల్ సర్వులున్
సేమంబే గద యేదో దాచెదవు లక్ష్మీ చెప్పవే యింకిటన్॥ 117

నా చేతం బోక యింత నిల్వదు కదే నాయన్న యీ యాత్రకై
నీ చేతంబడి వచ్చుటాదిగ నెదో నిర్ఘాత మీమూర్ధ మం
దేచున్నాకని తోఁచుచుండినది నే నెల్లెంత ప్రార్థించినన్
బోచంత్రైనను దారిఁ దెల్పవయి తిప్డున్ దెల్పకే లేడ్చెదో? 118

శకునంబుల్ గని విహ్వాలించితిని, నీచందంబు నా రాము తీ
ఱిక లేకున్న తనంబు వాకొనుచుఁ దండ్రీ దాపకే యంచు నూ
రక వాపోయితి, నేనుగన్న కల వార్తన్ జెప్పితిన్ నీవు దే
నికి నద్దానికి నేదో చెప్పి యిట కన్నీర్నింతు వేలా వితన్॥ 119

అంతటి దుఃఖ మందయిన నాయమ యాడిన మాటలందుఁ దా
నెంతొ వివేక మన్కొనుచు నింతకు డాచుటచేత నున్న త
ప్పంతయు నెత్తిపైఁ బడిన యట్లుగఁ దోఁచుటతోన లేచి య
త్యంత ప్రయత్నమున్ జలుపు చాత్మవిశుద్ధుఁడు లక్ష్మణుండటన్ ॥ 120

అంజలిపట్టి నిల్చి జనకాత్మజ పాదసరోజయుగ్మ ది
వ్యాంజనమైన కన్నులరవాంచి యవేకనుగొంచుఁ దల్లిరో
నెంజిలి గూరుమమ్మ కరుణింపుము రాఘవ వంశరక్ష సే
యంజను శాంతిఁ దాల్పు, మసమర్థుల రాఘవులన్ క్షమింపవే! 121

తెలిసి ప్రయత్నపూర్వముగఁ దెల్లనివన్నియుఁ బాలు నీళ్లలా
నలుపు లటంచు నమ్మి నిను నమ్మక మొప్పగఁ గోర్కె వెంబడిన్
వెలలిచి యిల్లు నుగ్రవనవీథిక నిల్పెడి నన్ శపింపుమా!
యిల నిటువంటి ఘాతకుఁడిఁ కెవ్వఁడు నుండఁడు లోకపావనీ! 122

ఇపుడే నెంతగ మొత్తికొన్న నను నీవేకాదు నేఁ జేయు క్రూ
రపుఁ గర్మంబున కెవ్వరున్ వినరు సర్పంబీతఁ డౌనంచు దూ
రపు నేలంబడి సాగిపోయెదరు, చేరన్ రారు, నమ్మంగఁ బో
రపు రూపంబుగ నే నొకండ నిది చేయంజాలుదున్ దల్లిరో! 123

ఏనాశీవిషమైన మేలగును తల్లీ! తద్విషం బన్యులన్
హానింబొందగఁ జేయు, నావిషము నల్లై నన్ను నున్మూలిత
ప్రాణుంజేసెడి నింక దీని భరియింపంజాల నెట్లీవు నీ
వీనుల్ సోక భరింపఁగల్గెదవొ హృద్వ్యథిన్ విభున్ నిల్పుమా! 124

ఒక సంవత్సర మీవు దుష్టుగృహమందున్నావు, శుద్ధాంత రం
గక వయ్యున్ నిజమాత్మఁ దా నెఱిఁగియున్ గామాంధుఁడవ్వాఁడుగా
వికృతంబాగద లోకమన్నమతి నవ్వీటన్ స్వతశ్శుద్ధ, న
త్యకలం కాత్మను నగ్ని శుద్ధిగని తా నందెన్ జగత్పావనీ! 125

ఒకరా యిద్దఱు వంశపూరుషులు దివ్యుల్ దేవయోనుల్ కదం
బకమై సీత విశుద్ధ, హవ్యవహుఁడున్ బట్టంగ లేఁడాయె, నొ

ద్దిక నద్దేవిని స్వీకరించి సుఖివై తీర్పంగ దే యిద్ధరన్
వికసచ్చంద్ర మనోహరానన యనన్ స్వీకారముం జేసెఁగా॥ 126

ఆ రాముండట శత్రుగేహమున నమ్మా హాయనంబున్న య
ద్దారన్ మోహితుఁడౌచు నెత్తిపయి కెత్తన్ సిద్ధమైనాఁడ టీ
దారిం బోవుట రాజుఁబట్టి ప్రజకున్ దప్పంగఁబోదంట నేఁ
డీ రీతిన్ బ్రజలాడికొంటెటికెఁగెఁబో ప్రీహరమ్యుఁడా రాముడున్ ॥ 127

పిడుపుం బెట్టిన గుండెవ్రై యతఁడు దేవీ యేమి చేయన్ వలెన్?
బిడుగుఁబోని నుడిన్ సహింపనగునే? వెఱ్ఱెత్తు నీనోరు మూ
కుడుతో మూయఁగ సాధ్యమే? జనగణోక్తుల్ కాదు నా నొప్పునే?
నడిఁ దీర్పన్ గతి వేఱు లేకిటులు వ్యాజంబూని నిన్వీడెడిన్॥ 128

తల్లీ! నీదు విశుద్ధి కాదిట ప్రవాదగ్రస్తమౌచున్న దీ
యెల్లన్ లోకము తప్పుఁబల్కినను నీ వెట్లున్ విశుద్ధాత్మ వౌ
దిల్లాలన్న దురంతమోహ మనుటే ప్రీంకారివై యద్ది లే
దుల్లంబందున నంచుఁ దెల్పుటకె యుద్యుక్తుండు రాముండిటుల్ ॥ 129

రామాంతర్యము నీకె తెల్లమగుఁ దీవ్రంబైన యీ నిర్ణయం
బామోదించుట యేరికిన్ సులువు కాదమ్మా వినంగానె నా
యీ మేనంగల నెత్తురింకినది మిన్నే విర్గి మీఁదం బడెన్
రామస్వామియు నీవు లేకెటులు తాఁ బ్రాణంబులన్ దాల్చునో? 130

మోముం జూడక పాదముల్ గనుచు మున్ముందుండి రామానుజుం
డీమైఁ బల్కఁగ భూమి బ్రద్దలయి తన్నేదో యధోలోక మం
దామై దింపుచునున్న యట్లయి మదంబా! నీవె దిక్కింక నా
యీ మేనింక హరింప వేమనుచు నట్లే సీత కూలెన్ ధరన్॥ 131

పిడు గడిచిన చందంబునఁ
బుడమిం బడి స్మృతిని గోలుపోయి యెడందన్
గడు నడలు పుడమి తనయను
సుడివడి లక్ష్మణుఁడు జడియుచుం గని యంతన్॥ 132

కడువడిగ గంగకుం జని
పుడి సింటను శీతలాంబువులు పట్టి వెసన్
దడబడు నడుగులఁ బర్విడి
వడదాకిన జనని వదన వారిజ మందున్॥ 133

మెలమెల్లఁ జల్లి నంతట
మెలఁకువ గని యామె కనులు మెల్లఁగ విప్పన్
సలలిత భక్తి వశంవదుఁ
డలరుచు నా తల్లి పదము లందునె కనుచున్॥ 134

అన్నియుఁ దెలిసిన నీ విటు
లన్నాయము చేయకమ్మ యన్వయమునకున్
మన్నయిన పాడు లోకము
మిన్నగు నిన్నేమి చేయు మేదిని తనయా! 135

అవకాశం బొకఁడుండేఁగాన నిటులన్యాయంబుగా నాడు నీ
పవి ఘాతంబులకైనఁ దట్టుకొని నిల్వంగాఁదగు న్నీవు మే
లవు తల్లీ! నిను సర్వదేవతలు దివ్యప్రేమ రక్షింతు రే
దివులుం జెందక మాని వాసముల నర్థిన్ నిల్వుమా శాంతిమై॥ 136

అన్నయు నీవు నా జనని! యా దిమ దంపతులై మనుష్యతన్
గన్న మహానుభావులరు కర్మ మయంబగు లోకమందు మీ
కున్న ప్రియాప్రియంబు లిదియున్ గమనింపుము లక్ష్మివీవమై
యున్నగ మాది విష్ణువగు టిక్కడ నిల్చితి వెంత చిత్రమో! 137

మీకు వియోగ మెక్కడిది మీరును మీరు నభిన్నతత్త్వ వి
శ్వైక చిదాకృతుల్ జగతి కంతకు శ్రేయము గూర్ప మానవ
ప్రాకృత దేహధారులటు వర్తిలి యుత్తమధర్మ శిక్ష నీ
లోకము పొంది యెట్టితగులున్ గనఁబోక తరింపఁజూతురే! 138

నీకేను చెప్ప వాఁడన
యే కొంచెము చెప్పనట్టి దిది యెల్ల భవ

క్రీఁకరుణఁ దోఁచి నట్టిది
నాకున్ మీా నడుమ జగతి నర్తన ముదుగన్॥ 139

ఇటకత్యంత సమీాపమందున మహర్షీంద్రుఁడు వాల్మీకి ప్ర
స్ఫుట కారుణ్యా రసావతార ధిషణా సుశ్లోకుఁ డాశ్చర్య కృ
త్పటు వాచంయముఁడుండఁ దండ్రిఁబలె హార్దంబైన ప్రేమాన ని
న్నెటు పోనీయక నిల్పి కాచు భయమింకేలా జగన్మాతరో! 140

నా భయము నన్ను గూర్చిన
దే భటుఁడ నగుచుఁ బనివడి యెదయు నడవడుల్
వేభంగులైన యట్లుగ
నీ భారము మోచి పాప మేచి తపింతున్॥ 141

పరమవివేకి లక్ష్మణుఁడు భావము నట్టిటు తూగనీక ని
ర్భర శితధీమహత్త్వమున రామ వినిర్ణయమున్ భవిష్యమున్
గురుతర గర్భభారయగుఁ గోమలి ధైర్యమునన్ భరించు న
వ్వేరవునఁ జెప్ప విన్న పృథివీ సుత పీనులు చూడినట్టులై॥ 142

నీ భయము నీది లక్ష్మణ
నా భయము భయమ్మె కాదునాగ వచింపన్
క్షోభంబు మాయునే కట
యే భంగి భరింతు నేను నిట్టి యవస్థన్॥ 143

ప్రతిపదమందు నెయ్యోదియొ పాము సరాసరి కాటువేయఁ గం
పితమతి క్రిందికిన్ బడుచుఁ బెట్టెడి దొక్కటి జాలుటైదుగా
కుతకుతలాడు మార్గమునఁ గోటికి నెక్కు క్షణాన పెద్ద పా
మతి భయహేతువై కఱచె నక్కట యీా బ్రతుకింక నెగ్గునే? 144

ప్రాణము లీ శరీరమున వజ్రనిబద్ధములౌట నెట్లు పో
వేను దురంత దుఃఖ పరమేశ్వరి నింతకు నైన దంతయున్
మ్లానముగాఁగ నెంత బహుళమ్మగు దుఃఖమునంద నుంటినో
మానుల నెట్లుగాంతు నవమానిత నిట్లయి చెప్పు లక్ష్మణా! 145

అని మాట పెగులకుండగఁ
బనవెడి ధరణీ తనూజ పాదములందున్
దన శిరసుఁ జేర్చి లక్ష్మణుఁ
డనితర సాధ్యమ్ము తథ్య మగునిది తల్లీ! 146

నిను నీవచూచుకొని మ
న్నన సేయక యున్న మిగులు నా జగ మింకన్
నను గరుణఁ గావు మమ్మా
జనపతియెడ నెనరు చూపఁజను నీకు సతీ! 147

అవమానం బిది కాదు నాఁగ వశమే? యద్దాని కెవ్వారు హే
తువు? నా భార్య వసింప లేదెపుడు శత్రుక్షేత్ర మందంచు నె
ట్లవుఁ జెప్పంగ నదెంత భూపుఁడయినన్ వ్యక్తమ్మునే నమ్ము మా
నవులన్ నమ్మఁగఁ జేయుటెట్లు వెలికానన్ రాని సత్యమ్మహా! 148

ఒక దేశమ్మున నొక్క కాలమున వహ్న్యుద్ధూతవైనట్టు లొ
క్కొక దేశమ్మున నెల్ల కాలమున నట్లు ద్భూతవౌచుందువో
వికలమ్మైన జగమ్ము నమ్మటకు? పృథ్వీభృత్సమా! శాంతివై
వికృతిం బొందక నిల్చుచో నిజమదే విశ్వానికిం దెల్లమా! 149

నీ సంతానమె నీ పవిత్రతను సందేహించు లోకంబు వి
శ్వాసం బందఁగఁ జేయు రాఘవ కులస్వాస్థ్యంబు చేకూరెడిన్
దోసంబై యిపుడాడిపోయు జగమే తూర్యస్వనంబొప్ప నీ
ప్రాశస్త్యంబు వచించి వేడికొనునంబా! యోర్పునందంగదే! 150

మాను లెఱుంగరే నిజము మానిని వారు సమస్తలోక పూ
జానతు లందికోఁదగిన సాధ్విని నిన్ను వినీతి భక్తి స
మ్మానము లొప్ప స్వీయ శుభమంజుల వాటుల నిల్వవచ్చు శ
ర్వాణి వటన్నరీతి ననవద్య విధిన్ భజియింతు రమ్మరో! 151

అనుచు సహేతుకమ్ముగను స్వాత్మ విశుద్ధిగఁ బల్కు లక్ష్మణున్
విని జనకాత్మజాత మధువీచి వచస్సముపేత! యెంతవై

నను పెనుభక్తి యుక్తుఁడవు నాయన! శ్రీరఘురాము మేన నీ
గ నయిన వ్రాలనీవు బలు కంచెను గట్టుదు చుట్టు రక్షగన్॥ 152

దేనికి దానికే పొసఁగఁ దెల్చితి, వింతకు నాదు కర్మమే
యాను నిమిత్తమంటివి, యథార్థము, కాదని యెట్లనంగలన్?
కాని రఘూత్తముండు ననుగానకు పంపుటచేత నాతఁడున్
నా నిజమందు శంకపడునా యని యారక యుమ్మలించెదన్॥ 153

ఎంతఁగఁ దీరకుండినను నింతటి తీవ్ర పరిస్థితిన్ ననున్
జెంతకుఁ బిల్చి యిద్దరకు శీలమునందున గండమిద్ది ని
న్నింతయు నమ్మెదన్, దలఁతు నిట్లుగ, నీవెటు లెంతువంచునన్
సుంతగ సంప్రతించినను జూడు మదెట్లుగనుండి యుండెడిన్॥ 154

నాకిట్లింతగ దుఃఖమాట కపుడన్నా వీలులేదందు నం
తే కాకేను పరిష్కృతిన్ జలుపు నాతీరెట్టిదై యుండునో?
ఏ కార్యంబున కేని పత్నినయి యెట్లే మంత్రిగా నాటకున్
నాకున్ యోగ్యత సుంతయున్నది కదా న్యాయంబు నీవెంచుమా!

కా దీ కార్యము నన్ను గూర్చిన దనంగా నేను నిస్స్వార్థనై
భేదంబెంచక తీర్పుచెప్పఁ దగనో? పృథ్విన్ సమస్తంబు తా
నీ దారింబడి నిస్సహాయముగ నెట్లేలున్ వచింపంగ దే?
నా దౌర్భాగ్యమె నన్ను నమ్మఁడతఁడున్ సత్యమ్ము సుమ్మిద్దియున్॥

'నాతి చరామి' యన్న పతి యాట నిటుల్ వచియింతునంటే; లో
కాతిగ నౌదునే? యతఁడె యట్లుగ నన్నుఁ గదల్చి యున్నచోఁ
జేతమె తప్పియుండెడిదొ ఛిన్నతరున్ బలెఁ గూలియుందునో?
యే తఱి నెవ్వరైన నిటులే వచియించెద రైన పిమ్మటన్॥ 157

ఇటు దుఃఖ మనుభవింపఁగఁ
బటుతర మనివార్యమైన ప్రారబ్ధము న
న్నిటు తఱిమెఁ గోర్కె వెంబడిఁ
గటకట యిది యన్యకృతముగా ననేలా? 158

జీవుల మోహలక్షణమె చిత్రము చేటున దెప్పు డెవ్వరో
కావలెనంచుఁ గూర్చిరని క్రమ శుభావళినేమొ తామెయై
చేవ గడించికొంటిమని చేతములన్ దలపోయుచుందు రీ
భావమె తప్పుగాదె యనుభావ్యమదెల్ల స్వయంకృతమ్ముగాన్॥ 159

అనుచున్ జానకి తత్త్వవేత్త్రియయి దుఃఖాక్రాంత లోకంబు నం
దునఁ దానుండి యదెల్ల దాటి తనయందున్ నిల్చునా శాంతమై
కనిపింపన్ సెలవంది వీడ్కొనఁదగున్ గాకిప్పుడన్ బుద్ధి ల
క్ష్మణుఁ డున్నంతట బెస్తలచ్చటికి భూషావస్త్ర సంభారముల్॥ 160

పడవఁ దా ముంచివచ్చిన వానిఁ దెచ్చి
భక్తి నర్పించి యంజలుల్ పట్టినిలువ
జానకీదేవి వారున్న చాయఁజూచి
పిలిచి కొన్నిటి వారికర్పించెఁ బ్రీతి॥ 161

భయపడుదురేల హృదయ పూర్వముగ నిత్తుఁ
దారకులు గాన మీకుఁ గృతజ్ఞబుద్ధి
నెంతసేపుంటినో నావ నేటిమీద
నెంతమాత్రము నెఱుఁగకే యిందు దిగితి॥ 162

యానమందున నేఁ గన్న యట్టి శాంతి
యంతయున్ మీదు నెదల నున్నట్టి శాంతి
కదలకే దాటినట్లె గంగాస్రవంతిఁ
బోవకే దాటనెంతు మిథ్యావదంతి॥ 163

మాతృతఁ బొందనున్న యొక మానిని మాత్రమెయాచునిచ్చు నీ
నేఁతల స్వీకరించి దయనించి ననున్ పుటి కన్నబిడ్డగా
నే తలపోసి దీవనల నిండని పల్కుచు విప్పికప్పు న
మ్మాతకు వారు భక్తి మెయిమాటికి మాటికి వంగి మ్రొక్కుచున్॥

తమ్మా యమూల్య వస్త్రములు తీసికొండని బతిమాలుచున్న దన్న తాత్పర్యము తప్ప మత్తేమియు నర్థముకాని యా నావికులు వాని నెట్లో గ్రహించి వెడలిపోగా లక్ష్మణుఁడు— 165

ఆమె వర్తనంబు నామె యాడినమాట
ప్రతిపదానఁ దన్ను పనవఁజేయ
నేమి చేయనెంచు నేమాత్ర మెఱుఁగని
మదిని గదలలేక మసలుచుండ॥ 166

చనుమింక లక్ష్మణా! నృపుని జాగిలి మ్రొక్కితి నన్ను నీవు వ
వచ్చినపని యయ్యెఁగా, యిటను చిక్కిన నేమని యెంతురోయటన్
జనకజ శాంతచిత్తమున శాసకు భావము స్వీకరించె నా
మనవి యొనర్పు, మాతఁడును మానవుఁడే యిదియెట్లు సైచునో?

మా కెపుడున్ శరణ్యుఁడవు మానవనాథుని సేవ నేమరం
బోకుము నాఁడు నేఁడు తనువుల్ నిలఁబెట్టెడి సర్వభారమీ
నీకె తటస్థమాచు మము నిక్కముగా బుణ పెట్టుచుండెనే
నీకడ నేమి యాడునని యే యిసుమంతయు జంకఁబోకుఁడీ! 168

రామగతాసువున్ నను నరణ్యమె కాదు సమస్తలోకముల్
తామయి ముట్టనేరవు నెదంబడి నిల్చు విధేయమాచు నా
క్షేమము నేనె చూచికొను శేముషియున్నది రాముగూర్చియే
నామది బాధ నీ వొకఁడు నాకు మఱందివి లోటుఁదీర్పఁగాన్॥ 169

ఈమాటన్ విని తల్లు లేమనెదరో యేఁకారు శాంతర్స్వశ్రం
గా మోఘాంతరు లన్వయావన వశిష్ఠారుంధతుల్ మత్పితల్;
శ్రీమద్రామ విభూత్తమాంఘ్రియుగ సంసేవా మనస్కుండ వీ
వేమై రాముననెట్టి కీడు కనరాకెట్లేని రక్షింపనా॥ 170

నీవున్నావని ధైర్యమూనెదను తండ్రీ! పోయిరమ్మింక, నే
నై వన్యాస్థలినుండి జోతలిడి నట్లచ్చోటి శ్రేయఃప్రియం
భావశ్రేణికి నొక్కరొక్కరికిఁ జెప్పంజెల్లు నా కోర్కిమై
శ్రీవిద్యానిధి వీవు నీకు నిఁక నే జెప్పన్ మఱేమున్నదో? 171

అని యామె యూరకుండిన
వనమది సర్వమ్ము ప్రళయభావము పొందం

గను ముందు పరమ శాంతిని
గను నట్లుగ నణువు నణువు కదలక యుండెన్॥ 172

అడుగెట్లు వేయగల్గెనో
కడు నిశ్చలమైన స్థితిని గనుగవ మూతల్
వడ నిల్చునామె నొంటరి
విడియెట్లుగఁ గదలఁ గలిగె విస్మయమయ్యెన్॥ 173

అమర నదీతటం బొరయు నంతను నొక్కొక్కయడ్గు వెన్క కా
యమ నిజశక్తిచేతఁ దను నంపిన యట్లుగవేసి యచ్చటన్
జెమరుపు తగ్గి శైత్యమునఁ జిత్తమెకించుక సేదదేఱి య
య్యమ కననైన యంతవఱ కట్టులె చూచుచు నేగెనావపై॥ 174

కనరాని దూరమైనను
చనియెడి లక్ష్మణుఁడు తాను జనకజ దెసయుం
డిన విష్ణుపదము నే కనఁ
దన యెదహత్తిన జనని పదములే కనియెన్॥ 175

ఆతలి యొడ్డుఁజేరె హృదయమ్ము నెఱుంగని రాజసోదరుం
డీతని తీరమం దెడఁద యెంతయు నిండిన రామతత్త్వమై
సీత మహీజరూపమును జెంది యచంచల వృత్తి విష్ణువౌ
నా తెలి రావిమొక్క మొదలందుననే వసియించె నిష్ఠమై॥ 176

నడుమన్ నిశ్చల నీరవంబగుచు శాంతంబై ప్రసన్నాంబు లి
మ్మడిగా మానులకంది యిచ్చుచును సంస్మర్త్రంతరంగాఘు ని
ర్దళన ఖ్యాతివహించు విష్ణుపద నిత్యస్థాన సంభూత సా
గెడి విశ్వమ్మిదియెల్ల విష్ణుమయమన్ కీర్తిన్ నిరూపించుచున్॥ 177

అన్న చెప్పెను తమ్ముఁడు నాచరించె
భక్తియుండిన నిదియేమి భ్రాంతి యనుచు
నురక యనుకొందు రేగాని యూర్మిళా ప్రి
యుండు తానెంత పడియె నంతుండఁబోదు॥ 178

వచ్చునప్పుడు రాముఁడవ్వాని యెడఁద
పట్టికూర్చుండి యాజ్ఞ నిర్వాహణ నడిపె
వెడలునప్పుడు తల్లి హృద్వీథినొదిగి
నడపుచున్నది వాని నయ్యడవి నుండి॥ 179

వట్టి జగమునఁ బరవశ వర్తనంబు
వ్యక్తి కెల్లప్పుడు పరమానర్థకారి
వ్యక్తి దళనమ్మొ యా పరమార్థమందు
నదియె యప్రాప్య దివ్యమానట్టి వరము॥ 180

శక్తి, శక్తము, భక్తుఁడు ముక్తియనుచు
మానముం దాల్పలేక వాఙ్మయమనస్సు
పట్టునంబడి యలజడి పడుటెగాని
యున్నదొక్కటె మూఁగు రెందుండిర హహా! 181

జీవన్ముక్తుఁడు లక్ష్మణుండటు పురశ్రీ దిఙ్ముఖుండై రథ
ప్రావిష్టుండయి యేగుచుండుటది దూరంబందు రేఖాకృతిన్
దేవీ దృష్టికి నానఁగా నటు సమాధిన్ వీడి యేకాకి తా
భావంబందిన సీత జేలువడె నశ్వత్థాగ వేదిస్థయై॥ 182

నానాత్వంబున నున్నలోకమున భిన్నంబౌట నేకాకిగా
నైనన్ భీతియు నద్వయస్థితి నహోనైక్యంబు నిర్భితియున్
గానైయున్న పరిస్థితిన్ దలఁచి వీఁకన్ జానకీదేవి ధై
ర్యానన్ దా మెలమెల్ల హైమగిరి కన్యావాహినిం జేరుచో॥ 183

అది సంధ్యాసమయంబు, శ్రావణము, శుద్ధైకాదశీవేళ, య
న్నది చెంతన్ జనకాత్మజాత శుచియై నారాయణ ధ్యానసం
పద నోలాడుచుఁ గూరుచున్నతఱి నెవ్వారో దరిం జేరి సా
ర దయామూర్తులు పల్కరించినటు నేత్రంబుల్ విడన్ జూచుచున్॥

ఒకదెస పర్వతస్తని, మహోన్నత కానన వృక్ష శేఖ రా
త్మక గురుకేశపాశ, సముదార హృదంతర దుగ్ధసంచయ

ప్రకర ముదావహాత్ప్రసృత పావనదివ్య పయః ప్రపూర, మే
చకకటి వృత్తకంధి, యనుసంధిత సర్వసుగంధ ధాత్రియున్ ॥ 185

మఱుదెస వార్వికార తనుమండిత, తీరగతాగచేల, ప్ర
స్ఫుర దరవిందమండల సుశోభితకంధర, మీననేత్ర, పు
ష్కర కలహంసచక్ర విహగస్వన మంజుల వాగ్విలాస, సం
చర దురుభంగ హస్తమృదుచాలన, సాగరపత్ని గంగయున్ ॥ 186

తన తల్లిన్ దన యాడుబిడ్డను విపత్కాలంబునన్ సంస్మరిం
చిన వెంటన్ బ్రియదేవతాకృతులతో స్నిగ్ధాంతరంగంబు లు
ప్పొనఁగాఁ బొంగగ వచ్చి నిల్చిన కడున్ బ్రీతిన్ మహాభక్తి వం
దనముల్ వారికొనర్చి జానకి యెడందన్ బట్టుకోఁజాలకన్ ॥ 187

తల్లీ మేదిని, జాహ్నవీవదినె! సీతన్ మీకుఁ బ్రేమాస్పదన్
బ్రోల్లాసంబునఁ బూర్ణవైభవముతోఁ బూజించుకోలేక సం
ధిల్లన్ దుర్దశ దిక్కుమీరె యనుబుద్ధిన్ బిల్చి నానమ్మ న
న్నెల్లన్ లోకము నిందసేయనిటనే నేలావసింపన్ వలెన్ ॥ 188

అని యట్లంచునె పెల్లుగా నుబుకు దుఃఖావేగమేమాత్ర మా
పను నిశ్శక్తికయాచు నేత్రములఁ గుంభద్రోణముల్ ధారలై
చను నా బిడ్డను భూతధాత్రి తన హస్తద్వంద్వముంజాచి ప
ట్టిన గంగాంబయుఁ జెంతఁజేరి వధువున్ డీల్వోని యట్లుంపఁగన్ ॥

మిథిలారాజకుమారి! సర్వ సుజనస్మృత్యంతరావాస! ని
ర్మథితాంతఃకరుణా! భయంపడకు మమ్మా! నీకు లోటేమి? యీ
పృథివీదేవియుఁ దానువచ్చినది సాధ్వీ! తల్లియున్ నేను నీ
కథ భూతంబగు తాపమెట్టిదియు డాయన్ రాక రక్షింతుమే! 190

ధర్మావిష్ట రఘూద్వహుండు నిను భద్రంబొప్ప రక్షింపఁగా
శర్మాకాంక్ష స్మరించినప్పుడె యవశ్యంభావి యూహించి నేఁ
దీర్మానంబుగ నన్ని వీళ్ళలును మత్తీరంబునందే భవత్
ధర్మప్రాభవ యోగ్యమానటులు క్రొత్తల్ కూర్చితిన్ దల్లిరో! 191

అదేయట చూడు మీ యెదిగి యబ్బుర మొప్పగ నీటి ప్రబ్బలున్
పొదరుగ నల్లికొన్న యవి పుణ్యనివాస గృహంబు లట్లు నీ
కెదియుఁగొఱంత యుండదట నేము నిరంతర పార్శ్వవర్తితన్
మెదలుచునుందు మా ర్తివిడి మెల్లగ రమ్ము ప్రసూతి వాటికిన్ ॥192

చల్లనితల్లి గంగయటు జానకిఁ దేర్పఁగ నీటి బుగ్గలా
ఫుల్ల విలోచనంబులను భూసతి యామెను జేరఁదీసి నా
తల్లి! దయాంతరంగ! వసుధాసుత కెంత శుభంబుకూర్చి తే
యుల్లము తేటికొన్నయది యుండియు లేనటులైన నాకునున్॥ 193

ఆ రఘురామచంద్రుఁ డపుడన్నుడిన్ దొలుదొల్త నేదియో
వేరము కల్గి మానసము విశ్లథమైనది కాలపక్వమై
తేరినవేళ బిడ్డ నను దీనముగాఁ దలపోసినంత నే
యూరక యుత్తలం పడెడి యుల్లమునన్ బరువెత్తి వచ్చితిన్॥ 194

చూడుము భేద మెంతయగు స్రుక్కు మనస్సది వ్యర్థమెప్పుడున్
గాడినగుండె శాంతముగఁ గార్యములన్ గమనింప నీదుపో
పోడిమి బిడ్డకున్ బురుడుపోసి ముదంబును బొందు భాగ్యమ
వ్వాఁడు తనంత తానొసఁగె వానికి నానెనరైన దీవెనల్॥ 195

అగునగు నెంతరాణికి నిజాంబ సమక్షము నందె బిడ్డలన్
దగఁ గనుకోర్కి యుండుగద తత్స్మృతి మాలిన నన్ను పుణ్యుడై
మిగులగ మేలుకొల్పి నినుమేకొని పంపెను నాకుఁదోడు నీ
వుగ సమకూర్చి పెట్టితివి పొల్పుగ సర్వము ముందు చూపుతో॥ 196

అవును నా బిడ్డకేమి లోటగుట యేమి
యాప్తకామకు నన్నియు నమరునట్లె
యమ్మ యీ పక్వఫలము నీ వారగించి
రమ్ము పోదము నవనికుంజమ్ము కడకు॥ 197

ఆలో మెల్లగ సాంధ్యకృత్యములకై యచ్చోటికిం జేరు వ
న్యాలంకారులు స్త్రీలు పూరుషులు బాల్యప్రాయులెవ్వారో యే

యాలంబంబును లేని స్త్రీ యొకతె తా నల్లంతదూరాన గం
గా లోలాంబులు చూచుచున్నటులుగాఁ గన్పింప నాశ్చర్యమై॥ 198

చేరంబోవఁగ నెంచుచో నిలిపి యాస్త్రీ వెంట నున్నట్టి గం
గారామన్ ధరణీసతిన్ గనుచు ప్రజ్ఞాదృష్టి వీక్షించి త
త్ప్రారంభంబు సమస్తముం దెలిసి తోరంబైన ప్రేమాన వి
స్మేరాస్యుండయి నా కుజాతముని గంభీరాత్ముఁ డచ్చోటికిన్॥ 199

సలిలాపూర్ణ కమండలుంగొని ప్రశస్తంబౌ కుశల్ కొన్ని వ
త్సలతన్ గైకొని రాక్షసాహరణ దక్షప్రౌఢ మంత్రంబు లు
జ్జ్వలతం బల్కుచు వృద్ధలిద్దఱు పరిజ్ఞాతల్ ప్రసన్నాత్మలై
ఫలపుష్పాదిక హస్తలై యనుసరింపన్ బోయి సీతాసతిన్॥ 200

కని మౌళిన్ గరముంచి యార్ద్రమతితోఁ గల్యాణికిన్ గాన్పుచు
ల్కనగా నౌనటు దీవనల్ కురిసి బేలా! నీ వధైర్యానఁ గుం
దను రాదింతయు మాదు నాశ్రమము చెంతన్ నీకు మేమెట్టి లో
టును లేకుండఁగఁ జూచికొందు మటుతోడ్తో వచ్చి వాసింపుమీ! 201

నే వాల్మీకిని నాకు స్నేహితుఁడహో నీ మామ నన్వేఱుగా
భావంబందుఁ దలంపఁబోకుము పితృప్రాయుండ నీ కెంతయున్
నీ విచ్చోటికి వత్తు వీపగిది నెంతే నన్ను మన్నింతు వం
చీ వేళన్ నినుగొంచుఁ బోవుటకె యిట్లే వచ్చితిన్ జానకీ! 202

అని మునిపల్క జాహ్నవియు నాయన కంజలిబద్ధయౌచు నో
మునివర! నీదు వత్సలత ముగ్ధలఁజేసెడి మమ్ముగూడ నీ
వు నిటదయన్ గుమారికి సుపుత్త్రత కల్గెడుదాఁక నుండఁగాఁ
జనవున వేడికొందు నటు సాగుదమల్ల నికుంజ సీమకున్॥ 203

గంగ యట్లన నల్వురు గర్భవతిని
మెల్ల లేవంగఁదీసి తామెల్ల యెడల
నూతగానిల్వ జానకీమాత తత్క
రంబు లవలంబనముచేసి రాఁగఁజనుచు॥ 204

జ్ఞప్తి కలుగఁగ వాల్మీకి సాదరముగఁ
గాంచి సతులిడి చలదళాగమ్ము నీడ
శ్రమను విడిచిన భూషాంబరముల మూటఁ
దనకుఁ దెప్పించి పెట్టుఁడీ యనుచు సీత॥ 205

కోరినంతట నొక బ్రహ్మచారిఁ బిలిచి
దానిఁ గొని తేరఁ బంపించె మౌని వరుఁడు
వదినెయుం దల్లి వృద్ధ తపస్వినులును
సాయపడ జానకీదేవి సాగెనపుడు॥ 206

అన్యోన్య సంవేల్ల దతి దీర్ఘలతలతో
 శీతాతపమ్ములఁ జేరనీక
సువిశాల మధ్యస్థ సుందరాంగణమెల్ల
 మాత్రంతరంగ సామ్యము వహింప
పార్శ్వమ్ముల న్నిల్చు ఫణి ఫణా మణుల దీ
 ప్తులఁ జీఁకటివెత త్రోపుడు వడంగ
ప్రేప బెత్తమ్ములఁ బేని కూర్చిన మంచె
 నొత్తు పఱపు పూల మొత్తలమర

నలికి ముగ్గులువెట్టి కళ్యాణ మంట
పంబు వోలిక తోరణ ప్రతతినొప్పి
కనులనే కాక మనసు రంజన మొనర్చు
వేతసీకుంజ సీతాప్రసూతి గృహము॥ 207

చేరి పృథివియుఁ దన్ముఖసీమ నిలిచి
మెట్టినీళ్ళులు దృష్టిపో నెత్తిపైవఁ
బ్రాజ్ఞ వాల్మీకి పుణ్యాహవాచనంబుఁ
జలుప జనకజ తత్ప్రవేశమ్మునందె॥ 208

అపుడె వచ్చిన మూట నల్లంత విప్పి
భక్తినర్పించె వానిఁ దపస్వినులకు

మౌనివరునకు నధిక సమ్మానమొప్ప
మిగిలినవి పంచియిండనె మేదిని సుత॥ 209

మునియొక్కండె నికుంజ వాటి వెలి సౌమ్యుండౌచు రక్షోఘ్నముల్
మనువుల్ పల్కుచునుండె లోన నువిదల్ మంచస్థయా జానకిన్
చెను శ్రద్ధన్ గనుచుండ నొప్పులని తబ్బిబ్బుల్ పడంబోవు మా
త్రనె రాత్రింగనె మేషలగ్నమునఁ బుత్త్ర ద్వంద్వమున్ సీతయున్॥

మొదటం బుట్టిన చిన్నవానికి లవంబుల్ గూర్చియున్ మెల్లఁగాఁ
బిదపం బుట్టిన పెద్దవానికిఁ గుశశ్రేష్ఠంబు లందిచ్చియున్
సదయుండౌ ముని మంత్రయుక్తముగఁ గౌశల్యమ్ము నిండించె న
మ్ముదితల్ తానును శిష్టరాత్రి నటులే పుచ్చెన్ దదారక్షుడై॥ 211

లవములన్ మార్జితుండయి లవుఁడు వీఁడు
కుశములన్ మార్జితుండయి కుశుఁడటంచు
వీరి కివ్యేవియే మంచి పేరులగును
సమయమిది మంచిదనియె సంయమి తసంత॥ 212

తన వంశీయుల పుత్త్రులంగనఁ బ్రమోదం బందుచున్ జాగు నో
ర్వని వాఁడై జగదక్షి, వేదమయ విశ్వప్రాజ్య తేజస్వి యం
తన తోతెంచెను ప్రాగ్దిశాగగన నేత్రప్రస్ఫుర జ్యోతియై
ముని సంఘమ్ములు ప్రాతరర్ఘ్యముల సంఫుల్లాత్మనిం జేయఁగన్॥213

నా మాటేమిటి యన్న మౌని కవనీ నారీశిరోరత్న మా
ర్యా! మౌనీంద్ర! యనుగ్రహించి నినుగాదం టెంచఁబోకయ్య నా
కీ మాత్రమ్ము సుఖమ్ము పొందనగు నీవిట్లేర్పడెన్ మేము రే
పో మాపో యనువై రసాతలము కొంపోనెంతు మీ బిడ్డలన్॥ 214

స్తన్య త్యాగముదాఁకఁ బుత్త్రులను సీతంబెంచగానిమ్ము తా
నై న్యాసమ్ముగ వారి నీకడనె విద్యాభ్యాసముంగోరి డిం
చు న్న్యాయ్యమ్మిది యౌనుగాదె యన వాక్శుద్ధుండతండంత రా
జన్యానేకప సింహు లౌనటుల నాశాసించి యేగెన్ గృపన్॥ 215

జనకరాజ తనయ తనలోనఁ దానెంచి
ప్రబతుకునందు చిత్రగతుల నెల్లఁ
ద్వ్యక్తమైన తనకుఁ ద్రాసంబు గనకుండ
నయిన వారలిట్లు లాడుకొనుట! 216

చక్రవర్తి బీజసంభూతులయ్యును
తనువు లొసఁగు తల్లిదండ్రులుండి
యన్ని భోగములకు నర్హులైయుండియుఁ
దనయులిట్లు లిచట జననమగుట! 217

## ఖండాంత పద్యములు

ఇది సమజ్ఞ; శ్రీరామ మహీశునకును
లలితగుణులైన జానకీ లక్ష్మణులకు
యశముగూర్చిన చరితమై యవని మూన
వావళి నడత సరిదిద్దు నభ్రకేశ! 218

నీ కరుణన్ మనంబిదియు
నీ వశవర్తిని యాచునిల్వ నీ
లోకమునందు నిల్చుటయు
లోకువయే యగు దేవదేవ న
న్నాకుల పెట్టు నీ మనసు
నాడక యుండగ నీవెనిల్చి య
స్తోక సుఖంబునందు దయ
చూపుము నిత్యము చంద్రశేఖరా! 219

శిఖరిణి. విరించి శ్రీకాళద్విరదముఖ భక్తార్తి హరణా!
పరాప్రేమైక ప్రాప్త హృదయ మణిస్ఫార సుషమా!
అరీంద్ర ప్రధ్వంసద్యమనియమ రూపాధ్వ సుగమా!
నిరాకారాకారా! నిఖిల జగతీ నేత్రనిగమా! 220

# ప్రతిష్ఠా ఖండము

## 3

## అఘోరము

శ్రీ పార్వతీశ! త్రిణయన!
సౌపర్వగణార్చితాంఘ్రి జలజద్వంద్వా!
తాపోప శమనదక్షా!
వ్యాపాదక! పోషకా! వివర్తసృజనకా! 1

సీతాత్యాగ కఠోరవార్త వినరాఁ జేతన్ జెవుల్ గప్పి య
య్యో తల్లీ! బహుకష్టమా శివశివా యున్నావె నీ వయ్యయో
యే తల్లిన్ దివిజుల్ మహర్షులు జగంబిట్లుంచు నా తల్లి గాఁ
జేతంబందుఁ దలంతురా జననికే చేటయ్యె నింకెట్లొకో? 2

అగ్గింజొచ్చి విశుద్ధయై వెడలు నీ యమ్మన్ బరావాస మం
దెగ్గైయున్న నిమిత్తముంగని త్రపాహీనుండతం డెవ్వఁడో
పగ్గెల్ పల్కఁగ వాని విన్న ప్రభు వల్పత్వంబు భావింపకే
నిగ్గున్ దేల్పఁగ శూన్యమోహుఁడయి తానిల్చెన్ సతిన్ వీడుచున్

మెతుకునుబట్టి చూడ ననుమేయ మగుంగద సర్వతండుల
స్థితియు నిదొక్కటే రుజువు శ్రీరఘురాముని ధర్మనిష్ఠకీ
యతులిత ధర్మమూర్తి సడియన్న సహింపఁడు ధర్మదోషముల్
గతుకఁడు తాను యంత్రమయి కష్టము నెంచక దిద్ది తీర్చెడున్॥ 4

అగు యువరాట్పదంబు చన నాతని చేతకు దీనికిం దగెన్
మిగులు వయస్సునం బితృ సమీక్ష పథంబున యావనానఁ దా
నెగఁబడి యిచ్చు నవ్వరము లిప్పుడు తీర్పఁగ లేక కుందుచో
నగణిత సత్యవాక్య ఫలమందగఁ జేయఁగఁ దానె పూనెఁబో॥ 5

తండ్రియుఁ దల్లియన్నలును దమ్ములు భార్యయుఁబుత్ర మిత్రముల్
తీండ్రము ధర్మమైనపుడు తేకువ నాతని కడ్డు నిల్వరే

వేంద్రము లేక యాతఁడు పవిత్ర పథిన్ నడయాడి నిల్పెదున్
దండ్రి గతింతు నేననుచు దారిని నిల్చిన నాగిపోయెనే? 6

అప్పుడు తండ్రి యిప్పుడనలాతి విశుద్ధ నిజార్ధ దేహాయున్
గప్పి విమోహితున్ జలుపఁగా నసమర్థులె యైరి ధర్మ దీ
ప్తొప్పతి రామచంద్రు బడబాగ్ని సమంబగు స్నేహమెంతఁగా
విప్పిన నింకఁజేయునొకొ వీఁడిదియై యడుగంటి పోయెడిన్॥ 7

అగ్నివలెన్ దహించు సడి వ్యర్థముగాఁ బొడసూపె నింత ము
న్నగ్గిని జొచ్చి వెల్వడిన యట్టులె యా యతిలోకశీల తా
నొగ్గిన పుణ్యసంపద నహో వెడనిందను దాటితీఱునే
యొగ్గును గానసీక జగదీశ్వరుఁ డామెను రక్షసేయుతన్॥ 8

యోగ్యులు కోసలావని మహోజ్జ్వల ధర్మపథానుయాయు లీ
భాగ్యమునిట్లు సాధుమతిభావనచేసి ప్రశస్తరాజ్య సౌ
భాగ్యము పట్టినందులకుఁ బ్రాగ్భవ పుణ్యము నెంచుచున్నచో
యోగ్య సమర్థ సారథి నియోజితమౌ రథమయ్యె రాజ్యమున్॥ 9

కీర్తికిఁ గారకుండగు నకించన రూపమహాజనుండు నీ
వార్త చెవింబడన్ హృదయభాండము భళ్లున బ్రద్దలైన య
ట్లార్తిని బొందె నీ దురిత మాగునె యింతటితో నటంచు దు
ష్కీర్తి శరీరుఁడై నిలిచె సిగ్గుపడెన్ దలయెత్తఁ జాలకన్॥ 10

రాముని రాజ్యమై యతఁడు రక్షణపొందెనుగాక కానిచో
నామెయి తీవ్రులౌ జనుల యాఱడి తట్టుకొనంగఁ గల్గునే?
రామునివోలె నాతఁడును రాగ విదూరుఁడుగాగ యత్నమం
తో మహితమ్ముగా జరిపి తుట్టతుదన్ గృతకృత్యుఁడయ్యెఁబో॥ 11

సీతను లక్ష్మణుండు వనసీమను దింపి యయోధ్యచేరు ని
ర్ఘాతము ఋశ్యశృంగముని రాణ్మహనీయ తపోవనంబు ను
ద్ధాత మొనర్చెఁ బ్రప్రథమ ఘూనన తీవ్రత తగ్గినంతఁ బ్ర
స్ఫీత మనస్కులెల్లరును సీతకునై బెగడొంది రుమ్మడిన్॥ 12

రామునితోఁడి సీత వనరాజికి నేగిన యప్పుడే యయో
ధ్యా మహీఁగాలు వెట్టనని యన్న దరుంధతి యామె నేఁడు తా
నేమెయి పోవునచ్చటికి? నెచ్చట నున్నదొ సీత యచ్చటే
యేమును నుందుమంచు నిజహృద్గత భావము వెల్వరింపఁగాఁ॥ 13

ముని మూర్ధన్యుఁడు రాఘవాన్వయ మహీపుల్ నిత్యసత్యమ్ముగాఁ
గని యర్చించు వశిష్ఠమౌని యెదలోఁ గంపించి శిష్యత్వ ము
జ్జన సేసెన్ రఘురాముఁడింకఁ దన ధీస్వాతంత్ర్యముం జూపు మే
లని తానున్ సతివెంట నేగుటయె పథ్యంబంచు భావించినన్॥ 14

ముగ్గురముండి యొక్కరికి ముద్దుల కోడలికెంతమాత్ర మీ
యెగ్గునఁ దోడు నిల్చుటకు నేని సమర్థత లేకపోయె మా
పగ్గెలు బుగ్గిగా నతఁడువచ్చి కుమారిక యేది యన్నచో
నగ్గిని దూకఁగా వలయు నంతియయౌనని తల్లులెన్నఁగన్॥ 15

శాంతయును ఋశ్యశృంగుఁడు
శాంతమతులు వారినెటులొ సాంత్వన పఱుపన్
స్వాంతములు కుదుట పడఁగా
శాంతాసతి పలికెనిట్లు చల్లని వాక్కుల్॥ 16

మీకే కాదిది యేరికైన నెద భస్మీభూతముంజేయు నా
లోకాతీత మహస్కకేమి యిటులీలోక ప్రవాదం బిదే
మీ? కారుణ్యము లేదు దైవమున కంతేకాని యా సీతకీ
లోకంబందున హానియెట్టిదియు నెట్లున్ గల్గఁబోదమ్మరో! 17

అగ్గి యామెను ముట్టలేదన్నమాట
యే రుజువు జలాదికములు నింతెయగును
కడుపునం దాల్చు రాఘవ గర్భమామె!
అదియె ప్రకటించు నామె మహత్త్వమెల్ల! 18

తమ్ముఁడు లక్ష్మణుండు మునిదారల మ్రొక్కఁగ నెంచు నామె చే
తమ్ము నెపమ్ము వెట్టి యరుదార సురాపగ చెంతడించె నా

యమ్మ యెటేగెనో తెలియదాయెను మీరెటు పోదురింక జే
మమ్ముగ నుండఁగోరుచును మానినికిన్ వ్రతముల్ పొనర్పుఁడీ! 19

అని శాంత పలికి నంతట
ముని దంపతులొప్పికొనుట మూగురు తల్లుల్
కొనకొని వేఱుగఁ దలఁపక
తన యాభిమతానుసారి తాత్పర్యమునన్॥ 20

అచట నేయుండి నిత్యమత్యంత శ్రద్ధ
నఖిల వ్రతములు చేయుచున్నంతలోనఁ
గాలచక్రంబు తిరిగి పుష్కరము కడచె
నెవరికోసము నది నిల్వదింతయైన॥ 21

అను దినమ్మును రామరాజ్యమునుగూర్చి
వచ్చు వార్తలు విని మునివల్లభుండు
పొంగుచుం జెప్పు శిష్యుని ప్రోడశానము
ఋశ్యశృంగుండు విని విమర్శించుచుండు॥ 22

అద్ది పరిహాసమేయౌనో యసలు మదిని
నున్న యట్టిది యే యౌనో యుండియుండి
యంత కఠినత యేల? రాజన్నవాని
కాలుబిడ్డలు నుండరాదా యటంచు॥ 23

భర్త పలుకఁగ శాంత నెవ్వగను బొందుఁ
దల్లులున్ మార్గాంగంబులఁ దల్లడిలుదు
రంతలోన వశిష్ఠుండు శాంతమనుచు
స్వస్తి వచనంబు పలికి ప్రశాంతపఱచు॥ 24

ఒక్కొకప్పుడు జానకి యున్నవార్త
నెవ్వరో తెత్తురంత వీరెల్ల వారు
వారిచుట్టును జేరి యవ్వారిగాఁగ
ప్రశ్నముల్ గుప్పి వివరముల్ పడయరెపుడు॥ 25

ఎచట నున్నదో? యాశ్రయం బిచ్చిరెవరో?
ఎట్లు ప్రసవించె? సంతతి యేమి కలిగె?
నున్నదేవిధమున నేమియుఁ దెలియవు సు
ఖమ్ముగా నున్నదన్ వార్త గాలికబురు॥ 26

జానకీ వార్త చేరిన క్షణమునందె
యంత వైరాగ్యవంతుఁడా యయ్యకూడ
నాగఁగాలేక ఋష్యశృంగాశ్రమమ్ము
వెతకుకొని వచ్చి యిచ్చట వీరిఁజూచి 27

కసుకు కుంపటివలెనె బ్రుంగుడు పడియెను;
పాపమతనికి నవ్వార్త వచ్చు వఱకె
నాలుగేండ్లయ్యె నపుడు గగ్గోలుపడిన
నగు నదేమని పోలేద యల్లుఁజూడ॥ 28

శాంతకొమరుఁడు వీడఁడా జనకరాజు
మాటిమాటికి శ్రీరాము మాటయెత్తి
మామరాజ్యమ్ము వార్తలా మామ చెవిని
వేయుచుండును, జనకు నుద్విగ్నుఁజేయు॥ 29

ఒక్కనాఁ డెందుకో వచ్చె నుర్విజాత
యగ్నినింజొచ్చి శుద్ధియైనట్టి మాట
యపుడు జనకుఁడు శాంతాత్ముఁడగ్నివలెనె
మండిపడి యన్నమాట తానిండె జగము! 30

మహిసుతన్ శుద్ధిచేయు సమర్థుఁడెవఁడు?
వహ్నియా? పాపమా సర్వభక్షకుండు
తల్లి యాజ్ఞను బడిసాగు దాసుఁడతఁడు
దేవయజ్ఞావనీజాత దివ్యచరిత! 31

అతఁడు వచ్చినదాదియే యప్పుడపుడు
జానకీవార్త యేదో రాసాగెనటకు

బిడ్డ సుఖమున్నదనుమాట వినుట యెడఁదఁ
జల్లఁబఱుపంగఁ బొంగులును తల్లిఁగనఁగ॥ 32

ఎంత విశ్వాత్ములయ్యుఁ దామేమి సేయఁ
గలరు బ్రహ్మర్షు లాత్మసుఖంబు కందు
రదియు దేశకాలాతిగం బగునుగాన
నేకదేశమ్ము నెఱుఁగ వీలేల యగును? 33

ఎఱుఁగ నెంచినఁ దపము వ్యయింపవలయు
నెంత యుబలాట ముండిన శాంతమతులు
లౌకికములకు లోలుపుల్ గాకయుంద్రు
తప్ప వారికి మనకు వ్యత్యాసమేమి? 34

అట్టు లాఱేండ్లు గడచిన యంతనటకు
సరిగ నాఱేండ్లవయసు వత్సద్వయమ్ము
పెరుగుచున్నారు వాల్మీకి గురుకులమున
నన్నవార్త పూఁదావి నానరుగుదెంచె॥ 35

దాని విన్నట్టి వీరు వత్సద్వయమ్ము
సీత కొడుకులెయని తమ చేతములను
తత్తరంపడఁ బుట్టు పూర్వోత్తరములు
తెలియరావయ్యె నెంత యత్నించికూడ॥ 36

పోయి తేల్చుకోనెంతు రబ్బురము లుడుగ
నుడుగుదురు వారి చదువు ప్రత్యూహమగును
తాము నచ్చటి యునికి యే తగదనుచును;
ఎవరికైనను చదువు భంగింపరాదు॥ 37

అయిదవ యేడాది నక్షరాభ్యాసమై
నంత శిశువులు తామరిగి గురువె
సర్వమైయుండ సంస్కార మందుచునుందు
రమ్మ నాన్నలకయి యుమ్మలింప

రాశ్రమానీకంబు లవి గురుకులములు
కులపతి యొకఁడె తత్కులము నడపు
దశ సహస్రమిత సర్వశిశు సమాజమ్ము
నన్నమ్ము బట్టయు నాశ్రయమ్ము
నిచ్చి శాస్త్రోచితమ్ముగ నెదుగఁజేయు
బ్రహ్మవేత్తయె కులపతిత్వమ్ము వడయు
నతని నణఁకువఁ గొలుచు నధ్యాపకాళి
ఋషులు తీర్తురు తచ్ఛిశుశ్రేణి నెపుడు॥ 38

రాజు కావచ్చు నీరాజు కావచ్చును
బ్రతుకుత్రోవ నతఁడెవండుగాని
ధనముండవచ్చు నిర్ధనియె కావచ్చును
దనయిష్ట మెట్టిదై తనరెనేని
ఒక్కండె కావచ్చు నుండవచ్చును పల్వు
రర్భకు ల్వార లేరైనఁగాని
తరతరమ్ముల విద్య తనయింటఁ దనయందె
యుండవచ్చును లేక యుండవచ్చు
నెపుడు శిశువుల కయిదవ యేడువచ్చె
నపుడె తానయి గురునకు నప్పగించి
శిక్షణానంతరమున నాశీర్వదించి
పంపువలెకెట్టి భ్రాంతి లోఁబడగరాదు॥ 39

శైశవాభ్యస్త విద్యలై సమరసముగఁ
దమకుఁ దమకైన పనుల సక్రమ సుశిక్షఁ
బడసి నట్టిరు బిడ్డలు ప్రజలగుటను
సర్వ సంఘమ్ము శాంతి సౌజన్య యుతము॥ 40

మనుజ జన్మమ్ము వచ్చుటే ఘనమటంచు
నఖిల శాస్త్రమ్ములున్ బల్కు ననవరతము
నందు ఛాందోగ్య మీజన్మమగు విధంబు
స్పష్ట మొనరించు నెంతటి కష్టమగునొ॥ 41

జీర్ణ దేహంబు విడిచి తా జీవి వ్రీహి
నాశ్రయించును నవ్య దేహమ్ముగొఱకు
వర్ష ధారలఁబడి భువి వఱకు వచ్చి
దాని యోగ్యులు తినుట సాధ్యపడవలయు॥ 42

శిశువుతినె దానిఁ గాద యే పశువో తినియె
బ్రహ్మచారి భుజించె విరాగి తినియె
నేమికావలెఁ దిరిగి మిన్నేగి దిగెడు
నాన వెంబడిఁబడి వ్రీహిఁ బట్టవలయు॥ 43

ఇటు ఘటీయంత్రముంబోలె నెక్కి–దిగుచు
నెట్టులో తుట్టతుదకు మేన్వోట్టు వాని
కడుపునంబడి యురక త్యక్తమయిపోక
యాహుతమయి రక్తమయి వీర్యమయి పిదప॥ 44

మాతృగర్భానఁ జేరి యమ్మాత దయను
దాని ధరియింప జన్మమందంగ వలయు
నంత కష్టమ్ము పడుచుఁ దానంది కొన్న
జన్మమున్ వ్యర్థపఱచు విభ్రాంతుఁడెవఁడు? 45

అదియుఁ దావచ్చివచ్చి యీ యవనియందు
నటనెచటో భోగభూముల యందు కాక
కర్మభూమిని భరత భూఖండమందు
నాత్మగుణుఁడైన రాము రాజ్యంబునందు॥ 46

వచ్చుటన్నది పుణ్యసంపదల ఫలము
యీ వివేకంబు శిశులకే యెసఁగు నచట
వారె తలిదండ్రులంగోరి పంచమాబ్ద
మునసె చనెదరు గురుకులమ్ములకుఁ బ్రీతి॥ 47

సక్రమమ్ముగ నడచు నీ జగతికంత
కఖిల శాసకుఁడో పరమాత్మ కలఁడు

వాని భీతినిగాదె దివాకరుండు
ననుదినము నుదయాస్తమయముల నందు॥ 48

వాయువున్ వీచుచుండు నే వగనుగనుక
ఇంద్రుఁడగ్నియు మృత్యువు నేమఱకయ
తమకుఁ దమకైన పనుల సతమ్ము నిల్తు
రీ జగతి సర్వమాత్మ ను త్తేజితమ్ము॥ 49

అంతర్యామిగ నతఁడు ని
యంత యయి స్వనియతకృతులయందు సమస్తం
బింతయు నడపని యెడ జగ
మంతయు జడ మగుచు నెట్టులందుఁ బ్రవృత్తిన్॥ 50

జగతి జడమయి యిట్లు శాసకుని బట్టి
నడచుచుండంగ బహుచేతనముల యందు
మానవేతర జీవు లమ్మహితు దయను
బ్రతుకులన్ బారతంత్ర్యమ్మొ పడసి గడపు॥ 51

పశుపక్ష్యాదిక జీవసంతతి సదా పాపానుభూత్యర్థమే
పశు నాథుండొసఁగంగ జీవుఁడచటన్ స్వాతంత్ర్యమే లేక దు
ర్దశకున్ బాల్పడఁబోక భోగమునఁ బ్రారబ్ధంబు తీఱన్ నియం
త శివుండాపయి నెంచియిచ్చు భవమందంగల్గు నిర్భీతిఁగన్॥ 52

అటులే పుణ్యఫలానుభూతికగు దేవాద్యంబులౌ జన్మముల్
పటువౌ పుణ్యము తీఱినంతటన దివ్యస్థానమున్ వీడి యి
చ్చటకున్ రాక యదెట్లుఁ దప్పదు మనుష్యత్వంబె సర్వోత్తమం
బెటులైనన్ దరియించు మార్గమది యుందే లభ్యమౌ జీవికిన్॥ 53

పాపపుణ్య సమ్మిశ్రమౌ ఫలము పొంటె
మనుజ జన్మమ్మువచ్చు న త్తనువు నందె
జీవి స్వాతంత్ర్యముంబొంది స్వేచ్ఛఁబట్టి
యేదియైనను దాను సాధింపఁగలఁడు॥ 54

మోహితుండయి యఘములఁ మూటకట్టి
మరల పశ్వాది తనువులం బడయవచ్చు
స్వర్గకామియై పుణ్యసంచయ మొనర్చి
దేవయోనుల నెందైనఁ దేలవచ్చు॥ 55

అటునిటును బోక వ్యర్థమీ యటన మనుచుఁ
గిటుకు గ్రహియించి కర్మకేమిటను ఫలము
పుట్టకుండఁగఁ జరియించి పుట్టు వీగి
యందవచ్చును ముక్తి నయ్యాత్మ కరుణ॥ 56

జగతి నుద్భవమగు ప్రతి జాతియందు
నంతరాంతర జాతి ప్రత్యక్షమగును
వృక్షజాతిని గల్గు వైవిధ్యమెంత?
అన్నియుఁ మావులెన్ని యవాంతరములు? 57

రసము, నిమాంపసందు, మధురంబగు బంగినిపల్లి, నీలముఁ
ససీగల జాతులో నితర సారవిహీనము లెన్నిజాతులో
వశమె వచింప నేరికిని వానికి వానికి భేదమెట్లు తాఁ
బాసఁగిన దద్ది పుట్టుకనె పొల్చును గావున నద్దిజాతియా॥ 58

అందఱుఁ మానవులెయ్యైన నందుఁగలవు
వర్ణముల్ నాల్గునవి జాతిఁబట్టి కలుగు
జాతి జాతి నవాంతర జాతులున్నఁ
బలుకుచున్నది శ్రుతి చతుర్వర్ణములను॥ 59

ఎచటఁ బుట్టిన వాఁడు తానచటి ధర్మ
మాత్మ శాసనమొప్పి తా ననుసరింప
సర్వ సంఘమ్ము నిహమున సౌఖ్యమందు
వ్యక్తిగాఁ దానుగను పరమార్థ సుఖము॥ 60

మనువు మొదలుగ నైత్వాకు మనుజపతులు
ఆత్మశాసనరూప వేదాధ్వమందుఁ

దాము నడచుచుఁ దమ పోవు దారిఁబట్టి
స్వస్వ వర్ణానుసారిగా జనులు నడవ॥ 61

పాలనం బాచరించి సర్వక్షితీశ
మార్గదర్శకులై మనుమార్గ వశత
సర్వమానవకోటి నిచ్చలు సుఖంబు
నందగా వారి యర్చల నందికొనిరి॥ 62

రామరాజ్యమ్ము నందలి ప్రజలకెల్లఁ
దత్త్వ మిదియని తెలియుఁ, దత్తత్త్వ నిష్ఠ
కలదు, దమయంతఁ దామె తత్కాల విశిష్ట
ధర్మమున నిల్తు, రన్యోన్యతన్ భజింత్రు॥ 63

ఎంత తెలిసిన దేహంబు లేపుమీఱ
నంతరాత్మను మన్నించి యదుపుఁ గాంతు
రదియుఁ దప్పిన లోకరూపాత్మకుండు
హెచ్చరింపఁగ నాగి పోమెదరు మరలి॥ 64

సిగ్గు నశియించి యెవఁడైనఁ జెదరుగాఁగ
లోక మను కంచె నెగఁబడి దూకునేని
రాజదండంబు వచ్చి నిర్దయము గాఁగ
శిక్ష ఘటియించి మనుధర్మ రక్ష సలుపు॥ 65

అంతరాత్మ యొకండు లోకాత్మ రెండు
అఖిలరక్షార్థ రాజదండాత్మ మూఁడు
మూఁడవది దాటనేరఁ డా పుడమియందు
నదియు దాటిన పైఁ బరమాత్మ కలఁడు॥ 66

జగము క్రియాత్మకంబగును జన్మవహించిన జీవి దేహియై
మిగులు నహంకృతిన్ గ్రియలు మేకొని చేయగ వానికా ఫలం
బగపడి తీఱుఁ దత్ఫలము నందక యుంటకె వేదధర్మ మిా
సుగతి నెఱింగి జీవులటుఁ జొక్కదు రాత్మగ ధర్మనిష్ఠమై॥ 67

స్వేచ్ఛయను మాట కానాటి జీవతతిని
దేహ మోహమ్మునంది దుర్ధీవశానఁ
దప్పి నడచుట కానె కా దెప్పుడాత్మ
వశమునఁ దమ యిచ్ఛఁబడిన వఱలుచుంట॥ 68

తనను దనయందుఁ దానెంత ఘనముగాను
పరుల జోక్యమ్ము నే కొంచెమెఱుఁగ రాక
నిలుపుకొనఁగల్గుఁ దానంత నిగిడె దనుచు
స్వేచ్ఛఁగల నాటి నరుఁడు భావించు నెపుడు॥ 69

నరుఁడు తానొచుఁ దనకు నింకొరుఁడు చెప్ప
వలయు గతి పట్టుటే గొప్ప పతనమనియు
వాఁడు వీఁడునుగాక యవ్వాఁడు నృపుడె
యయినచో నధః పతనమయ్యాదియె యనియు॥ 70

తలఁతురానాటి నరులు, కావలయునేమి
శాసకుండట్టి సద్గుణ జన తతికిని?
అవసరము లేదుగాని లేఁడన్న యంత
దేహ వశులయి యెఱుకపో దిగఁబడుదురు! 71

అట్టి తత్త్వమ్ము తెచ్చె రాజావసరము
ఆత్మ యెట్లుగఁ దా నంతరాత్మయగుచు
వెలికిఁ గనరాక జీవులన్ నిలుపుచుండు
రాజునట్టులె కనరాక ప్రజల నిలుపు॥ 72

అదియునుంగాక మానవు లగుటయందు
సహజమానొక గుణ విశేషంబు కలదు
మనసు పొడసూపు మనుజ జన్మంబునందు
సర్వమున్ యోగ్యరీతి సంస్కార్యమగును॥ 73

ఇతర దేహుల కీ బెగడేమి లేదు
పుట్టి భోగించి క్షీణింప గిట్టుటొకటె

యట్టి జన్మంబులకు లక్ష్యమగుట వలన
నవి యెటుల్ పుట్టె నట్టులే యణఁగుఁ దుదకు॥ 74

మనుజ దేహంబు లక్ష్య మా మాత్ర మగునె?
మనసాకం దున్నదిట నసామాన్యముగను
జన్మముం బొందునది యేది? కర్మమేమి?
మెలఁకువేమిటి? కలయేమి? కలఁతయేమి? 75

గాఢనిద్రను పొందు సుఖంబదేమి?
నిద్రలో నేమి తెలియక నెగడు వాఁడు
మెలఁకువన్ బొందఁ దత్సుఖస్మృతి యదెట్లు?
నిదుర పిదపను మెలఁకువ గదురునెట్లు? 76

గట్టినిద్రయు మృతియు నొక్కగతినుండుఁ
గాన నది దీర్ఘనిద్ర, యాపైని మేలు
కొనుట యున్నదా? లేద? యీ తనువు వీడి
వేఱె తనువందు టట్టిదా? భేదమేమి? 77

గతదిన స్మృతి యట్లు ప్రాగ్జన్మ విషయ
సంస్మృతియుఁ గల్గుచుండుట జరుగుచుండు
దేహమాలను ధరియించు దేహి వేఱు
గాఁగ నున్నచో వానికీగతి యిదేమి? 78

అన్నియున్ బ్రశ్నముల్ కొన్నికొన్ని తెలియుఁ
గొన్ని తెలియవు తెలిసినట్లున్న కొన్ని
మరలఁ దెలియవు వీనిదా మర్మమేమి?
మనసు లేకున్న మనుజత్వ మహిమ లేదు॥ 79

చేతనులయందు మనుజు విశేషమెంచి
దేహధారణ మాత్రమా తెరువుగాక
యన్నిటికిఁ బుట్టుకే మూలమగుటచేతఁ
బుట్టకుండెడి మార్గమ్ము గుట్టు తెలుప॥ 80

ధర్మమార్గమ్ము నిర్మించి దానిఁ దెలిపి
దేహవశులయి యాదారి దిగ విడువక
యంటి పట్టుక యుండెడు నట్లు చూడ
రాజనుంచెను ప్రజలకుఁ బరాత్పరుండు॥ 81

తగిన మతికినెట్లు తోఁచె నట్లనిచరింప
మనుజునకు వీలుకాదు కాదనిన యెడల
మనసు తానుండు నిష్ప్రయోజన మనంగఁ
గాదు మనసుండఁ బట్టియే కల్మషమ్ము 82

తెలిసి కాలుష్యముం ద్రోయు తెలివిగలిగి
తన్నుఁ దా దిద్దుకొను ప్రయత్నమ్ము వలయు
నన్య దేహమ్ములకు లేని యవసరమ్ము
మనుజ తనువున కున్నది మర్మమిదియె॥ 83

కాయమిది కోరుచుండు సంస్కారమెపుడు
పాంచభౌతిక దేహము బాహిరాంగ
మైన మనసన్న దది యంతరంగ మగును
రెండు నెట్లున్న వట్టులే యుండరాదు॥ 84

సంస్కరణ మార్గ మెఱిఁగించు శాస్త్రమున్న
దదియె వేదమ్ము నద్దాని ననుసరించి
యను దినమ్మును బాహ్యాంతరంగములను
పరమమౌ శ్రద్ధ సంస్కరింపంగ వలయు॥ 85

సమ మనంగను బ్రహ్మంబు, సర్గమెల్ల
విషమమైయున్న, దున్న వైవిధ్య మెఱిఁగి
చనుచు నన్యోన్య వైరుధ్యమునకుఁ గాక
సామరస్యమ్మునకుఁ బూన్చి సాగవలయు॥ 86

వైదికంబైన సంఘ వ్యవస్థ యెల్ల
అనుభవంబునఁ దోఁచు చున్నట్టి దాని

నున్న దున్నట్లు గుర్తించి యుర్విజనుల
నుద్ధరించుట లక్ష్యమై యున్న దెపుడు॥ 87

స్వస్వ వర్ణాశ్రమాచార సరణి నడవ
సంస్కృతాత్ములు జీవులు సక్రమముగ
మెట్టుపై మెట్టు నెక్కుచు మేటియైన
సమతఁ గాంతురు మనుజ లక్ష్యమ్మెయద్ది! 88

దేహధారణ లేనిచో దిక్కులేదు
కామమున్ననె తనువు దక్కంగఁగలదు
దానిఁ దీర్పఁగ జగతి నర్థమ్ము ముఖ్య
మద్ది లభియించునుచిత ధర్మాశ్రయమున॥ 89

ధర్మ నిష్ఠను దొరకు నర్థమ్ముతోడఁ
గాయధారణ కగుమాత్ర కామ మొప్పి
బ్రతుకుఁ గడపెడి వాఁడు తత్పరమమైన
మోక్షమందుట జరిగెడి దీక్షవలన॥ 90

ఈశ్వరుండును జీవుండు నీ జగతియు
నెట్లు దిగి వచ్చినారో తామట్లె మరల
నేకమే వాద్వయమ్మయి యెసఁగు పొంటె
నీ విధిన్ వ్యక్త మొనరించె నీశ్వరుండు॥ 91

సాక్షియున్ గర్మసాక్షి శాసకుఁడు మనువు
మూవురుంగూడి పొల్చిన మూర్తియైన
రాము రాజ్యమ్మునందు ధర్మమ్ము లేశ
మాత్రమైనను బెసఁగ సంభవముకాదు॥ 92

అంతరాత్మకుఁ దోడు లోకాత్మగూడ
హెచ్చరించుటచేఁ గాదె యెంతకష్ట
మయ్యు జంకక శిక్ష స్వయముగ నందె
సీతఁ ద్యజియించుటన స్వయం శిక్షగాదె! 93

ధర్మరక్షణకయి యవతారమంది
తనకుఁ దా శిక్షపొంద జంకని మనీషి
ధర్మవిఘటన మెచటఁ బ్రత్యక్షమయినఁ
బాటునం బెట్టు క్షణ విలంబనము లేక॥ 94

ధర్మమూలమ్ము విశ్వ సంస్థానమెపుడు
రక్షణంబన ధర్మ నిర్వహణ మగును
ధర్మరక్షకు రక్షించు ధర్మమెపుడు
నా మహారక్ష రామరాజ్యమున కబ్బె॥ 95

సస్యానుకూల వర్షమ్ము సాగుటఁ జేసి
యక్షయంబయి త్సెస్మె సుభిక్షమయ్యె
స్వస్వకర్మ శ్రద్ధ సంవర్ధితంబౌట
వ్యష్టి సమష్టి సౌభాగ్యమయ్యె
పరమార్థలక్ష్య జీవనమొప్ప జనులౌట
నైహికమ్ము సమృద్ధమై యెసంగె
నంతరారుల గెల్చి నాత్మాభిరాములై
మనుట సంఘమ్మేక తనుతనందెఁ

బూర్ణ పురుషుండు రాముఁడా పూర్యమాణ
విశ్వ సర్వస్వ సంపూర్ణ విభవుఁడగుట
సకల జనులును శ్రీరామ సదృశులయిరి
రామరాజ్యంబు పొందె సర్వప్రశస్తి! 96

కోరి దారిద్ర్యంబు గొను విరక్తులెగాని
వికృతులై తిరుగు భిక్షుకులు లేరు
సంసార సారంబు సర్వజీవ శ్రేయ
మౌట సాహుతియౌట కడలరెవరు
నఖిల విశ్వము నీశ్వరావాస్యమైయుంటఁ
దనదిద్ది యనెడి స్వార్థమ్మె లేదు
ప్రారబ్ధవశత సంప్రాప్తమౌ సుఖదుఃఖ
తతిమూగు నజ్ఞతఁ దగులరెవరు

జగతియున్ జీవితంబు స్వచ్ఛప్రవృత్తిఁ
జిత్తశుద్ధి లభింప నివృత్తినంది
వేదవేద్యు నెఱుంగ లభించు టెఱిఁగి
రామరాజ్యంబు పొందె సర్వప్రశస్తి! 97

చారచక్షుండౌచు నేరికిం గనరాక
    సర్వమ్ము నెఱుఁగుట సాక్షియయ్యె
సర్వాణు సంవేద్య శాసన ప్రభుఁడౌట
    నాంతర ప్రకట నియంతయయ్యె
సంకల్ప సంభవస్థాన వర్తకుఁడౌట
    సకల సంకల్ప కల్పకమె యయ్యె
నిత్యానుభూతమౌ నిరతిశయానంద
    మందించుచుంట సర్వాత్ముఁడయ్యె
వేదవేద్యుండె రాముఁడై వెలసి ప్రభుత
నిఖల జీవహితార్థి నిర్నిద్రుఁడగుచు
నెఱపుచుండుట శాంతి సంభరితమగుచు
రామరాజ్యంబు పొందె సర్వప్రశస్తి! 98

రాజే కారణమౌను కాలమునకున్ బ్రత్యక్ష దైవమ్ముగా
రాజున్నన్ గలికాలమందును గృతప్రాశస్త్యమే తోఁచునాన్
రాజై రాముఁడు త్రేతలోఁ గృతము స్థైర్యంబందుటల్ వింతయే
రాజిల్లెన్ రఘురాము రాజ్యమఖిల ప్రఖ్యాతి నార్జించుచున్॥ 99

అట్లు సాగెడి రాము రాజ్యమ్మునందు
ధర్మనిష్ఠా పరీక్షా విధంబుగాఁగ
జరిగె విపరీత సన్నివేశంబొకండు
కర్మగతి యేరికైన దుర్గ్రహము కాదె! 100

బుజముపై మృతబాలు మోసికొంచును దెచ్చి
    మోసాల నిల్చి యా యాసపడుచు
జాఱు కన్నీళ్ల వర్షంబెల్ల వెలియఁదే
    లుచు నున్న వెలిమబ్బు లోచనములఁ

దనవెంట సకృదురస్తాడనం బొనరించు
చాక్రోశముం జేయు నాలునిలువ
శోకమాకారమ్ము చేకొన్న చందాన
దైన్యానఁ జెన్నెదు తనువుతోడ
నెపుడు ధర్మమ్ము తప్పి చరింపనట్టి
స్వాశ్రమాచార పరుఁడు నధ్యయన శీలుఁ
డయిన బ్రాహ్మణు నొకనిఁ బ్రత్యక్షముగను
గాంచి రామప్రభుండు దిగ్భ్రాంతినొందె॥ 101

తన రాజ్యంబునఁ దల్లిదండ్రుల దురంతంబైన తాపంబునన్
మునుఁగంజేయు నకాల బాల మరణంబున్ గాంచి యారాముఁ డా
ర్తిని బొందెన్ నిలువెల్లఁ బెన్వణఁకు మూరింబో మహాభీతి నం
దెను దత్కారణముం గనుంగొనుటకై ధీశక్తి వెచ్చించుచున్॥ 102

సాదర దృష్టి బ్రాహ్మణుని జాగిలిమ్రొక్కి వచించెనిట్లు స్వా
మీ! దయఁజూడుఁడీ నృపుని మీసుతు జీవితుఁజేయుపాంశె భూ
మీ దయితుండు సర్వవిధ మృత్యురహస్య పటుప్రభేదనం
బాదటఁ జేయు దీక్షితుఁడు హానినెఱింగెను, తప్పదిద్దెడున్॥ 103

బాలుని దేహ ముంచుఁడిట భద్రమొనర్పగఁజేసి దాని నేఁ
గాలుని వీటికైనఁ జని కారణముం గనుగొందు, నోర్వుఁడీ
జాలము, దోషమయ్యె, నలసత్వము లేదిట, జాగయాకతన్
దేలిచి సత్య, మొప్పగు ప్రతిక్రియఁ జేసి కుమారునిచ్చెదన్॥ 104

శోకం బుజ్జనచేసి తాల్మిమెయి నాశుప్రక్రియిన్ నేనుగా
మీ కోర్కెన్ సఫలంబు చేయుటకునై మేలెంచుఁ డన్నంతలో
నాకాశంబున నుండి వెల్వడియె రామా! ధర్మసంరక్షకా!
చీకాకుం బడఁబోకు బ్రాహ్మణసుతున్ జీవింపఁ జేయంగనా॥ 105

ఐకాగ్ర్యాన నధోముఖుండగుచు ధూమాఘ్రాతమై పొల్చి శం
బూకుండన్నరుఁ డొక్కరుండు దివికిన్ బొందిం జనంగోరి దు

ర్ధికుండై తపమాచరించు నది వారింపక మృతప్రాయుండౌ
నీ కుట్టక వెసంజేరు ప్రాణములు నీకే పాపముల్ జెందదుల్ 106

అనుచు స్పష్టంబుగా విననైనయంత
బ్రాహ్మణుండు తేటి బుజముపై బాలుదింపి
నాయనా! రామచంద్ర! కన్నాము వీని
నెన్నొ నోములునోచి యిద్యేక పుత్రు॥ 107

మాకు దక్కంగఁజేసి ముమ్మడిగ బ్రతుకు
వానితోపాటె మావైన మేనులకట!
చూడు మీతల్లి యెంత సంక్షోభమందు
నాలుబిడ్డలు లేక నా యసులు నిలవు! 108

మేను గైకొన్న ధర్మ మీవైనగూడ
నీ యనర్థమ్ముకగ్గె నే హేతువుననొ?
అయిన నేమాయె నిష్కృతి నంబరంబు
పుణ్యావశమునఁ దెలిపె నబ్బురము గదుర! 109

నీకు జయమగుగాక సుస్నిగ్ధ హృదయ!
ధరణిపాలించు నాచంద్ర తారకముగ
నల మనూదితమౌ నీదు నన్వయంబు!
మత్కృతాఖిల తపము రామార్పితమ్ము! 110

అనినక బ్రాహ్మణుఁ డానమచ్చిరుఁడు బ్రహ్మాభిన్నుఁ డారాముఁడా
త్మను దాఁబొందె సుఖంబు దుఃఖమును: భ్రాతక్ లక్ష్మణుక్ బిల్చి బా
లుని దేహంబు సురక్షితంబగుట నిర్లోపంబుగాఁ జూడుమా
యని పంచెక్ మదిలోన బుష్పకము నాహ్వానించెఁ దక్ జేరఁగక్॥

రామత్మోప పురఃప్రదేశమున నమ్రంబైన శీర్షమ్ముతో
వైమానోత్తమ మేగుదెంచి నిలిచెన్ బ్రావృట్ పయోదాకృతిన్
శ్రీమన్మాఘవతాశ్మ నిర్మిత మహాజీమూత సౌధంబొ? శ్రీ
రామస్వామి పరాక్రమార్జిత యశోరాజ్య ప్రతీకంబొనాన్॥ 112

మును దోషాచర సార్వభౌముఁడు కకుప్పాల్ గెల్చుచో దుష్టుఁడై
తన వాఁడన్న విభేదమెంచక యుదక్ స్థానాధిపున్ సోదరున్
జెనకంగాఁ జని బంధుభావమున నర్చింపన్ గృతఘ్నుండయై
తనకుం గావలె నంచుఁ దెచ్చినది యద్దానిన్ రణాంతంబునన్॥ 113

భక్తిన్ భద్ర విభీషణుండు తనకుం స్వాధీనముం జేయ ను
ద్రిక్తుండై తనరాక వేచు భరతున్ దేర్పన్ విలంబంబు లే
కుక్తం బౌనటుచేర్చు వేళకని తానుత్సాహియై వాడి తృ
ప్తోక్తిన్ వీడ్కొన స్వామి! నీ మనసులో నుందున్ భజింతున్ నినున్॥

అని స్వస్వామిని జేరు పుష్పకము తా నల్లంతలో నెంచి నం
తన విచ్చేసిన స్వామి దానికి నితాంతంబైన సద్భక్తి న
ర్చన గావించి సకార్మ్యకుండగుచు ధీరస్వాంతుఁడై చెంది నీ
యనుకంపన్ బొనరింతు దిగ్విచయన వ్యాపార మన్నంతలో॥ 115

అది భూ నాయకుఁ గోసలావని సమస్తాశావకాశంబులన్
వెదకంగాఁ గొనిపోయె స్వామియు వనీవీధుల్ తపోభూములన్
గొదలేకుండఁ బరీక్షగా వెదకె దిక్కుల్ ముందుగాఁ బశ్చిమం
బదియై యుత్తర మంతఁదూర్పును వృథాయయ్యెన్ శ్రమంబంతయున్

తుదకా స్వామి చరించె దక్షిణమునన్ స్థూల ప్రచారంబునన్
విదితం బెంతకుఁగాక సూక్ష్మవిచయ ప్రేక్షన్ బునశ్చారియై
మెదలన్ భూధరకానన ప్రతతి నేమిట్టున్ బ్రపాతంబు నే
పొదరుం బుట్టయు వీడకుండ వెదకన్ భూజంబు నందొక్క చో॥ 117

తలక్రిందై తపమాచరించుచుఁ బొగల్ త్రావన్ ధరాదేశమం
దలఘుస్థూల విశుష్కకాష్ఠములఁ దీవ్రాగ్నుల్ ప్రకోపింప నీ
కెలమిన్ బచ్చివిపేర్చి మింటిదెసఁ దా వీక్షించు వర్చస్వి ను
జ్జ్వల దీక్షాన్వితు నొక్కనింగని నరేశానుం డధోవర్తియై॥ 118

పుడమిం జేరెడులోన నాతబిసి త్రుప్పుల్ దుల్లి నేత్రద్వయం
బెడనున్ ద్వారముగాఁగ సర్వజగతీ ధ్యేయాభ్ర విద్యుత్ప్రభా

మృడ తేజో మహనీయు రామవిభు సంప్రీతిన్ దృషల్ తీఱ నె
క్కుడుగాఁ గ్రోలి హృదంతరాంతమునన్ గుంభించి యున్నంతలో॥

కరుణామూర్తి విమానమున్ భువికి డిగ్గం జేసి యా తాపసిన్
దరియం జేరి విచిత్రమీ తపము, శ్రద్ధన్ జేయుచున్నావు, నీ
గుఱియున్ వర్ణము నిక్కముం దెలుపు నీకున్ మేలగుం గాక యం
చరయన్ మాని నృపాల శేఖరు ముఖాంభోజమ్మునన్ దృష్టియై॥

రాజా! తాపస వృత్తినూని యయథార్థం బేల వాచింతు నే
నీ జన్మంబున శూద్రుఁడన్ వెనుక స్వామీ! విప్రుఁడైయుండి ని
ర్వ్యాజ క్రౌర్యము నూని భీకరత దుర్మానంబులన్ మెక్కుచో
నైజస్వాదు వొకండు తా మడియుచున్ నన్ మేలుకోల్పెన్ దయన్॥

అనాఁ డాతఁ డొకండు నన్ననియె వ్యాధా! క్షుత్రబంధూ! త్వదీ
యానందంబుగ నన్నుఁ దిందువకటా! యైనన్ శుభం బయ్యెడుఁ
మేనందంగల వీవు రామవిభు భూమిన్ శూద్రయోనిన్ దపో
గ్లానిన్ గూరెడు నిన్నుఁ జంపు నతడక్కాలాన నా హేతువై॥ 122

ఏనపు డొక్క బ్రాహ్మణున కేక సుతుండుగఁ బుట్టి నీకునై
ప్రాణము వీడెదన్ జఱుత ప్రాయమునందె నభోవినిర్గత
స్వానము నిన్నుఁ జెప్ప సుమసాయకుఁడౌ రఘురామచంద్రుఁడ
ద్దాన నినున్ వధించి నను దాల్పగఁ జేయునవాసు సంతతిఁ॥ 123

ఓ సామీ! నిను నేనెఱుంగుదు నహో వ్యోమంబు నందుండి న
న్నా సాసన్ గనుచుండి వచ్చునపుడే యన్నొంటిఁ దద్బాలు ప్రా
ణాశఁ వచ్చెడి స్వామి వీవనుచు నీకై వేచియుంటిఁ బ్రభూ!
యే సందేహము లేక మచ్ఛిరము ఖండింపంగదే రాఘవా! 124

నేఁ గావించిన ఘోరమా తపము పండెఁ గోరితిఁ బొందితో
నేగంగా దివి యంతకంటె శుభమయ్యెఁ స్వామి నీ దర్శన
ప్రాగల్భ్యంబున సద్గతిం బడయు దబ్బాలుండు నుజ్జీవితుం
డౌఁగా కింకిట నాతఁడీ తనువుతో నందుఁ మహా శ్రేయముఁ॥ 125

శంబూకుండిటు లాడుచుండ రఘువంశస్వామి నేత్రంబు లం
దంబు ప్లావము స్పష్టమయ్యె, గహనంబౌ కర్మమార్గంబు, త
జ్జం బాలంబు నడంచు త్రోవనృపుఁడై సంబంధ మబ్బంగ నే
కంబౌ దేహముఁబోలు సంఘమునఁ వ్యక్తంబొక్కఁ డన్యమ్ముకై॥

అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయునటు రాజ్యంబందు వైద్యంబు నే
పొంగుల్ గ్రుంగును లేక చేయవలె భూపుండిద్ది శాంతంబుగా
సాంగోపాంగ విశాల రాజ్యమిది రక్ష్యంబేక దేహమ్ముగా॥ 127

అని ఖడ్గం బొఱనుండి తీసి యటుదూయన్ గృత్తమై తచ్ఛిరం
బనల జ్వాలహతంబుగా నయిన దివ్యాంగుండొకం డంబరం
బునఁ దోఁచెన్ రఘురామచంద్ర! యతసీ పుష్పాభ కాంత్యుజ్జ్వల
ఘన దేహా! భవదీయ సత్కరుణ నేఁగాంతున్ మహాపుణ్యమున్॥ 128

నేనిచ్చోఁ దపమాచరించుటకుఁ దండ్రీ! నిన్ను రప్పించి నా
మేనర్పించు టిదొక్క లక్ష్యము మఱిన్ మీరిందె యద్దేవితో
నానాక్రీడలఁ దేలియాడితిరి పుణ్యక్షేత్రమైపెాల్చె న
ద్దానన్ నా తపమిట్టి పండిన దగ స్త్వ స్వామి యిందుండెడిన్॥ 129

ఈ విచ్చోటికి నెట్లు వత్తువని నేనిందే తపంబున్న చోఁ
బూవుం దావియుఁ జేరియున్నటులగున్ భావించు నాతోన నే
నీవా దేవుని జూచి పోఁదగును తండ్రీ! నన్నుఁ బంపింపు మిం
కీవై యేమి యొనర్తువో తెలియ నాకేమౌను లక్ష్మీపతీ! 130

అనుచా దివ్యుఁడు నంతరిక్షముననే యంతర్హితుండంగ నం
దనుకన్ గేవల రాజ్యతంత్రచణ యంత్రప్రక్రియన్ సాగు రా
ముని యాత్మన్ దనతో నభిన్నయగు నా ముగ్ధాంబుజాతాస్య మే
లోఁకని నట్లై నిలువెల్ల వేపథువుతో లోలాత్ముఁడయ్యెన్ గడున్॥

హా సీతా! జగదేక పావన! పరిత్యాగైక పంకోజ్ఝితుం
డై సీతాపతి యానదృష్టమిఁక నాకౌనే యెటంబోయితో

యే సత్త్వంబుల బారి కగ్గమయితో యేమైతివో సుంత యే
నీ సన్న్యాసి యెఱుంగఁడాయెను మనస్సే లేని జాడ్యంబుగాన్॥ 132

నిన్నుం బాసి నిమేషమైన మననే నీవాదు నా ప్రాణ మం
చన్నా నెన్ని సుఖాత్త వేళలనహో! యట్లయ్యు నేనుంటినే
యన్నా! ద్వాదశవర్షముల్ గడచెఁ గాయంబిద్ది వజ్రాభమై
యున్నట్లున్నది నేటికీ యడవి నన్నుబ్బూత లూగించెడిన్॥ 133

అంతటి నిర్దయత్వమున నప్పుడు పంపుచుగూడ నాకెదో
స్వాంతమునందు నీవు సుఖివై యెటనో సదయాంతరంగ భా
స్వంతులు తోడ్పడన్ నిలిచి సాఁకెద వీరఘువంశమన్న కొం
డంతటి యాశయుండినది యయ్యది నేఁడు ప్రబుద్ధమయ్యెడిన్॥ 134

ఎవఁడీ శంబుకుఁ, డెంత భీకరకథా వృత్తంబు విన్పించెఁ, బ్రా
గ్భవమందా బ్రతుకేమి? వాఁడెవఁడు తాఁ బ్రాణాలు కోల్పోవుచున్
శివతన్ హర్తకుఁ గోరినట్టి సుజనశ్రేష్ఠుం, డతండీ జనిన్
భువి నా రాజ్యమునందుఁ బుట్టినను భూపున్ గ్రూరుఁగా జేసెనే! 135

ఈ క్రూరుండిపుడేమొ నిష్ఠురతపోఽగ్నీంధానుఁడై నాకునై
యక్రూరత్వముపొంది నన్నిటకుఁ దానై యార్ద్రవృత్తిన్ బలాత్
ప్రక్రాంతున్ బొనరింప నెంచుటయుఁ జిత్రంబౌ మఱెంబోవుచో
విక్రీతుం బొనరించె నన్నతి సుధా విస్రబ్ధ వాక్యంబులన్॥ 136

ఈరాముం డొకఁడన్య దుర్గ్రహమహో హింసాత్మకుం డీతఁడై
యే రక్షస్సును జంపునో యతఁడె మేలెంచున్ విచిత్రమ్ముగా
క్రూరత్వమ్మున వీనికిన్ మిగులు నా రుద్రుండు? సంసార మం
దీ రక్షస్సున కింకఁబుట్ట గతులున్నే యెంతగా నేడ్చినన్॥ 137

చిత్తగతి స్వభావమది చిత్రము బండనుమించి బండయై
మెత్తని పూవుకంటెఁ గడుమెత్తనయౌ నటువాని కుత్తుకన్
గృత్తమొనర్పఁ గల్గినది కేవలమిప్పుడు నీరు గాఱుచున్
చిత్తరపోవు చున్నయది ప్రేయసి యూహా ప్రబుద్ధమాటచే॥ 138

ఇది మేమున్న ప్రియస్థలంబనుచు నాకే మాత్రముఁ దోఁప లే
దుద పాపాత్ముఁడతండు పెల్లుబికి నన్నోలాడగాఁ జేయు వా
గ్నది యానంతకుఁగాల పూరుషుఁడహో నర్తించి యిచ్చోట మా
ర్గోపదవంజేసె సమస్త మీయడవి మేమున్నట్టిదే కాదనన్॥ 139

అపుడుత్తాల తరుప్రకాండముల నొత్తౌచోట నేఁడొక్క చో
క్కపు మొక్కైనను లేదు పూర్వము బయల్గా నున్నయచ్చోట నేఁ
డపురూపంబుగ నేపుగాఁబెరిగె సాంద్రారణ్య మేఱున్నచో
విపినంబున్ విపినాన నేఱగుచుఁ దబ్బిబ్బున్ బడంజేసెడిన్॥ 140

అదిగో యయ్యదె కొండ గుర్తగుచు నౌనాచోటె యన్పించుచు
న్నది యానన్నక్షణాన నామది నహో నానాకథా మాధురుల్
మెదలున్ బ్రస్రవణాఖ్య మీగిరి శిరోమేఘ ప్రతానమ్ములన్
సుదతింగూడిన నాకుఁ గేళి గిరియై చూపించెఁ జోద్యమ్ములన్॥ 141

నిలువెల్లన్ సెలయేళ్లతోఁ గులుకుచున్ నీరంధ్ర కాంతారయై
చలితానేక మనోజ్ఞ సాధుమృగమై చంచన్మయూరమ్మునై
కలపుంస్కోకిల కూజనస్వన తరంగస్వాదు సంగీతమై
యిలకాదిద్ది యనంగఁ దేల్చినది మమ్మీశైల మానాకమై॥ 142

అదె గోదావరి సాధునీరమము నాప్యాయమ్మునన్ దల్లియై
మృదు వీచీకర మూర్ధ సేచనములన్ బ్రేమన్ వెలారించి ప
య్యెదఁబోల్ సైకత సీమలం దొదుగ హాయింగూర్చి మైపుల్కలన్
బ్రదులం జేసియు సర్వమున్ మఱవఁ దృప్తింగూర్చె మాకెంతయున్
గంగకు నీమెకున్ మదులఁగల్గు మృదుత్వము మాతృభావము
ప్పొంగఁగఁ జేయు నిర్వురును పూర్ణదయా మహితాంతరంగ లు
త్తుంగ తరంగ హస్తములతో భువి క్షుత్తృష లార్చుచున్ బరి
ష్వంగతఁ బాపపంకిలము పాయగఁ జేయుదు రాత్మమూర్తులై! 144
గంగా గంగయటన్న చాలునట భగ్నంబౌ నఘౌఘంబు లు
త్సంగం బందలి సర్వజీవులకు స్వాస్థ్యంబిచ్చు; గోదావరీ

గంగం గూడనటే తలంతురు బుధుల్ గంగా జలంబింత యీ
గంగం గల్పినఁ బొంగులెత్తుటది వేడ్కన్ దెల్పు సౌదర్యముల్॥ 145

ఈ తల్లిన్ బెనుభక్తి మున్కలిడి నాయీమేని పాపంబులన్
ఘాతంబుల్ పొనరించి పంచవటి సాధుక్షేత్రముల్ గొల్చి మ
చ్చేతస్తృప్తిగ నయ్యగస్త్య మునిరాట్ సేవామతిన్నిల్చి త
ద్వ్రాతం బోవెద వీటికియ్య వనివార్యంబుల్ హితాకాంక్షికిన్॥ 146

'స్థీయతా'మని రాముఁ డాత్మీయమైన
పుష్పకంబును బ్రార్థింపఁ బూవునేల
వ్రాలినట్లుగ నదియు నవ్వారిచెంత
రాముదింపిన వినయ సంభ్రాంతుఁడతఁడు॥ 147

విధివత్పూజన మాచరించి నదిలో విశ్వాసమొప్పన్ స్రవత్
సుధలన్ దోగినయట్లు దోగిన మనస్సున్ దేహముల్ స్వచ్ఛమై
మధురోహల్ సుమనస్సులన్ మూసరు భ్రామ్యచ్చంచరీకమ్ములై
విధురంబౌ హృదయమ్ము క్రమ్ముకొనఁగా విస్రబ్ధుఁడై రాముఁడున్॥

అలవాటౌ పథమందు నెమ్మదిగ తానై మున్నువాసించు నా
స్థలముంజూచు కుతూహలంబునఁ జనన్ స్వామీ! యటంచెవ్వరో
పిలువంగా నయి యెవ్వరాయని దిశల్ వీక్షించుచున్నంతలోఁ
దలగంగా నగు ఘోరగండ మిది సీతాసాధ్వి ప్రేమోర్భకున్॥ 149

ప్రియతోఁగూడిన గున్నయేనుఁగు నదే పీడించు మత్తేభమొం
డయయో యిచ్చట రక్షణేకలుగదా హోదైవ" మన్కూయి య
త్యయమై వీనులగాడ-జేయ నభయంబౌనంచు శ్రీరాముఁడా
స్త్రయ దుష్టద్విపఖండ నారభటి శింజన్మౌర్వియై పోవఁగన్॥ 150

అందుగుం జివురుల నందిచ్చి స్వయముగాఁ
జిననాటినుండి పెంచినది దాని
పంచవటీప్రాంత వనవాసులకు నెల్ల
నది సీతకనుఁగని విదిత మెపుడు

కొండకోనలకైన గోదావరికినైన
సీత యేగిన నామె చెంతనుండు
జనకజా స్నానవేళను బూర్ణకుంభోద
కముల నామె కభిషేకమ్ము చేయు

ననుదినమ్మును చుట్టచుట్టిన కరమ్ము
నెత్తి పైకెత్తి యోంకార మొత్తికొనఁగ
లలిత హేలల బృంహితమ్ముల నొనర్చు
నదియె సర్వస్వమయి సీత హాయిగనును॥ 151

ఇప్పుడది పెద్దదయి పాతికేండ్ల దగుచు
నాత్మ కనుకూలమగు ప్రియురాలిఁ బడసి
వన విహారమ్ములను బ్రీతిఁ జనుచునుండ
మదకరీంద్రము నెదురు నాపద జనించె॥ 152

వాసంతీ వనదేవత
యా సందిగ్ధ స్థితిగని యాక్రోశమ్మున్
వేసంత్రాసము దీర్పఁగఁ
జేసెను విని రాముఁడేమి చేయఁడు సుతుకై ? 153

దైవాద్వా యది తన్నుఁ దానుగ స్ఫురద్దంతిన్ బ్రతాడించి నూ
త్నావేశమ్ము వశానుగమ్ముగుట హెచ్చైయుంట రక్షించుకో
నా వేళన్ రఘురాముఁడా యుగము బ్రహ్మానంద మందింప లో
లో వీప్సామయుఁడయ్యె సాజమగు సుశ్లోకుండు నట్లాటయున్॥ 154

తండ్రియైనాఁడు తాను సత్యమది తెలియు
జాయ ప్రసవించు సమయాని కే యభాగ్య
మోయటుల్ పొనర్పవలసె నామె నిఁక స
మస్త మంధకారంబె! క్షేమమ్మొయగున? 155

ఈ యనేకప సుతుఁడు తా నెట్లు పెరిగె
స్వీయ సంతాన మట్లు వర్షీయ వృద్ధి

నందియుండున? ద్వాదశం బయ్యె సమలు!
జానకీదేవి కాల మెచ్చుట నయించె 156

పంచవటి సంచవటి పంచవటి యటన్న
నయిదు మఱ్ఱులు కూడియున్నట్టి చోటు
పరుల కంతియె యతనికిఁ బ్రాణపంచ
కమ్ము కన్న మిన్నగు జీవితమె యదియు॥ 157

పంచప్రాణము లయ్యదే యగుట నిష్ప్రాణుండు నా రాముఁ డా
ప్రాంచత్సీమకు నేగుచోఁ దడబడెన్ బ్రత్యంగుళం బచ్చటన్
బంచారించు నయో ప్రియా విరహభావం బగ్ని కాజ్యంబుగా
సంచారం బిది యేమి సాహస మహో స్వామీ యెటుల్ తాళెదో?

ఇది యిటు లౌనటంచు మునుపే గ్రహియించిన గంగ జానకిన్
ముదమున డాయఁ బిల్చి తనముందుఁ బ్రశాంతతఁ గూరుచుండనో
సుదతి! కుమారకద్వయము చూడఁగ నేఁడరు గంగ మంచిదా
యదనిది వంశదైవతము నర్చన సేయుచు పూర్ణ భక్తితో॥ 159

వరదు ననుగ్రహంబున నె ద్వాదశవత్సర పూర్తి యయ్యెడున్
వరముని యాశ్రమంబు జని వత్సలకున్ బరిపూర్తియైన వ
త్సరముల సంఖ్యకున్ దగఁగ జ్ఞాపకగ్రంధి యుతాంక సూత్రముల్
కరములఁ గట్టిరమ్ము నిను గానగ లేరెవరైన తల్లిరో! 160

తమసను గొంచుఁ బొమ్మటకుఁ దల్లి వసుంధర నీదువెంబడిన్
బ్రమద మెలర్పనుండి పరిరక్షణ సేయు సదా దివాకరున్
విమల సుమమ్ములన్ స్వకరపృక్తములన్ దనియింపఁజేసి గో
త్రమునకు మంగళం బమర రమ్ము శుభంబగు నీకు నన్నిటన్॥ 161

అనుచున్ జాగ్రత లెన్నొ చెప్పి పనుపన్ వ్యామోహిత స్వాంతమై
తనకుం దోడుగ వచ్చు నాతమసతోఁ దన్వంగి మున్యాశ్రమం
బునకుం బోయి కుమార మంగళము సొంపుం బొందఁ గావించి పే
ర్చిన భక్తిన్ సవితృన్ సమర్చితునిగాఁ జేసెన్ శుభాకాంక్షయై॥162

పునరావర్తనవేళ గంగవలనన్ బుణ్యాత్ముఁడౌ రాముఁ డీ
వనికిన్ వచ్చును పూర్వ సంస్మృతి వశస్వాంతంబు నిల్పోప లే
కనిదం పూర్వ దశాహతుం డగును జాయాహస్త సంస్పర్శ య
బ్బనిచో మేల్కొన లేఁడుగానఁ బ్రియయాప్రాంతంబు నందుండ నౌ॥

అని వినియున్న దాట జనకాత్మజ మెల్లగ నా సమీప భూ
మిని విహరింపఁజేయుచు నిమేష నిరీక్షణ చేయుచున్న వే
ళను గడు తృప్తి నాడెడి కలాపి యొకండటఁ గానిపింప సీ
తను గనఁజేసి నా తమస దాన ముదంబగు నన్న బుద్ధిమై॥ 164

ఆ శిఖికాల నొక్క గుఱుతైౖ మహిజాత యిదేమి నెమ్మి? వి
చ్చేసిన యీ ప్రదేశ మిది చేరువ పంచవటీ స్థలాని కౌ
నీ శిఖి నాదు బిడ్డ యగునే తమసా యదె కాలిగుర్తు నా
కోసమె యాడుచున్నదది గుర్తిడె నాఁగ వినష్ట జీవితన్॥ 165

ఓ తమసా! విచిత్రమిది యుర్విగతాఖిల సర్వ జీవులున్
సీతను నన్ను మాతనని చెప్పఁగ సాధ్యము కాని ప్రేమతో
నాతత భక్తిఁ గొల్చు నవురా నరజాతికి మాత్రమేమి చే
టో తను నొక్కఁడై మనసు లొందు ననూహ్యముగాఁగ ద్వైత్యతన్॥

అందఱు నట్టివా రనుట కౌనె యమాయికు లెక్కుడుందు, రే
కొందఱొ బుద్ధిమాలి తమ గొప్పకుఁగాఁ బెఱవారిఁ ద్రిప్పుచున్
జిందులు త్రొక్కుచుండెదరు చేతములన్ గుణమెంచ రెన్నఁడున్
జెందిన మట్టి కౌ గుణ విశిష్టతఁ గాంచరు కర్మవంచితుల్॥ 167

వారింబట్టి వినష్టశీలు రగుచున్ వారింపబో రాని పెన్
ఘోరంబుల్ పొనరించుచున్ బ్రకృతి నే కోల్పోయి దుర్వాంఛలన్
బారమ్మున్ గనరాని దుఃఖములఁ బ్రభ్రష్టాత్ములై క్రూర సం
సార గ్రస్తత జాఱుచుందు రకటా సాధుత్వమే మృగ్యమై॥ 168

ఈ నరజాతి యందె మహిమేశ్వరు లుందురు కోటికొక్క రో
హో నియతాత్ములై తమకు నుర్వికి మేలె తలంచుచుందు రె

ద్దానికి లొంగిపోక నిజధర్మములన్ దృఢనిష్ఠ నూని క
ల్యాణ మనస్కులై మనుచు నందెదరాత్మ హితమ్ము నెప్పుడున్ ॥

ఆ వాల్మీకిని జూచి వచ్చితిమి కాదా దైవ మింకెవ్వరో
సేవాబుద్ధిఁ దదాశ్రమంబున నె వాసింపంగ నేనెంతుఁ గా
నీ వత్సల్ ననుబట్టి యేమగుదురో యిట్లున్న యట్లే పరీ
భావంబున్ దిగమ్రింగుచున్ మనుట తప్పం బోద యీ మన్కికిన్ ॥

అని సీతాసతి కానరానదయి యట్లా వేగమందంగఁ జే
ర్చిన యెగ్గెత్తి దురంత తాపమున నుర్వీజాని మూర్ఛిల్లె నీ
వనిలో నెవ్వరు దిక్కు? రాఘవుని తాపంబార్పఁగాఁ జాలు నే
మునియుం దోఁపఁడు, వచ్చిచూచి దయ నోముండన్న యాక్రోశమై॥

ఆ గొంతున్ విని సీత యీగళ మహో యత్యంతమున్ విన్నదా
కాఁగా రాఘవుఁ డెవ్వ, రాతఁ డిటు రాఁగా నేమి కార్యంబు, నే
నేగంగా నగునా? యటంచు మదిలో నిట్టట్టు లూగాడుచో
వేగం బొప్ప మయూర మా దెసకుఁబో వెన్వెంటఁ దానేగుచున్ ॥

తమసం జూచి చెలీ మయూరమిది యార్తస్వాన మే తెంచు మా
ర్గమునం బోయెడు, నా గళంబది వినంగా నాకు వాసంతి కం
ఠమునాఁ దోఁచు నిజమ్ముగా నిటకు తేఁడై వచ్చె నా రాఘవుం
డమితాందోళన మందుచున్న దెదయే మానోయటం చార్తిమై॥ 173

ఏమైనన్ సరిపోయి చూచెదము రావే యంచుఁ గేకాస్వనం
బామై చేయుచుఁ బోవుచున్న నెమలిన్ వ్యాసక్తులై కాంచుచున్
రామశ్యామల ముగ్ధమోహన మహారణ్యాధ్వమం దాసతుల్
క్షేమానన్ జని కాంచి రెట్టెదుట నా శ్రీరాము భూమ్యాశ్రయున్ ॥

భూ శయ్యాగతు రాముఁ గాంచుచునె యా భూపుత్త్రి బాష్పాంబుధా
రా సంస్రావము దేహ సారమటు లార్పన్ పోలె నన్నట్లు గా
తేశం బోర్వగ లేక సొమ్మసిలఁ దల్లీ! తల్లి! నీ విట్టులై
గాసిం బొందగ వచ్చితో కనుమహో కల్యాణ రాముండటన్ ॥ 175

నేలన్ వ్రాలి శరీర సంస్మృతిని సుంతేఁ గాంచఁగా లేక త్వ
ల్లీలల్ తోఁచు నెడంద సొమ్మసిలియెన్ లీలాకర స్పర్శచే
మేలందున్ వెసనేగి నీ ప్రియుని నెమ్మేనున్ స్పృశింపందగున్
తేలెమ్మంచును దేర్పనా తమస, యోలి న్నేత్రముల్ విప్పుచున్॥

సీతాదేవి యెడందలో మొదలు నా సిగ్గున్ భయం బాత్రమున్
బ్రీత స్వాంతతఁ జూచి దేనికిఁకఁ దన్వీ జాగు? చూడంగ లే
రో తల్లీ నిను గంగ సత్కృప వరంబుండెన్ ప్రబోధింపు మా
సీతా ప్రాణు నధశ్శయానుని మృదు స్నిగ్ధా త్మసంస్పర్శచే॥ 177

తమసావచ నోత్తేజిత
విమలాత్మ ధరాత్మజాత వేసిన యడుగుల్
సుమనోహర సుమనస్సుల
శ్రమాపహరణ రుచిర నవ సౌరభ మెగయన్॥ 178

ఏమీ సౌరభమెంత దివ్యమయి హాయింగూర్చు భూజాత యిం
దేమో వచ్చిన చందమయ్యెనని యూహింపఁగ వాసంతి తా
నామెం గాంచగ లేక రాముదెస చూపై నిల్చి యున్నంతలో
క్షేమం బారయు నెచ్చిలిం బలెనె నిల్చెన్ గేకి పార్శ్వంబునన్॥

అది యెపు డేగెనో యచటికట్టు లవన్ని మృణాళ నాళముల్
మృదుల సుగంధి పద్మములు మెత్తని యొత్తుల తామరాకులున్
గుదులుగ నెట్లు తెచ్చినదో కోరి సమస్తము రాము ఱొమ్ముపై
సదయతఁ గప్పి పైపయిని చల్లి యుశీరము ఱెక్కవీచుచో॥ 180

జానకి యేగి ధైర్యమునఁ జూచి వణంకుచున్న బాహువున్
ప్రాణ మధూత్కరన్మసృణ రాగకుశేశయ నాళమో యనం
గా నొకయించుకేని స్మృతి గానని రాముని విప్పు ఱొమ్ముపై
నూని నిలంబడన్ క్షణము నూర్పది తోఁచిన దంతస్వామికిన్॥

తోఁచిన తోనె హస్తములతోఁ దన ఱొమ్మును దాచుకొన్నకా
ణాచిని గన్ను విప్పకయ యాచికొనం బ్రయతించు నంతలో

నేచి భయమ్ము తాఁగరము నిట్టి నికుంచన మాచరించి హృ
ల్లోచన సారసర్వ మదిలోఁడినదో యన సీత నిల్వఁగన్॥ 182

ముల్లోకమ్ములు మేలుకొన్న యటు రాముడంత నేత్రమ్ములు
త్ఫుల్లాంభోజము లట్లు విప్పి యెదపై పుష్పంబులున్ బత్రముల్
డొల్లన్ జెంతను నిల్చియున్న నెమలిన్ లోలమ్ము లౌ కన్నులన్
మెల్లన్ జూచి కరాన దానిగొని నెమ్మిన్ నెమ్మిలాలించున్ 183

నాపై నింతటి ప్రేమ చూపినదికన్నా నీవ? నా కోసమై
యీ పాట్లన్నియుఁబడ్డ నీ యెడల నే నెట్లున్ ఋణగ్రస్తుఁడన్
గా పై యుంటివి పక్షిజాతి వగుచున్ గన్నాకుగాఁగాచి నా
వే పుంబొందుము తండ్రి! తండ్రియనఁ దానే యాజటాయుంబలెన్॥

నిన్నుం దక్కువచేయు టున్నడునుగానే కాదు నా తండ్రి! నేఁ
గన్నుల్ విప్పక యున్నవేళ నెవరోగానీ ననున్ ముట్టినా
రెన్నన్ స్పష్టముగాఁగఁదోచినది యిట్లే లేచి చూడంగ నీ
వున్నా విచ్చట నెవ్వరింగనక నే నున్నాను మోహాంధుఁడై॥ 185

నా కా స్పర్శఘటిల్లు తత్క్షణముకన్నా! యేమి వాక్రుత్తు నీ
వా కారమ్ముగఁ గాంచఁజాల వయితో యయ్యో మహాంధ్యమ్మొయా
సోఁ కన్నన్ మఱి సోఁకుగాదది సుధాస్రోతస్సులే నామెయిన్
బ్రాకన్ జేసెను, మంచి గంధమలఁదెన్, బ్రాణమ్ములే పోసెఁబో॥

ఆ తాఁకున్ మునుపే నెఱుంగుదును బిడ్డా! యద్ది మీ తల్లి యా
సీతాదేవిది యామె యిచ్చటికి వచ్చె న్నాఁగ భావించితిన్
జేతిన్ జేతనుబట్ట యత్నపడితిన్ సిగ్గయ్యె లభ్యంబు కా
కీ తుచ్ఛుఙ్ గరుణించి యామె కను నే యెన్నాళ్ళకై నఙ్గటా!॥ 187

హా సీతా! యెటనుంటివే కనవె నీ కౌరాము నిన్వీడి ప్రా
ణాశఙ్ వీడి చరించు రాముఁడొక ఛాయావ్యక్తి మాత్రంబ యీ
వేసంబుఙ్గని వీఁడు జీవుఁడనియే వెట్టుల్ తలంపఙ్ సునా
యాసంబై కొనసాగుచున్నదట రాజ్యంబయ్యొ నిర్జీవుఁడే!॥ 188

కరముం దాఁకఁగఁ జేసి కట్టియుకు వీఁకన్ బ్రాణములోర్వసి దు
ర్భరమా తాపము నందఁ జేసెదవు తోఁపన్ రాక నే నెంత దు
శ్చరితుండ్నైనను నిట్టి శిక్ష తగదే సాధ్వీ దయం జూడవే
కరమా యయ్యది కాదు కాదు జగతీ కల్యాణ మాకారమా॥ 189

కానన్ రాదిట సీత తాఁకినటు నాకై యెట్టు లన్పించె? స్వ
ప్నానన్ గంటిన? నిద్రలేని యెడ స్వప్నం బెట్టులా? సీత న
ట్లానం జేసి త్యజించునాటి మొదలీ వ్యక్తిన్ బరామర్శగా
నైనం జేరగ లేదు నిద్ర యిది నాకై నేను కల్పించితో? 190

అంతే యానని యుత్థితుండగుచుఁ దోడై నెమ్మిరా నేగుచో
స్వాంతంబంతయుం రామసంభరితమై సంత్యాగ దుఃఖంబు ని
ష్క్రాంతంబైన యెడంద తేఱి తమసా సాహాయ్య మొప్పన్ పునః
కాంతున్ వీడక సీత వెంటఁ జనుచోఁ గన్పించె వాసంతియున్॥ 191

తన నెచ్చెలి వనదేవత
కనిపించిన సీత కపుడొకానొక తృప్తిన్
గనినట్టు లయ్యె రాముని
కనుకూలమ్మయిన తోడె యమరిన దనుచున్॥ 192

వాసంతియు నా రాముని
హాసమ్మునఁ జూచి యో మహారాజా! మీ
శాసనము సాగుచున్నద
వాసింతురుగాదె జనులు వైభవములతో॥ 193

అనినన్ రాముఁడు జానకీ త్యజన వృత్తాంతంబు సర్వమ్ము నం
దెను కాంబోలు దయావిదూరముగ యద్దేవాగ మాట్లాడు నీ
మెను రంజింపఁగఁ జేయు టెట్లనుచు నెమ్మిన్ గుందుచుండంగ వ
చ్చెను సీతార్భకుఁడైన యేనుఁగటకున్ జెంతన్ బ్రియున్ దాఁకుచున్॥

వారపు డున్నచోటు వనవాసులు జానకి రేవునాఁగ ము
ద్దారగఁ బిల్చుచోటగుట దానఁ బ్రియార్భకుఁ గాంచినంత నే

శ్రీ రఘురాము చిత్తమున సీత వివర్ధనమందె నంతలో
వారిని జొచ్చి యా కరు లవారిగ నీరము లాడుచున్న చో॥ 195

చూచుచునుండె రాముఁ డటుచూచి మయూరము గంతువైచి పై
లేచి తటాలునం జని సలీలగ జానకి యేన్గు వెన్ను పైఁ
దోఁచిన ముచ్చటై మనసు దోచగ రాముఁడు సంచలించుచున్
జూచి ప్రియాసఖున్ మిన్నుల చొక్కు ఘటించెడు వీని స్నేహముల్॥

జానకి వీని రెంటినొక జట్టునఁ జేర్చి కుమార యుగ్మమో
నా నెనరూని పెంచినది నాఁడొక చోటున నైన పెంపకం
జే ననుపింత పెంచె నివియెట్లు శరీరము లెక్కరాని మాఁ
ర్గానఁ జరింపఁగాఁ గలుగుఁ గాయము లెప్పుడు మిథ్యకానిచో॥

తల్లి యొకండు కావుననె తత్తను భేదము తోఁపకుండెనో
తల్లులు భిన్నజాతులిట తన్వియుఁ బెంపుడు తల్లి మాత్రమాఁ
దల్లియుఁ గన్నతల్లియయి తా మొక జాతికిఁ జెందియున్నచో
నుల్లము లెంతగా నెనరు నూనవలెన్ నవనీత దుగ్ధముల్॥ 198

జాతియె వట్టిమాట నలుజాతులు తాత్త్వికదృష్టి చూచుచో
భూతలమందు నన్నియును బుట్టెడి దెచ్చట? వేఱువేఱుగా
మాతలు తోఁచుచుండినను మాత క్షమాసతి యొక్కఁడే గదా
సీతకు నా క్షమా సతికిఁ జెందునె భేదము? లామె తల్లియా! 199

ఓ జగదేకమాత! దయయుంపుము నా యెడ నేను రాముఁడన్
రాజను పాత్రధారినయి రాజు ప్రజాపరిపాల నమ్ములో
భూజనులందు ధర్మమున బుద్ధి తలంగక యుండఁ జేయుచో
నే జనుఁడైన గాని తనకిట్టి దొసం గనరాదు గావునన్॥ 200

సాజము ప్రేమయుండియును సాగునుడిన్ బెను మోజు వీని కో
నోజ విజృంభితంబగుట యెప్పుడు కాకని పట్టుపట్టి యా
వ్యాజము నూని వీడితిని వాఁడు ధరా పరిపాలకుండ హా
నైజమునన్ జగజ్జనని నాకును నీకును భేదమున్నదే?॥ 201

నీవును రాణివౌటఁదగు నీతిని బూని మదీయకార్యముల్
భావమునందు హేయముగ భావనసేయక మేనుదాల్చి యు
న్నావు నను స్పృశించితివి నాకుఁ గనంబడ వేమి దోసమౌ
దేవి! దయాస్వరూపిణివి తేల్పుము నన్ను సుఖాబ్ధి నింకిటన్॥ 202

తమసా సీత లదృశ్యలై విభునిజాత్మన్ విన్నవా రట్టిచోఁ
దమలోఁదాముగ రామతత్త్వ వివృతిన్ ధన్యాత్మతం జెంద మో
దమునన్ దేలిన సీత బైటపడ డెందానన్ దలంపూనె దు
ర్దమమౌ గంగ వచస్సు తప్పదని యోర్వంజాలెఁ దత్త్రీవ్రతన్॥ 203

వాసంతియు నా రాముని
దోసంబును దూయఁబట్టు తోరపుటూహన్
మోసంబని మానుకొని యె
గాసింబడు రామచంద్రుఁ గాంచుచు భక్తిన్॥ 204

రామా! యూరకనాటి సంస్మృతులతో రాపున్ వహింతేల? యీ
క్షేమాతంక నిజప్రియా విరహ సంస్మృత్యగ్ని సంవర్ధక
క్ష్మా మెల్లన్ విడనాడి పోదమటు రమ్మాయంచుఁ గొంపోవలో
లో మన్నించెను నెచ్చెలిన్ మహిజ మెల్పున్ జూపి రక్షించుటన్॥ 205

కానీ త్రోవఁగదంబ వాటి యొకఁడక్కానన్ గనన్వచ్చు న
ద్దానిన్ దాటునెడన్ బ్రియాసహితుఁడై తానందు నింపొందు సం
ద్రానన్ దేలినదెల్లఁ బెల్లుబికి డెందంబుత్తలంబందఁగా
నేనింకన్ మనఁజాలనే జనకజా! యెట్లైనఁ గన్పింపవే! 206

ఈతనువెత్తుటేల? దనుజేశ్వరుఁ జంపితి నిన్నుఁ దెచ్చితిన్
జేతకుఁ జేత యయ్యోనని పొందితి మోదము, కాని వాఁడు ని
ర్ఘాతము వంటి యీనుడికిఁ గారణమౌ పనిచేసి చచ్చె మ
చ్చేతము సర్వమైన సతిఁ జెందగ నీని మహాపకారమున్॥ 207

దైవంబున్ మటు మాపలేని బెడదై దగ్ధంబుగాఁ జేయు మ
ద్భావంబున్; నిను గొంచుఁబోవ నొకడై తద్దుఃఖ మత్యల్పమౌ

దావాగ్నిన్ బడఁజేసినందుకుఁ బునర్ధార్యంబు దేహంబగున్
దైవంబెంత ఘటించె నీ జని కహా! తత్త్వప్రకాశాత్మకుఁ॥ 208

హా సీతా! కనిపింపవే తిరిగి నన్నంటంగదే మెత్తనై
శ్వాసోజ్జీవకమై సుగంధభరితంబై సర్వకల్యాణమై
త్రాసచ్ఛేదకమై మదీయ సుగుణ ప్రస్తార పుణ్యాధ్వమై
న్యాసంబౌ భవదీయ కోమల కరన్యాసమ్ము గావింపవే! 209

అనుచున్ రాముఁడు కుప్పకూలి నట్లై హాహారవంబుగ్గి నే
లను నిశ్వాసము కూడ లేనటుల వ్రాలన్ జూచి వాసంతి యే
మనముం జాలక ఱాతిబొమ్మ యగుచో నత్యంత మావేశమై
చని సీతాసతి పెందడం బడి కరస్పర్శన్ వెసం జేయుచున్॥ 210

దడదడలాడు డెందమది తల్లడిలన్ మఱియున్మఱిం గరం
బెడనెడఁ దాఁకఁజేయుచు నహీన సుదుస్సహ వేదనంబడఁ
దొడితొడి నూర్పు కొంచెముగఁ దోఁచినఁదో యను నాశ విస్మృతిం
బడి గనుచుండ రామ కరబద్ధతఁ దత్కరమట్లై యుండగఁ॥ 211

తేఱుచునున్న రాముఁడటు తేఱని సీత కరమ్ము పట్టియుఁ
దేఱక విస్మృతి స్మృతి యిదేయను చిత్రదశఁ సతీపతుల్
తీఱిక నెంత సేపటులు తీయని తీయని భావలోక సం
చార మొనర్చిరో తెలియఁజాలను; సాగిన దొక్క లిప్తయా॥ 212

వెలుపలికేమొ లిప్త యను విశ్రుతమౌ మదికేమొ తోఁచుటల్
తోలఁగుట లెంతమాత్రమును దోఁపని నిశ్చల కాలమై చనఁ;
దెలిసిన దాత్మయే పగిది దేశము కాలము దాటి నిష్క్రియం
బలల నెఱుంగనట్టి సలిలాలయ మౌనను తత్త్వమంతయుఁ॥ 213

ఆ తత్త్వంబున నద్ది యెన్నడటులేమై యుండుచుఁ దద్ బహి
ర్వ్యాతంబౌ నొక చిత్కళఁ జగముగానై తోఁచు నా ద్వంద్వమ
ట్లో తప్రోత చిదాత్మలయ్యు నొకరయ్యుఁ రెండుగాఁ దోఁపకే
భూతాత్మ ప్రతిభాసి లోకమువ సంభూతిఁ గనంజాలమిఁ॥ 214

సీతారామత సందియుండఁ బ్రకృతింజెందన్ గరంబేమొ ప్ర
స్ఫీతాత్ముండగు రామహస్తమునఁ దృప్తింగూరి యున్నట్లుగా
సీతాదేవి యొఱింగి నెమ్మదిగ రాశింజాఱు ప్రీహిం బలెన్
స్రోతస్సుందర బిందు వొక్కఁడనఁగా సోమస్రుతిన్ దీయఁగన్॥ 215

వాసంతి మేలు కని యటు
లాసాసను రాముఁ గాంచి యాశ్వాసముతో
శ్వాసమునకు సౌగంధ్యము
మోసులు వారంగఁ దగుల మోహిత మతియై॥ 216

ఏ చాయంగన సీతఁ గానక మనంబేఁకారి ప్రీతాత్మయై
వాచో నిస్స్వన మొప్ప మేలుకొలుపన్ స్వాపంబు నందుండి తా
లే చెన్నా నుపవిష్టుఁడై దెసల నుల్లేఖంబుగాఁజూచి పె
ల్లేచుం దాని గుబుల్కొనంగ నగుచున్ లేలిహ్యమానాత్ముఁడై॥

ఎందుం బోయెద వింతిరో హృదయమందే యుందు వాకాశమం
దెందు న్నీవయి యుందు వా గగన వాల్వ్యంథానకం భూము లిం
పొందన్ నీవగు దట్టులయ్యు వపు వుష్పాంగన్ గనంజాల కీ
డెందంబందెడి కొందలం బడపవే డీల్వోవు నీరాముఁడున్॥ 218

సోమశిలా తనూ! జలజ సూన సహస్ర మనోజ్ఞ వల్లి! నే
త్రామృత సాగరా! నిభృతరాగ గళస్వన! చంచరీక మా
లా మసృణా సితాబ్ధి తరళాయిత నీలసరోజ! భూజ గో
త్రామర మంగళా! ప్రతిపదాన్వయ సారణ సర్వ సంస్మృతీ! 219

రామస్వామి ముఖోద్గి రన్మృదురవ స్రావశ్రవో రంధ్ర యా
భూమీజాత తదాత్మయై వినుచు నంభోజాక్షుఁడై నాఁడనన్
క్షేమం బందెనొ లేదొ స్వామి నెటులీ చిత్తస్థితిన్ మాన్పి వి
శ్రామం బందఁగఁ జేయఁగా నగునొ వాసంతీ మనంబజ్ఞయై॥ 220

ఉన్నచో నచ్చోటి కుచ్చైస్స్వర శ్రావ్య
వేదమంత్రాకార విదిత ముఖులు
ఫాలస్థలీ పూర్ణ భస్మాంక మధ్యస్థ
విస్ఫురత్కుంకుమా విష్ట శివులు

స్వస్వరూప జ్ఞాన సంభావనా మేయ
తేజః ప్రసారి సుదీర్ఘ తనులు
యజ్ఞోపవీత విన్యాస సుందర వక్ష
ఉరగభూషణ భావయుత మహితులు

కక్షనిక్షిప్త కృష్ణాజినాక్ష జయులు
హస్త విన్యస్త జపమాలి కాప్తయశులు
ధర్మవిగ్రహులైన తత్త్వజ్ఞవరులు
ఋషులు నల్వురు వచ్చి సంతృప్తి నిలువ॥ 221

దిగ్గన లేచి రాముఁడును దృష్టి నిరీక్షిత పాదపద్ముఁడై
యొగ్గిన యంజలి న్నిలువ నోయి రఘూత్తమ! నిన్నుఁ దేరఁగా
నగ్గననానిలాచ్ఛ యశుఁడా మహనీయుఁడగస్త్యుఁ డంపె మే
లొగ్గెడు రమ్ము రమ్మటకు నూర్జితులై నినువేచి యుందురున్॥ 222

రాముని గుండెలో ముసురు రాగముఁ ద్రోసి పునఃప్రబుద్ధతన్
స్వామిగ నిల్పఁజేయుటకు సాయము చేయఁదలంచి తానుగా
నా మహనీయులన్ బనిచె నంతటితో రఘురాము నాత్మలో
క్షేమముగాఁగ సీత నిలిచెన్ వెలిదోఁపని దివ్యశక్తియై॥ 223

చిత్తము తేటి వహానులును సేవలు రక్షణ రాజ్యపాలనం
బుత్తముఁ జూచుఁ దానొరుల కుత్తమ మార్గము నొజ్జబంతిగా
జిత్తములందు హత్తుటకుఁ జేయు ప్రయత్నము సర్వమొప్పి రా
జోత్తముఁడైన రాఘవుఁ డహో వినయంబున వారి వెంబడిన్॥ 224

సాగిన వాసంతియుఁ దా
నేగె రఘూత్తముని వెంట నేగుచుఁ దనలో
దాగిన సత్యమ్మిది యో
సేగిని రఘురాముఁ గాచె సీతయు కలదున్॥ 225

కలదిచ్చటఁ గనిపింపదు
తెలియక తానుండి రాముఁ దేర్చెనొ యేమో

జలజాక్షు నేత్రుఁ డయ్యును
మెలఁగును మానవుఁడు గాఁగ మేలగు ననుచున్॥ 226

స్వామి యగస్త్యుఁడీ ఋషులఁ బంపెనుగాక తనంత రాముఁడీ
ప్రేమ మహార్ణవంబు చెలరేగిన తట్టి కొనంగఁ గల్గునే
కాముని జేతయా శివుఁడు కానియెడన్ దనలోన రాముఁడై
యే ముని యేమి చేయునది యెల్ల నెఱింగెడువాఁడు తానయా॥ 227

రాముఁడు స్వస్థుఁడై మునులు రాగ సభక్తికుఁడౌచు నేగఁగా
దామిఁక నేగవచ్చునని తాఁ దమసాసతి సీతతోన నెన్,
గామిత సర్వకామదుఁ డగస్త్యుఁడు రక్షకుఁడౌ నటంచుఁ దా
నాముని నెంచుచున్ జనియె నప్పుడు సీత రసాతలానికిన్॥ 228

పోవుచు రాముఁ డాత్మఁ దన పూర్వ పరిస్థితి నెంచి స్పర్శసం
భావన చేసెఁ బార్శ్వమున వచ్చు ప్రియాసఖిఁ గాంచి తల్లిరో
నీవు దయామతిన్ ననువనీస్థలి నొంటరి కాకయుండ నా
దేవినిబట్టి రక్షయగు తీరున నుంటి కృతజ్ఞతాంజలుల్॥ 229

సమయమునన్ స్మరించి నను స్వామి యగస్త్యుఁడు స్వాస్థ్యమందు బో
ధము గనఁజేసె నొక్కముడి తానయి పీడక యున్నదింతకున్
సమతను బొంది యుంట నిఁకఁ జాన పరిస్థితి యేమియైన నా
కమరదు హాని కాని యిటకైనను సీతయు వచ్చి యుండెనే? 230

కరమున నన్ను తాకి నటుగా ననిపించెను రెండుమార్లు నం
దరి దిగఁ జేతికంది నదియై యొకమాఱు మఱంతలోనె ని
స్సరణము నందెఁ జెంత మహిజాగత పార్థివ సర్వగంధ వి
స్ఫురణము స్పష్టమై పొలిచెఁ జూడ సమర్థుఁడఁ గాక పోయితిన్॥ 231

నా వెనువెంట నుంటెగద నా యనుభూతి నటుంచి నాకునై
కేవల దేవతాకృతిని కీడని యెంచక యున్న సత్యమున్
దేవి నిజస్థితిన్ దెలుపు దేవతవై కనరాక యుండు టె
ల్లౌ? వివరించి నా బ్రదుకునం దమృతమ్ములు నింపు మమ్మరో! 232

రాముం డిట్లన నామె దివ్యతనువై ప్రాణప్రియల్ దాను నే
త్రామోదంబుగఁ జూడఁ జాలమి నిజం బౌదర్ బ్రమాదంబె యా
నేమో యంచనుకొంచు నాత్రపడు చెంతే ప్రీతి నా స్వామి నె
మ్మోముం జూచుచు స్వస్థచిత్తయయి తెంపుంచేసి శాంతమ్ముగన్॥

వింటె జనప్రవాదమున వీడితి వీవు మహీజ నంచు నీ
కంటెను క్రూరుఁ డింకొకఁడు కానఁగ రాఁడని కోపమందితిన్
వెంటనె గంగ యొడ్డుబడి వీడెఁడినై జగదేక పావనిన్
బంట వలంతి కూఁతుఁగ నవచ్చు నటంచును సంచరించితిన్॥ 234

కానఁగ లేక యామెకయి కానల గుమ్మరి విహ్వలించి యెం
దైన నెటైన నామె నుడి యందునొ యంచుఁ జరించు నంతలో
వీనుల విందుగా నొకఁడు వింటెని సీతకు సేగిలేదు గం
గా నది యామెఁ గాచినది కానుపు తేలికయయ్యెనంచునన్॥ 235

ఆ తరువాత నామె నుడి యందనె లేదు గతించెఁ గాలమున్
సీతకు సేగి లేదనుటఁ జిత్తము శాంతతనందె రాజనై
బ్రాఁతిగ ధర్మరక్షణ పరత్వము పొందె విమానచారినై
యా తబిసుల్ వసించు వనికిట్లరుదెంచుట వించు నాత్మలో॥ 236

నిన్నెటులైనఁ జూచి దయనీయనటుల్ పెనుమాయ ముంచి నా
కన్నుల వత్తి! ప్రాణకలికా! గృహలక్ష్మి! యటంచుఁ బల్కి యా
క్రొన్ననవంటి కోమలిని గ్రూరముగా విడనాడితంచు నీ
నిన్నుఁ గఠోర వాక్యముల నిందితుఁ జేయఁదలంచి వచ్చితిన్॥ 237

వచ్చి ప్రియా వియోగ దవ వహ్నిని గ్రుగ్గెడి నిన్నుఁ జూచి నా
వచ్చిన చిత్తమెల్లఁ బరివర్తన మందఁగ జాలినొంది నీ
కిచ్చుట నెట్టి హానియును నేర్పడరాదని వెంట నుండితిన్
పొచ్చెము నందువేళలను బుట్టెడు దుఃఖము నంది యుండితిన్॥ 238

నాకును నీకుఁబోలెఁ గరుణామయి సీత తనంత వచ్చి బల్
కాకను జెంది నిన్ను మిహికామయ కోమల చారుహస్త హే

వాక మహత్త్వముఁ బఱపి వర్ధిలఁజేసె నటంచుఁ దోఁచు నం
తే కనఁజాలనైతి వనదేవత నయ్యును జానకీపతీ! 239

మహీజ చరించుచో నగు సుమవ్రజ సౌరభ గంధవాహ ని
ర్వహణము స్పష్టమై పొలిచె రాముఁడ నీవయి స్పర్శసౌఖ్యము
ద్వహనము నాటినుండి నినుఁ బాయని దందితి నీవెసాక్షివై
పిహిత మెఱుంగఁగా నగును విహ్వలతన్ గనఁబోకు రాఘవా! 240

అని వాసంతి నిజానుభూతి తెలుపన్ వ్యామిశ్ర భావంబులన్
జనెనా రాము డఁగస్త్యుఁ జూడ మునిరాట్ సంఘంబు ముందేగుచుం
డను వారింబడి; రాము వీడ్కొనియె వెంటన్ దాను వాసంతియున్
ఘనుఁడా వింధ్యగిరి ప్రకంపనుఁడె దిక్కై నిల్చునన్ ధైర్యమై! 241

## ఖండాంత పద్యములు

స్వామి యిది ప్రతిష్ఠా ఖండమా మహీపుఁ
డెంత నిష్ఠా గరిష్ఠుఁడై యేపుఁ గాంచె
రామ రాజ్యమ్ము ధర్మ సామ్రాజ్యమన్న
పేరు తానెట్లు వచ్చెనో విశదపఱచు॥ 242

బిందు వొకండె పేర్చి బహుబిందుత రేఖలు కోణవృత్తముల్
సందులు సంఖ్యలున్ విపుల సంఖ్య కురూప సురూప సంతతుల్
పొందెడు రీతి నీవయయి పొల్చెదు సర్వము బిందులింగ! ని
ర్బిందుక నాద చిద్గగన వేద్య! పరిస్ఫురదాత్మ తత్త్వకా! 243

వసంత తిలకము:

శ్రీ కాళహస్తి పురసిద్ధ సనామ మూర్తీ!
నైకప్రకార సుజనార్చిత దివ్యదేహా!
ఐకాగ్ర్యదాయక మహో మహిమాన్వితాంగా!
లోకాతిశాయి నిజలోకన సిద్ధమోక్షా! 244

# ప్రత్యభిజ్ఞా ఖండము

౪

## తత్స్వరూపము

శ్రీ మత్త్రిలింగ దేశ
స్వామీ! భద్రాద్రి రామ సంవిద్ధర్మా!
క్షేమంకర! భద్రంకర!
హైమవతీ ప్రాణహంస! హంసాకారా!

అక్షాడంబర ఘోరవార్ధి గడుసై యాపోశనంబెత్తి, ప్ర
త్యక్షాజ్ఞాన ఖలీన వింధ్య దమన ఖ్యాతిన్ సమార్జించి, క్షే
త్రక్షామాత్యయ గూఢ శత్రు సమవాతాపీల్వలఘ్నాయతిన్
సాక్షాదీశ్వరుఁ డయ్యగస్త్యుఁ డొకఁ డక్షయ్య ప్రభావుండగున్॥ 2

ఆ ముని యాశ్రమంబనిన నయ్యది సీత కయోధ్యయున్ బితృ
ప్రేమ నిదానమౌ మిథిల రెండు నొకండ— ప్రీతిఁ గూర్చె నం
దేముని సర్వకాల విదుఁడీశ్వరుఁడై హరిణాశ సీతయై
కామన వెల్వరించు నెడఁగా దనఁబోకని హెచ్చరించెఁబో॥ 3

ఏమియు నేరనట్టు లతఁడెప్పుడు నగ్నులు లేళ్ళు దుప్పులుం
గామను చుండుగాని ముని కాంతుని మానసమద్ది సర్వలో
కామయ హారి సర్వజగదాయక సౌఖ్య విధాయకోత్తమ
క్షేమవినిర్ణయాలయము కేంద్రమగున్ బరమాత్మ నీతికిన్॥ 4

ఆ మహనీయుఁడే తనకు నాగతిఁ బ్రేయసి కోర్కి— ప్రాణముల్
ప్రామినసైనఁ దీర్పుమని పల్కి— య దట్టులె యాట కంతకున్
స్వామిగ రావణుం డటులు వచ్చు తలంపును బూనఁజేసెఁ గా
దే మహిజాత మానసము నెట్టు లెఱుంగును వాఁడు దుష్టుఁడై॥ 5

ఏ దెటులౌనో సర్వమతఁ డీశ్వరుఁడై మునుముందె నేర్చు దుః
ఖోదయ సూచకంబు రురువుండఁగఁ జూపి ప్రియావిహీన ము
న్నాది రమేశు దివ్య మహితాయుధముల్ ధనురాదికంబులన్
భేదము లేదనం దెలియఁ బిల్చి యొసంగెను లక్ష్యసిద్ధికై ॥ 6

నేఁడె మహారణం బనఁగ నింగిని వచ్చి యనుగ్రహించె న
వ్వేడి వెలుంగు ప్రీతుఁడగు విద్య తదీయ మహత్త్వ మింత యం
చేఁ డెఱుఁ గంగలాఁ డరియు నీల్గిన దద్ది వశంబు కావుటన్
ఱేఁడితఁడే జగత్త్రితయ రీతి తదీయ కృపాశ్రితంబగున్ 7

రాముం డిట్లని స్వామి నెన్నుచటు రారా వేదముల్ నాల్గు శ్రీ
స్వామిన్ దెచ్చిన యట్టులయ్యె ఋషులున్ వార్ నల్వురే యాట; నం
దా మానీశ్వరుఁ డీ మహీపునకునై యల్లెంతయున్ వేచి శ్రీ
రాముం జూచుచునే ప్రియా విగహు నేత్ర ప్రస్ఫురజ్జ్యోతియై॥ 8

రామా! జానకిరామ! మానిహృదయారామా! పరంధామ! ని
స్సీమానంద మహోఽభిరామ! విజయశ్రీరామ! పట్టాభి రా
మా! మాహేశ్వర హర్ష వృద్ధికరధర్మా! ధర్మసంత్రాణ దీ
క్షా మాహాత్మ్య జితాఖిలాభ్యుదయ విశ్రామా! సదోద్యద్రమా! 9

ఏనున్నా యెలనాగ నీకొఱకు నిందేయుంటిమయ్యా! నినుం
గానంగా నెదలెంత స్రుగ్గినవి? నీకా తీఱికే లేదు, మే
మైనన్ వత్తుమటన్న మాకునిట నగ్న్యాధాన ముండెన్ మముం
గానంగా దయచేసి వచ్చితివి రాకన్ మేలుచేకూరెడిన్ ॥ 10

బడలితి వెంతో యర్ఘ్యమును బాద్యము కైకొని సేదదేఱి యీ
తోడిఁబడు మేనులంగలుగు తొక్కు లొసంగెదు కొద్దివిందు నె
క్కుడుగ మదిం దలంచికొని కొంచెము సేపటు విశ్రమించి మా
నుడువుల నాలకించి చనునందగు మాయొడయండ వింతకున్ ॥ 11

అని ముని యగ్న్యగారమున కట్టెచనన్ విని రాముఁడేమి చే
యును ఋషివర్యు లాదరము నొందుచు నుండక తప్పదాయె నీ

ముని మునిలోక మూర్ధమణి మోహనశీలి దృశావిలాస వీ
క్షణమున సృష్టి పుష్టులెసఁగన్ ఘటియించు ఘటాత్మజన్ముఁడై॥ 12

అటులు వశిష్ఠుఁడెంతో యిటులద్భుతుఁడైన యగస్త్యుఁడంతె ది
క్తటులొరయన్ మహత్త్వ గురుగర్భదయా మహనీయ దివ్య సం
ఘటనములన్ యశస్సులను గాంచిన వారు గురూత్తమాగ్రణుల్
పటుతర వాక్ప్రసారమునఁ బంటలు పండు మఱంత నెండెడున్॥ 13

ఎటనైన నెగురు చప్పటమైన నైశ్చల్య
మెఱుఁగని లేళ్లందు వఱలు విధము
నుంగరమ్ముల జుత్తు పంగ కొమ్ముల దుప్పు
లతి వృద్ధములు నడయాడురీతి
యొకమూలఁబడి యుండి యొగి పిల్చినంతన
వచ్చి బలుల్గొని మెచ్చు తీరు
రోమంథ మొప్పంగ రోయు ఋషిఁగాంచి
లేచి తత్పదసీమ వేచునీతి

యట వసించుచు నున్నట్టి యుటజవాసి
గణముకంటెను త్రిగుణమ్ముగాఁగ నున్న
హరిణలోకమ్ము తన మనస్సాహరింప
రామభద్రుండుచూచి తద్రక్తుఁడయ్యె॥ 14

అది సాయం సమయమ్ము లేఁజిగురు లొయ్యన్ బొల్చెఁబశ్చాద్దిశన్
గుదులై గోతతి ధూళిరేపుచును నిగ్గుల్ దేఱు మైకాంతులన్
బొదలంగా మునివాటి చేరునెడ త్రుప్పాల్ దుల్లగా మేయునో
యదనై రాముఁడు భద్రమానసుఁడు సంధ్యాగ్న్యర్చనల్ పూర్తియై॥

తనకై చూపిన పర్ణశాల నొకఁడై తాత్పర్యమొప్పన్ ద్రిలో
చన తత్త్వం బెదనిండి శాంతిమయకాసారంబు నానుండ నౌ
పనిషత్ తత్త్వమె రూపుఁగొన్నయటు లోపాముద్రతోఁ దాను వ
చ్చిన నద్దేవు పదారవిందములఁ జేర్చెన్ శీర్షమా శిష్యుఁడున్॥ 16

తానై వచ్చిన దీమె సిగ్గుపడు వద్దన్నన్ వినన్ లేదు డెం
దానన్ నిండుగఁ బొంగు ప్రేమగల కాంతాలోక రత్నమ్ము నా
కై నన్ దీవ్రత యప్పుడప్పుడగు నీ యమ్మన్ గనన్ లేమ సుం
తైనన్ జాపలమంత శాంతమతి నీకై వచ్చెనో రాఘవా! 17

ఆ యగస్త్యుని నుడులు ప్రియమ్ములయ్యె
నశనిపాతమ్ములయ్యె రామావనీశు
చెవుల కాతల్లి జానకి సేగినెంచి
యేమి మాటాడునో సుంత యెఱుఁగరాక! 18

మోము వెల్వెలఁబోయి యాముదపు దీప
కాంతులందు మఱింత బిక్కమొగ మగుచు
నదరు గుండెలఁ దడబడు నతని నసుఁగు
శిష్యుఁ జూచుచుఁ దబిసి వచింపఁ దొడఁగె॥ 19

నాయన! నిన్ను బట్టి ప్రజ న్యాయము ధర్మమెఱింగి వర్తిలం
జేయుటకైన రాజ్యమునఁ జిక్కని ధర్మమెఱుంగు నీవు మేల్
సేయఁగ నెంతకోరినను జేయుట కింకొకఁడేమి యున్నదే
దో యనవచ్చుగాక యెవరో నినుఁ దప్పను వారలీధరన్॥ 20

త్యాగము చేయుచామె సుఖయై మనియుండుఁ దలంపుతోడనే
యాగతిఁ గోర్కె వెంటఁ జనునట్లు సురాపగ దాటి నంతటన్
సేగి నెఱుంగఁజేసి వనసీమ మునీశ్వర పుణ్యవాసముల్
గాగ శుభంబె యాననెడి కాంక్ష మెలంగితి వద్ది నేరుపా॥ 21

ఇంతకు నీ వియోగమిది యెట్లు వహింపక తప్పదాయె క్షో
భింతు వదేల? విస్మృతియె భీతినిగూర్చు రమింపఁజేసెడిన్
సుంత స్వరూపతన్ బడసి చూచితివేని కృతమ్ములిట్లు లా
టంతయు స్పష్టమౌను శుభమౌనిఁక నీకును నీదు సీతకున్॥ 22

రామున కిన్నినాళ్లు కెదరాయిడి తగ్గిన దాత్మమూర్తియై
యాముని యట్టులాడఁ దనయందున దోసము నెంచువారె కా

నీ మహితాత్మవోలెఁ దనరీతి నిటుల్ పొసగించి నిక్కమున్
దా మది నెంచి నట్లుగ నె తత్త్వమెఱింగిన వారు కానమిన్ ॥ 23

స్వామీ! నీవు దయాంతరంగుఁడయి వాత్సల్యమ్ము పొంగారఁ నీ
రామున్ బ్రేమను జూచి చేతలను తీవ్రమ్ముల్ సమర్థించి తిం
కేమైనన్ భయమందఁబో నయిన తండ్రీ! యొక్కఁడర్థింతు నీ
వేమో యంటివి యీ వియోగ మెటులేసీ తప్పదం చెందుకో? 24

కారణమే నెఱుంగ నటుగాన దయామతి విప్పి చెప్పవే
నేరని జన్మలై కనుకనిన్ బెగడొందిన చేతలాచు సం
సారము సాగు త్వాదృశులు సారమెఱింగిన ప్రోడలాట నే
తీరెది నిశ్చయంబుగను దేలి ప్రశాంతత నుందురన్నిటన్ ॥ 25

నీదయ హేతువుం దెలియనేర్చినఁ జింతలుడక్కి శాంతిమై
మోదము మాట కేమి మునుముందిది యిట్లని స్పష్టమాటచే
ఖేదము నందకుండెదను ఖేలనమై బ్రదుకెల్ల సాగెడిన్
చేదగు జీవితాన మధుసేచనమై చిఱుచేదు సేవ్యమా॥ 26

అనుచో రాముని నేత్రకాంతులవి డాయంజూచి యీయవ్వ యిం
దనుకన్ మూతి బిగించి యుండినదికాదా తానె యామాట చె
ప్పను వచ్చున్ నను నిత్య మీ విషయమే పట్టించుకోనంచు దె
ప్పను నేనేల వచింతుఁ దానెఱిఁగి రొప్పన్ దేరఁగా నుంటినే? 27

అని మాని మానమూనినఁ
దనయా శ్రీరామచంద్ర! తాతల బిగువుల్
కనుగొంటివ? మనసేమో
తనకైనది తీర్పవలయు దానిని నేనున్ ॥ 28

సరి యట్లే యగుగాక త్వాదృశ మనీషావంతు లిద్దాని చొ
ప్పరయం జాలియ యుందు రెందయిన వత్సా! దేహమున్ దానితో
బెరయన్ నిల్చిన మానసంబు గనుచో విస్పష్టమానొక్క మా
దిరి కా వియ్యవి యందు తొల్తటిది చెందెంబో ద్వితీయంబునన్ ॥29

వెలికి శరీరమే తొలుత వెల్వడినట్లుగఁ దోఁచు చుంటచేఁ
దెలియరు దాని హేతువును దేహముబట్టియె మానసంబు తా
మొలిచిన యట్టులెంతురు విమోహిత చిత్తులు వీని వృత్తులన్
దెలిసిన గట్టి చిక్కెడలి తేలియపోవు రహస్యమంతయున్॥ 30

సీతకు సేగి వచ్చెనని చెందకు దుఃఖము నీకు నా మొకం
జేతము లొక్కటయ్యు విడిచేతల కొప్పిరి లక్ష్యసిద్ధికై
యీతను వొప్పి నీవిటకు నెప్పుడు వత్తువొ నీకు ముందుగా
నే తనువంది యుండినది యీతొలి దానవుఁజంపు యత్నమై॥ 31

నీచేఁ జచ్చిన రాక్షసాధముఁడుకంటే నేటివాఁడా? యుగా
లై చెల్లెన్ దుదికేమొ వచ్చినది మన్నా చేటుకాలంబు నేఁ,
డీ చిద్దారుఁడు మున్ను వేదవతిగా నెంతో తపోనిష్ఠమై
శ్రీ చెల్వే తనువందియుండఁ జెడఁజూచెన్ గామభావంబునన్॥ 32

ఓయీ! నాయన! నేటివా పగలు? తా మున్నట్టులేయుండి యే
దో యీ హేతువటంచుఁ దోఁచుటయు నట్లున్నట్టి యద్దాని క
ల్లో యానంచుఁ దలంచు చుండుటయె కానీ దీని కంతున్నదే?
యాయా హేతు పరంపరల్ తెగవహో యానంత్య మూలమ్మునై॥

జీవనిమిత్తమై జగతి జీవితమున్నది వాఁడు నిత్యుఁడై
యీవిధి సాగఁజేయు నొకఁడేయయి పెక్కురుగాఁగఁ దోఁచుచున్
భావమయుండు తానగుట భానములేని యెడన్ స్వరూపతన్
దైవమెయౌచుఁ దక్కనెడఁ దాసయి నాటకమాడు నెప్పుడున్॥ 34

ఇట నీవుంటివి యెచ్చటైనగల వీ యిచ్చోట నీ హేతువై
యిటులీ దేహముతో నెదోయొకటి మాయీ! లక్ష్యమొప్పారి త
ద్ఘటనన్ రంజనమొప్పి నిల్చెదవు చక్రభ్రాంతి కిద్దాని క
క్కట తెంపెక్కడె దిక్కు నీవెపుడు చిక్కన్ లేదు మాయన్ ప్రభూ!

ఆనాఁడు కుశధ్వజుఁడొకఁ
డేనో దూరుండు తన యహీన తపోఽగ్నిన్

దానయి పావనవేద
స్నానా నందాతిరేక సంపదఁ దేలన్ ॥ 36

తనువందెన్ శ్రుతిమాత యాతనువు సౌందర్యంబు నింతింతనన్
మనసెట్లొప్పఁ ద్రిలోక సత్కవులు సమ్మంగూర్చి యెంతెంతగా
ఘన సంకీర్తన మాచరించినను భాగంబైన నిశ్శేష మె
న్నిన యట్లౌనె? తపోధనాగ్రణియు దానింగాంచి సంతుష్టుఁడై ॥ 37

తల్లీ! వేదవతీ! యని
హృల్లీన జగత్ప్రసూతి యీ తనువందెన్
ముల్లోకంబుల కేలిక
యిల్లాలిత తనువునంది యేలెను నన్నున్ ॥ 38

అని సర్వస్వము నామెపై మనుచు లోకాతీత సౌందర్య మొ
ప్పిన యా బిడ్డను మాకు మాకనుచు నేవేళన్ ద్రిలోకీజనుల్
చనవెక్కన్ దనుగోరుచుండఁగని యీ సౌందర్య వారాశి నా
ఘను నారాయణమూర్తి కిచ్చితిని వీఁకన్ జూడకుండింకిటన్ ॥ 39

తానై వచ్చి సుతన్ యథావిధిగ నుద్వాహంబుగాఁ గొంచుఁ బో
నౌ నంచున్ బరితృప్తినుండ నొక నాఁ డచ్చోటి కేతెంచె ను
చ్ఛానాహంకృతి దంభుఁడన్ దనుజుఁడా శోభావతింగోరి నే
నీ నన్నాఁడు కుశధ్వజుండతఁడు తానెట్లున్ వినష్టాత్ముఁడై ॥ 40

నిద్రలోనుండఁ దండ్రిని నిశితఖడ్గ
ఖండితుం జేసి తత్పాప ఖండితుండు
గాఁగ నత్తపసి సతియుఁ గాంతుతోడ
నగ్నినింజొచ్చి యందె దేహాంతమపుడు ॥ 41

పితృవచన దత్తనయి హరి
కతనిం గా కొరులఁ బెండ్లియాడఁగ నెట్లౌ?
స్థితి కారకుఁ డతఁడే మ
త్పితృ వచనాకృష్టుఁడగుచుఁ బెండ్లాడఁగ నౌ ॥ 42

తండ్రియుం దల్లి లేని వేదవతి యిట్లు
దృఢవినిశ్చయ మొప్పి సుదీర్ఘ తపము
నూని యుండఁగ రావణుం డొక్కనాఁడు
మోహితుండయి యామె సమ్ముఖమునందు॥ 43

చాల కాలమ్మునిల్చి యాచాన సొగసు
సొగయఁజేయంగ మనసునన్ సొమ్మసిల్లి
దగును దగదని యనక చిత్తజుని బారి
కగ్గమై తన్ను బెండ్లాడుమనుచు నడిగె॥ 44

ఆమె మనంబునన్ వగచి యాతఁడు విశ్రవు పుత్త్రుఁడౌటచే
సామ వచస్సులన్ మనసు చక్కగఁజేయు తలంపు పుట్టి గో
త్రామరునట్లు పూజలిడి యాశ్రమ మందున నాతిథేయ వి
శ్రామములైన పిమ్మటఁ బ్రశాంతముగాఁ దనపూన్కి చెప్పినన్ ॥ 45

కావలుఁ డాతఁడా సుదతి కాయమునంటి బలాత్కరింపఁబోఁ
గేవల మగ్ని దేహమయి కిన్కదహించెడునట్లు చూచి యో
రీ వివశాత్మ! నీ తనువునిట్టె దహింపగఁ జేయఁజాలుదున్
నీవు స్పృశించు దేహమున నిల్వఁగఁజాలఁ దపోవ్యయంబునౌ॥ 46

కావున మంటి వింకఁజను కాయము వేఱొకఁడంది నిన్ను నే
నే వధియింపఁ జేసెదను నిష్ఠురుఁడైన రమావిధేయుచేఁ
గావలుఁ డీవటంచు నినుగాంచియు నీ జనకుందలంచి ని
న్నీవిధి సంస్కరింతమని యెంచిన నేరవదెంత పాపివో? 47

అని మహాక్రోధమునఁ బల్కి యంతలోనె
స్వీయ వివృతయోగాగ్ని విసృష్టదేహ
యై యసుర హనన మతి మాయాస్వరూప
వాని లంకనె పద్మ సంభవగఁ బుట్టె॥ 48

తప్పుచేసిన వాఁడౌట తద్విచిత్ర
పద్మ సంస్థిత సుందరవదన శిశువు

తన్ను చంపింపఁబుట్టు వేదవతి యను భ
యమునను వణఁకి యొకపెట్టెయందుఁ బెట్టి॥ 49

దాని విడిపింపఁబంపె సంద్రంబునందు
ఘోరకల్లోల వార్ధి గర్గోలు పడుచు
నదియె నశియించు ననివాఁడు ముదమునంద
నామె పొడచూపె జనకు యజ్ఞాంగణమున॥ 50

ధర్మయజ్ఞార్థ ధరణి సీతావికృష్ట
యాచుఁ దో తెంచుటంజేసి యతివ కతఁడు
సీతయని పేరుపెట్టెను శ్రీమనోహ
రా! రమావిధేయతను! శ్రీరామచంద్ర! 51

సీత యా వేదవతి, నిను జెందఁగలిగె
మీ రెపుడు నిత్యులాదురో యీ రమేశ!
అవనిఁ బాలించి ధర్మంబు నతిశయముగ
సుప్రతిష్ఠిత మొనరింపఁ జూడుమీవు! 52

చాల రాతిరి గడచె విశ్రాంతి గనుము
రామ రఘువంశ మా చంద్ర రవి విశుద్ధ
తారకమ్ముగ భువిని నితాంతయశము
గాంచు చేలుము శుభములు గలుగు నీకు॥ 53

లోపాముద్ర వచస్సులు
శ్రీ ఫాలిత రామచంద్రు చెవులకు సుధలై
తా పోపశమన మయ్యెను
నీ పోప వనస్థు వోలె నిద్రను గాంచెన్॥ 54

ఒకటా రెండ త్రయోదశల్ సమలు పక్షోత్సారమే లేక యా
రక సీతాసతి నెన్నుచున్ గడపి నిద్రం జెందకున్నట్టి దుః
ఖ కథానాయకుఁడైన రాముఁడట సౌఖ్యంబది నిద్రించె భా
వుక యా తల్లి వచించి చన్ననుడు లాప్తోక్తుల్ సమాధానమై॥ 55

ఆ సుఖ నిద్రయందె కననాయెను రాముఁడు స్వప్న మొండు తే
జోఽ సహ దుర్నిరీక్ష శశి సూర్య హుతాశన లోచనుండు తా
నై సమరక్షితిన్ భయమునంది సురారులు పాఱిపోయి ప్రా
ణాశను భార్గవాంగన సమాశ్రయమంది సుఖించుచున్న చో॥ 56

భృగు పత్నిన్ శరణంది వీరు సుఖులై వ్రీడా విహీనుల్ పునః
ప్రగుణాగ్రహః పరిపాటి వచ్చెదరు సంభ్రాంతత్వమేగాని ర
క్షగ మా దుష్టత వీడ నొప్పరు సురాధ్యక్షున్ విమర్దించు టే
తగు లక్ష్యంబని యెంచు వీరి నకటా తా నెట్లు కాపాడెడిన్॥ 57

స్త్రీ వధ దూష్యమయ్యు నిటు తెంపరులన్ శరణిచ్చి కాచుచోఁ
గానలులైన వారి బడి కాంతయు వధ్యయ యౌనటంచుఁ దాఁ
బోవిడఁ జక్ర మయ్యదియుఁ బోయి మునీశ్వరు పత్నిఁ జంపిరా
నా వెనుకన్ సురారుల సహస్ర కర పుత్రుని జూడఁ బంపినన్॥ 58

ముని తన పత్ని చచ్చెనని మోహము నందెనె గాని దుష్టు లా
దనుజుల కాశ్రయం బగుటఁ దాన వధార్హ యు నౌట నెంచకే
కినిసి మదంగనన్ గెడపి కీర్తిని గాంచు నితండు మర్త్యతన్
గని ప్రియురాలిఁ బాసి మనుగాక యటంచును శాపమిచ్చినన్॥ 59

భృగువును శాంతతన్ గనిన పిమ్మటఁ దక్క మునీశ్వరోత్తముల్
దగదిది శాపమున్ దిగిచి దానవవైరిఁ బ్రసన్ను చేసికోఁ
దగునని చెప్ప నా పలుకు తథ్యము దాన శుభంబు కల్గు నీ
జగతి కటంచు నా భృగువు చాటుట సర్వము తోఁచి నంతటన్॥

తనకు సీతా వియోగ మీ తనువు నందుఁ
దానుఁగాఁ దెచ్చికొన్న వృత్తమునకైన
హేతు వీ స్వప్న మెఱిఁగింపఁ జేత మెల్ల
స్వస్థతం గాంచి రాముండు స్వాపమందె॥ 61

వర్షా సమాయాత పంకాంబు కాలుష్య
మది యడంగిన శరన్నది యనంగ
గతి నిరోధక వింధ్య గర్వాప హృతి చేత
సక్రమమ్మయి పొల్చు జగతి పోలె

దనుజ సోదర వధ ధ్వస్త భీతి స్వాంత
ముదిత సన్ముని లోక హృదయ మట్లు
చులుకీ కృతాంభోధి తల వినిర్గత కాల
కేయ సంహారాత్త శ్రేయమట్లు

లవని పొలుఁడు నాఁ డగస్త్యాశ్రమమున
విగత సందేహుఁడై కడు విశ్రమించి
మొగము వాచిన నిద్ర ముఁపునకు లోఁగి
కొంచె మాలస్యముగను మేల్కాంచినంత॥ 62

పెద్ద బర్వాయి కూర్చున్న బెంగ వదలి
తను మనస్సులు తేలికై చనుననంగఁ
జాల నుల్లాసముగ లేచి సాంధ్య విధులు
సక్రమమ్ముగఁ దీర్చి యుత్సాహ మొప్ప॥ 63

అనుమతిం గొని పోవ నమ్ముని నిరీక్ష
వేచి యున్నట్టి వేళ నుర్వీకళత్రుఁ
జూడ వచ్చెను ముని తపశ్శుద్ధయైన
సతియుఁ దన వెంట రాఁగ వాత్సల్యమూని॥ 64

వచ్చుచునే శిరస్సునకుఁ బాదము లంటగఁ దమ్ము మ్రొక్కి నా
మచ్చు మెఱుంగనట్టి జనమాన్య నరోత్తము రామచంద్రు న
భ్యుచ్చ్రయ సంపదంచిత మహోన్నతి నందెడు నట్లు దీవనల్
విచ్చిన పూలవర్షమన విచ్చి యనుజ్ఞ సుఖోపవిష్టుఁడై॥ 65

చిక్కని కన్నులన్ దనుపుఁ జెందిన డెందము తోఁపఁ దమ్ము పెం
పెక్కిన గౌరవంబున మహేశ్వర దంపతు లట్లు చూచు స
మ్యక్కమనీయ మంజుగుణ మండితు నక్కమలాయతాక్షు రూ
పెక్కిన రామచంద్రుఁగని హెచ్చిన వేడ్కఁ దపస్వి వర్యుఁడున్॥

నాయనా! రామ సుఖనిద్ర వోయినావె
ప్రాత రౌపాస్తి సాగెనా భద్రముగను

తెల్లవారలు నీ వార్త లెల్లఁ దలఁచు
కొనుట తోడనె మాకు వేగినది సుమ్ము! 67

అనిన రాముఁను తండ్రి! మీ యాలుమగలు
సర్వ దైవ స్వరూపులై పార్వణేందు
సదృశ చిత్తమ్ములన్ నన్ను సంస్మరించు
టేమి? సుఖనిద్ర లేకుంట యేమి స్వామి! 68

మీ దయ నేనిటన్ గనిన మేలు కొలంది కొలంది యానె నా
కూడి వచింపఁ డాము దయనూని త్వదంతిక సీమఁ జేర రా
గోదయ మొప్ప నప్పగిది నూర్జిత చిత్తులఁ బంపినారు స
మ్మోదము నంది చిత్త మిట ముగ్ధమునై విడిపోవ నెంచదున్ ॥ 69

ఏ నెక్కాలము నిందె యుందమని నా కెంతే మహానందమై
యే నిందే వసియింప నౌనె కరుణా హేవాక భద్రాత్ములై
నా నా ధర్మ మహిష్ఠ నిర్వహణ యత్నంబందు నే నుండఁగా
నా నందంబునఁ బంపఁ గోరెదను నన్నాశీర్వదింపంగ దే! 70

అన నా రాముని దిక్కు మోముగు మహేశాద్వైతి తండ్రీ! నినుం
గని నా మేమును మమ్ము నీవు కనుకై కన్నా మహామోదమున్
జని తా వచ్చిన చారితార్థ్య మదియున్ సంధించె మా బోంట్ల కిం
కను వాంఛించెడి దేమియుండును ప్రభూ! కన్నాకువై కావవే 71

ఒక మాట చెప్పవలె నని
తెక తెక లాడినది మనసు తెలవారినతో
వికసన్ముఖు నినుగని యో
పికతోఁ జెప్ప నగును గదవే యని యుంటిన్ ॥ 72

వినవయ్యా రఘురామ నీకు నికఁ బృథ్వీశాన మార్గంబునన్
దిన ముచ్ఛ్రాయమె గాని తగ్గను న దేదీకానరా దింక నీ
కనుకూలంబయి సర్వలోకములు నృత్యం బేచు నా వర్తనం
బున నుండున్ సరిగాని చేయవలె నంభోజాక్షు! రాణ్మేధమున్ ॥ 73

హయ మేధంబున సర్వపాప హతి యా నా యజ్ఞమున్నించు శ్రో
త్రియ మా కర్మమె లేదు రాజగుటతో దేవుండెయాగాక వి
స్మయ కృత్పాప సమూహ మేచు గనుకన్ సర్వాఘు దుర్మోఘ సం
క్షయ హేత్వ ధ్వర మిద్ది చేయవలె రక్షోదక్ష రామాధిపా! 74

గోవుం జంపఁగఁ బోవు వ్యాఘ్రమును దక్షుండై వెసం జంపుచో
గోవుం గాచిన పుణ్య మబ్బు నటులే క్రూరాహతిన్ బాపమా
నీ వద్దాని క్షయింపఁ జేయవలెఁ దండ్రీ ముందుఁ దల్లక్ష్యమో
దేవా! యీ హయమేధ మొక్కటియె సాధించున్ బ్రశస్తమ్ముగన్ ॥

వేదం బియ్యది రాజధర్మమున నుర్వీశాని కావశ్య మం
చాదేశించెను పూజ్యుఁ డా దశరథుం డద్దానిమున్ జేసి కా
దే దైవంబుల మిమ్ము పొందినది నీ వేగంగ నే పూని నా
నా ది జ్ఞానుల భక్తిమై పిలిచి సన్నాహంబు సేయందగున్ ॥ 76

సర్వాఘు నాశకం బిది
సర్వాభ్యుదయ ప్రసార సంవర్ధక మా
నిర్వక్ర విక్రముండవు
సర్వేశుఁడ వీవుపురికి సాగుము తండ్రీ! 77

రామస్వామి యగస్త్యమౌని నుడులన్ శ్రద్ధాన్వితుండై శ్రవో
భూమిన్ జేర్చిన వెంటనే తెలిసె విప్పం బొందె గూఢార్థముల్
స్వామిన్ వీడ్కొని యేగలేక చనియెన్ సర్వర్షులున్ వెంటరా
క్షేమం బొప్పఁగఁ బుష్పకంబునుచు సుక్షేత్రంబు గోదాతటిన్ ॥ 78

వెంటన్ వచ్చిన సర్వ మానులకుఁ దృప్తిన్ మ్రొక్కి గోదావరిన్
బంటల్ పండు నెడందఁ జూచి తనకై వాత్సల్య వర్షంబు కన్
వెంటన్ బాష్పము లట్లు చూచు మునులన్ వీడ్కోలు తానంది మి
న్నంటన్ దేలిన పుష్పకంబునఁ జనెన్ హ్లాదంబు నిండారఁగన్ ॥ 79

పూవై తేలిన పుష్పకంబె చనునో ఫుల్లాబ్జ హృల్లేఖ దా
హేవాకంబున రాముఁ డందునికి చే నిక్లేగునో తానుఁ ద

ద్వైవిధ్యం బెఱుఁగంగ రాక గగనాబ్జం బెల్ల విప్పారగాఁ
దావుల్ గ్రుమ్మ్మచుఁ బుష్పకంబది యయోధ్యా వీథి నేతెంచుచో॥

ఏ క్షణ మందు శంబుకుఁడు కృత్త శిరస్కుఁడు గాఁగ నయ్యెనో
యా క్షణ మందె తైలముల యందలి బాలుఁడు ప్రాణవంతుఁడై
వీక్షణ మొప్పి ప్రాంతముల విస్మయ మందుచు లేచి స్నాతుఁడై
దీక్షగ ధ్యానముం జలిపి దేవతలన్ దనియింపఁ జేయుచున్॥ 81

గీమున కేగె దుఃఖమున గీడ్వడు నైన స్వమాతృ పిత్రవ
స్థా మిహికాంధకారమును ధ్వస్త మొనర్చు నహస్కరుండనన్
క్షేమమె కాక శాశ్వతము కీర్తి వహించుట యోగమాటచే
స్వామిని బోలెఁ దన్ను జనసంఘము లర్చన సేయఁ బొంగుచున్॥

అంబరవాణి వించు వసుధాధిపుఁ డంబరచారియై చనెన్
శాంబర మన్న యట్లుగనె చచ్చిన బాలుఁడు లేచె స్వస్థుఁడై
పంబిన దుఃఖ మేమొ చెడఁబాఱెన దప్పుడె రాజ సమ్ముఖం
బింబుగ నందదాయె నెపుడెప్పుడటంచని యున్న పౌరులున్॥ 83

ఆకాశంబునఁ బుష్పకంబుగని రామారామ! జై జై ప్రభూ!
యీ కారుణ్యము నిట్టి దక్షతయు నెందేగంటి మేమున్న మా
త్మా కాంతుండవు నీవె దైనమవు రక్షా శిక్ష లింకొక్కచో
నేకంబై యిటు కాన రావనుచుఁ బ్రహ్వీభూత చేతస్కులై॥ 84

మనసారన్ గొనియాడుచో జగము నాత్మారామతం బొంది ప
ట్టిన మన్నెల్ల సువర్ణమాచుఁ, దృణమై డీకొంచు నమ్మేరువున్
గొన కే కార్యము విశ్వకర్మ మగుటన్ గొండంతగా నెంచుచున్
జనులుంటన్ రాఘురాము రాజ్య మది రాజ్యంబంచు ఖ్యాతింగనెన్॥

ప్రభు వఖిలాత్మకుండయిన బ్రహ్మము వానికి హెచ్చుతగ్గులున్
శుభ మశుభంబు భిన్నులును జుట్టములున్ రిపుమిత్ర భేదముల్
ప్రభలు నప్రభల్ మొదలు ద్వంద్వము లేవియు లేవు ప్రేయసిన్
శుభమని గర్భిణిన్ మొగము చూడక పంపునటే నరేశుఁడై॥ 86

దేహరక్షను పరులు సాధింపవచ్చు
శీలరక్షను వ్యక్తియే చేసికొనఁగ
వలయు నచ్చటఁ బరుల కెప్పగిది వీలు
సర్వతోముఖ రక్షణన్ జాఱుటుండు॥ 87

అది స్వయంకృత మాచుంట నట్టి రక్ష
యును స్వయమ్ముగనే పొందుచుండవలయు
లంక యందున్న సీత నిశ్శంకముగను
దన్నుఁదా రక్షితం జేసి కొన్నదగును 88

అట్లు కాకున్న నగ్ని భయంపడు నొకో
కాన నామెకుఁ తుదకు సుఖంబె యగును
ఎంత ఘోరాటవిం గూడ నెవ్వరేమి
చేయఁ జాలరు పరమ సౌశీల్యవతిని॥ 89

శీలముంబట్టి యొదుగు దేవాళి యామె
కండయై నిల్వఁ దల్లి సుఖప్రసవ య
గుచుఁ బ్రజాసహిత యెపుడో కుశలముగనె
రేపె రావచ్చు మనకు నదృష్టమున్న॥ 90

మేలగు తత్త్వదృష్టిగల మిన్నలు విజ్ఞులయోధ్యవాసు లీ
లీల విచారముం జలిపి లిప్తయుఁ గాలము వ్యర్థమాట కు
ద్వేల తపంబు నందుచు స్వదేశము కాలము ధర్మ మన్నియున్
జాల విశిష్టముల్ తనువుచాలదె యంచు స్వయం ప్రతిష్ఠులై॥ 91

జీవన మద్భుతం బిది పచేళిమమై లభియించె దీనితో
జీవులు సర్వ సౌఖ్యములు చెందగ వచ్చును ముక్తులౌటకున్
ద్రోవ యొసంగు నియ్యదియె త్రోయక ధర్మము నాచరించుటే
కేవల హేతువంచుఁ దుదికీలు నెఱింగిరి తత్త్వవేత్తలై॥ 92

ఎచ్చటదేని జన్మమది యిచ్చ వహించి స్వధర్మ మెంచకే
నచ్చినదాని వెంటఁబడి నాట్యమొనర్చిన సృష్టి సాగునే

యిచ్చ వహించి ధర్మమున నే త్రైతెఁ జూపిన సౌఖ్యమబ్బుఁ దా
నిచ్చిన మాట యిద్ది యది యీశ్వరుఁ డెన్నఁడు దాటకుండెడిన్॥

ధర్మము నిత్యమై యెసఁగు ధర్మము మాఱదు మాఱుటున్నచో
ధర్మమె కాదు ధారణ సదా నిజధర్మ నివిష్టమౌటచే
మర్మ మెఱింగి ధర్మమునె మానక తొల్పగ నౌను సృష్టిలోఁ
గర్మము లన్నియున్ నిజవికారము మాన్పగ వచ్చినట్టి వౌ॥ 94

తానె తనతల్లి యుదరంబు తాల్చి వ్రేలు
వానరార్భక మెట్టు లద్దాని నేర్చెఁ
దల్లి పిల్లియుఁ దన పిల్ల నల్లగఱచి
మెడను బట్టుక గొంపోవు మెల్ల మెల్ల 95

పుట్టుకతోనె వచ్చగద బుద్ధులు వానికి భిన్నమౌనటుల్
నెట్టన నేర్చినన్ నెగడునే జగమిట్టులు వాని వానికిన్
గట్టొకఁడుండి తీరునది కానక దాటిన సృష్టి నేదియున్
బట్టున నిల్వకుండుటను బట్టగరాక చరించి భ్రష్టమౌ॥ 96

వచ్చినవన్ని పుట్టుకనె వచ్చుచు నుండుట స్పష్టమౌట మున్
దెచ్చిన పుట్టుకే మరలఁ దేక సమున్నతి నంది కొంటకున్
బుచ్చుచుఁ బుట్టుకన్ మరలఁ బొందగఁ బోని విముక్తినందఁగన్
వచ్చిన వేదధర్మమును వద్దనువాఁడు మనుష్యుఁ డెట్లగున్॥ 97

మనుజత నందుటే మనువు మార్గము నందగనైన యప్పు డా
మనువును కాదటంచు మన మానవతన్ విడనాడుకొంటయౌ
మనుకుల భూషణుండు రఘుమండనుఁడే మనరాజుగాన నీ
మనుజత ధన్యమైన యది మానవతా మహిమంబు స్పష్టమౌ॥ 98

మానవ దేహ మందినను మానవలక్షణమందు నిల్వఁగాఁ
బూని ప్రయత్నమున్ విరతిబొందక చేయుచు నుండఁగావలెన్
వేనికి నెట్టి సంస్కృతియొ విస్ఫుటమౌనటు తెల్పినందునన్
మానవ ధర్మశాస్త్రమది మాన్యతఁగాంచెను విశ్వమంతటన్॥ 99

పుట్టుకచేత స్పష్టమగు పోడిమిఁబట్టి సుసంస్కృ తత్త్వమున్
నెట్టనఁబొందు మానవుఁడు నిల్చి మనీషిగ నెట్టఁజాలు నీ
పుట్టుట గిట్టుటల్ గలుగు భూరిమహాంబుధివంటి సంసృతిన్
దొట్టి యడంపఁజాలు నిహదుర్దశలన్ హతిజీవుఁడొందకన్॥ 100

రాముని రాజ్యమందిటులు రాజునుబట్టి ప్రజాళియంతయున్
బ్రామునులెట్లు చెప్పిరటు వక్రతలేక చరించువారలై
క్షేమము యోగమున్ గనుచుఁ గీర్తి వహించిరి కీర్తి తెచ్చిరిన్
రాముని రాజ్యమే మహినిరాజ్యము పూజ్యమటన్న మాటయై॥ 101

చార్వాకం బొక డెప్పుడుండు నదియే శాసించు నవ్వానిదా
నిర్వాహంబునుబట్టి యయ్యదియు నిర్ణిద్రంబుగా నుండుటో
దూర్వంబోలె నడంగియుండుటయొ తోడ్తోతోఁచుచుండున్ మహీ
సర్వస్వంబున రామశాసనమునన్ జార్వాకమందెన్ మృతిన్॥ 102

గడ్డుల్ మొండివి కొన్నిగడ్డలను దగ్ధంబయ్యు మొల్కెత్తు నా
గడ్డన్ ద్రవ్వి రజంబుగామొదిపి దీక్షన్ బీజముల్ నేర్పుమై
నుడ్డీనం బొనరించి క్షేత్రమును నిత్యోత్సాహియై కాచుచున్
గడ్డింగాంచి పెకల్చుచున్ జనినచోఁ గల్పాంత మందాగనా॥ 103

అటులే మానవులందు వాసనలు వెంటాడున్ మనోభూమి నె
ప్పటి కప్డెవ్వఁడు జాగరూకుఁడయి నిల్వంగోరు సస్యంబుకై
స్ఫుటితంబై ప్రభవించు చుండఁగల కల్పున్ దీయునో వాఁడె య
ప్పటమైనట్టి సుఖంబు నందఁగలఁడీ భావంబె ధార్యంబగున్॥ 104

వ్యక్తుల్ మర్త్యులు వారి యిచ్చఁబడి పోవన్ వీలులేదిందు సు
వ్యక్తంబై నిగమస్వరూపమున నిత్యంబైన ధర్మంబె పెన్
భక్తిన్ బూని వహింపఁగా వలయు నెవ్వాఁడైన నే కొంచెమేన్
ద్వ్యక్తంబున్ బొనరించుచో మనుట సాధ్యంబే యనూహ్యంబగున్॥

తానై ధర్మమునందు నిల్చు ప్రజలన్ ధర్మంబునన్ నిల్పు డెం
దానన్ బ్రీతులు సర్వదేవతలు నిద్రన్ మాని సేవింపఁగా

నీ నేలన్ దివియన్న లక్షణము పండెన్ నించె మోదంబు స
ర్వానన్ ధర్మ మహత్త్వమేచి మనుజత్వంబే ప్రశంస్యంబుగాన్॥106

రాముని రాజ్యమందలి ధరాప్రజ యిట్లు సురక్షితంబుగాన్
రాముఁడు పుష్పకంబు దిగి రాజగృహంబుల కేగునప్పు డా
రాముఁడె సర్వమైన ప్రజ రామునిజూడఁగఁ జేరఁబోరు లో
లో మహిమంబు నెన్నెదరు లోలుపులౌదురు ధర్మమందునన్॥ 107

తమతమ ధర్మకర్మములఁ దత్పరతన్ వ్యవధానమీక డెం
దముల ముదంబు నందుచును ధన్యతనందెద రంతెగాని ధ
ర్మములవి వానిదారి నవి రాయిడినందఁగ వీడిచుట్టుఁ జే
రి ముసరుచున్నఁడుం జనదు తృప్తి వహించును రాముఁడందుకే॥108

రా వేమి నన్నుఁ జూడఁగ
నా వచ్చుట నీ వెఱింగి నన్నుం జూడన్
రావా నీవని యన్న మ
హీ వల్లభుఁడతఁడు చెందు హీనత నెప్పుడున్॥ 109

తమతమ కగు పనులందున
విమలాత్ములు ప్రజలు నిల్వ విచ్చిన హృదితో
శ్రమపడు తన ప్రజలను గని
సముచితమని యెంచు రాము సముఁడెవ్వఁడిలన్॥ 110

రాజై రాముఁడు చేసినట్టి దొకటా! రాజ్యాన నెందెందుఁ బో
బూ జేపట్టదొకంట నెచ్చరిక నెప్డున్ నిల్తురా మానవుల్
పూజల్ గొందురు పూజచేయుదురు నీవున్నేను నొక్కొక్క వి
భ్రాజద్ధర్మము నిల్పఁబుట్టితిమి నిల్పన్ మేలు చేకూరెడిన్॥ 111

అందఱు నొక్కటేయనిన నన్నియు గర్మములెట్లు సాగు నీ
సుందర సృష్టి దేనికది సుందరమౌ వివిధమ్మనౌచుఁ బెం
పొందెడి నొక్కలక్ష్యమయి యూర్జితమౌ గుఱినంద నెంచుచో
నందఱు నన్నిధర్మముల నట్టులె వీడక యాచరింపనౌ॥ 112

ఎవని పాలనవాఁడె ఘనుఁడెవ్వఁడు నెవ్వని చోటునందు మా
నవతను వీడి మార్పునకు నైజతనంబు నెసల్పరాదు ధ
ర్మవిభవ మిట్టిదై తిరిగిరా నొకఁడొక్కఁడు నున్నతోన్నతిన్
నవనవమంది తుట్టతుది నర్తనమున్ విడి నిత్యుఁడయ్యెడిన్॥ 113

సముఁడై ధాముఁడు చేసినట్టిదిది వైషమ్యమ్ముతో నున్న దో
షమునన్ సృష్టిని ధర్మనిర్వహణమే సామ్యమ్మునందించు ద్వే
షములన్ దోఁగి పరస్పరం బసహన స్వార్థంబులొప్పారుచో
నమలంబైన ప్రశాంతియే చెడును రాజ్యంబున్న దద్దానికా! 114

తత్త్వంబందు సమస్తమున్ సమమె సత్యంబద్ది యైనన్ సరే
చిత్త్వంబొందక సామ్యమెట్లు కననౌ చిత్త్వంబుపాధిస్థమై
తత్త్వాభిన్నతఁగాక భేదమునె నిత్యంబున్ గనంజేయు నీ
తత్త్వంబూడ్చి సమత్వమిచ్చుటకె వేదంబుల్ ప్రవర్తిల్లెడిన్॥ 115

హెచ్చున్ దగ్గును లేనెలేవనుట మేలే సృష్టిసర్వత్ర తా
ముచ్చున్ బన్నినయట్లు నిల్వఁగనలేవో యున్న వైవిధ్యమున్
మచ్చో నియ్యది దీని మాన్పుటకె సుమ్మా వేదధర్మమ్ము నీ
వచ్చో నిల్పిన నీకు క్షేమమగు భాగ్యంబబ్బు సంఘానికిన్॥ 116

ఎక్కువయన్న భావమిది యెట్టులధిష్ఠత నందఁజేయునో
తక్కువయన్న భావమది తార్కొనఁజేయును మత్సరంబు తా
నెక్కువయైనఁ దగ్గుదల కెన్నఁడు మొగ్గక కాచికోవలెన్
దక్కువయైన హెచ్చుటకుఁ దత్పరతన్ గృషి సల్ప గావలెన్॥ 117

చిత్తము మోహముంగనక చిక్కనిధర్మమునందు నిష్ఠమై
హత్తకయున్న మానవుఁ డహంకృతి నెన్నఁడు వీడలేఁడు మా
చిత్తము లిచ్చగించినవె చిక్కని ధర్మములన్నఁ జెల్లునే?
యుత్తరమున్నదే బ్రదుకులూడ్వగ నౌనె యుగాలు చెల్లినన్॥ 118

సర్వమహంకృతిం బడియె సాగుచునున్నది దాని హద్దులో
గుర్వసిపూని కావవలెఁ గోరినయట్టుల సాగనిచ్చుచోఁ

బర్వు నెకాని తగ్గదది పట్టి యడంచి ముదమ్ము పెంపఁగా
సర్వులు మానవుల్ విమలశాస్త్రపథిన్ బరిపాటి నిల్వనా॥ 119

నలిగిన దారియై మనువునాటి ప్రశస్త పథమ్ముగానఁ దాఁ
ద్రొలిఁజను నేతయైన రఘుధూర్వహు వెంబడినేగు తత్ప్రజల్
కనుకని యించుకంతయును గాలటు నిట్లుగఁ బెట్టఁబోరు దీ
క్షను జనుచుంట నెప్పుడును సాగు సుఖంబుగ జీవయాత్రయున్॥ 120

వైదికకర్మ లౌకికపు వర్తనమందు నవశ్యమౌచు సం
పాదితమైన హింసనగు పాపము కర్మఫలంబు రెండును
త్సాదితమై క్రమక్రమము సారతరంబగు తత్త్వనిష్ఠమై
వేదశిఖోపదిష్ట పదవీస్థితి నందఁగఁజేయ వచ్చుఁబో॥ 121

ఇంద్రియగమ్యమౌ జగతినెంత మథించియు నీ వెఱుంగలే
వింద్రియ సంతతిన్ దనకు నిష్టముగాఁ గదలించునాత్మ ని
స్తంద్రత నద్ది సూక్ష్మమును సారతమంబును నౌచు వ్యాప్తమై
సాంద్రముగాగ నుండియును చాలము దాని నెఱుంగ వెల్పలన్॥ 122

అది యున్నట్టులు నద్దియే జగముగా నైనట్టులున్ దత్త్వమ
య్యది తానౌచు నవిక్రియస్థితి స్వరూపావస్థ యందుండుకే
పదముత్కృష్ట మటంచుఁ దెల్పు శ్రుతియే వర్ణంబులన్ దెల్పి నీ
కిది నీకిద్దియటంచు ధర్మము లెఱింగించెన్ దయాదృష్టితో॥ 123

మానవబుద్ధికి మహిత మర్మములంద నసాధ్యమౌటచేఁ
దానె పరాత్పరుండు విదితంబొనరించెఁ ద్రయీజగంబు డెం
దాన స్ఫురింపఁగా నలువ తత్పరుఁడై పలుకన్ మహర్షుల
వ్వాని వినన్ బరంపరగఁవచ్చి న వయ్యవి నేటికిన్ శ్రుతుల్॥ 124

అందలి జ్ఞానకర్మలవి యల్పమనుష్యుల బుద్ధికందునా?
యందవటన్న బుద్ధినెకదా వినిపింపఁగఁ జేయుటయ్యె న
మ్మందగు వానినక్లై ఫలమంది మనస్సది యుండెనేని క
ర్మందిత్రయీ విరోధిదగు మార్గముఁబట్టిన నాశమందనా॥ 125

వేదము యజ్ఞకర్మమయ విశ్వవిభూతి సమస్తహేతు వ
య్యాది మహేశు నిశ్వసనమై వినవచ్చిన జ్ఞానరాశి ది
క్కేఁది నశించుటో వినర యేనికుజీవ మనోభ్రమార్థియై
వేదవిరోధి బుద్ధుఁడుగ వేసము వేయుఁ బరాత్పరుండహో! 126

తనువిచ్చెన్ మనసిచ్చె మానవునకా దైవంబు స్వాతంత్ర్యమున్
గొనుమం చిచ్చెను పూర్వకర్మములు నీకున్ బుద్ధి పుట్టించు నం
తనె దూఁకన్ బని లేదు సంస్కృతుఁడవై తత్త్వ నిష్ఠావివే
చన మొప్పన్ బ్రదుకీడ్వవచ్చు నిట శశ్వత్సౌఖ్య మందందగున్॥ 127

అధికారంబును బట్టి యేది విహితంబౌనద్ది నీవై త్రయీ
పథివై చేయుదువేని నీకగును సర్వశ్రేయముల్ కాక దు
ష్పథమందున్ జనుదేని మానవతనూ స్వాతంత్ర్యమే లేని త
క్కధమాంగంబులనంది మ్రందనగు నీవై యేది వాంఛించెదో? 128

రామస్వామి స్వకీయ రాజ్యమునఁ గర్మశ్రద్ధ పొంగారు ను
ద్దామేచ్ఛన్ జ్వలియింపఁ జేసె జనులద్ధా! నాఁడు వేదార్థ వి
ద్యామేయ ప్రతిభా సమున్నతులు నిత్యాది స్వకర్మప్రభూ
తామంద ప్రియలాభతుష్ట రుచిరస్వాంతుల్ జగన్మోహనుల్॥ 129

యజ్ఞ సంభవమైన దీ యఖిల జగము
యజ్ఞ ఫలముగ నభ్యుదయమ్మునందు
యజ్ఞహుతమయి లీనమౌ యజ్ఞమందె
యజ్ఞమౌ బ్రహ్మమౌ బ్రహ్మయజ్ఞమగును॥ 130

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః
బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం
బ్రహ్మకర్మ సమాధినా॥ 131

సర్వము బ్రహ్మమయ్యు సువిశాల జగమ్మిది భిన్నభిన్నమై
పర్విన మాయ క్రమ్మికొన బ్రహ్మము కానటు తోఁచుచుంటచే

నుర్విని జీవకోటి యెదనుండిన బద్ధతయన్న భావ గం
ధర్వపుఁ ద్రుళ్లడంప యజనమ్ముపదేశముచేసె వేదముఁ॥ 132

అధికృతులు సర్వులుఁ దమకైన యజ్ఞ
ములను జేయుచునున్న లోకులకు నెల్ల
సుఖమగుటెకాక క్రమముగా సుఖమదియును
నిలువకుండుట తోఁచుటై నిత్యసుఖము॥ 133

పొందఁ గోరుచుఁ గర్మముల్ పూర్ణభక్తి
ఫలముఁగోరక శ్రద్ధమైఁ జలుపుచుండఁ
జిత్తశుద్ధి లభింపఁగాఁ జిత్స్వరూప
మెఱిఁగి తరియించు పొంటెఁ దుర్వ్యేచ్ఛకలుగు॥ 134

కలిగి దృఢపడి సన్న్యస్తకర్ముఁడయిన
విమల మతి కుండఁబోవు వేదములకర్మ
లాశ్రమోచిత ధర్మము లవియెయుండుఁ
దక్కు వా రెట్లు కర్మముల్ తలఁగిమనుట॥ 135

అగ్నౌ ప్రాస్తాహుత స్సమ్య
గాదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యా జ్జాయతేవృష్టిః
వృష్టేరన్నం తతః ప్రజాః॥ 136

వేదకర్మాభి రతివీడి స్వీయబుద్ధి
ననుసరించుట యన్నఁ దానాత్మహత్య
చేసికొంటయె యగునుబో జీవకోటి
యగుట నానాటి ప్రజలు కర్మాభిరతులు॥ 137

యజ్ఞమున హింసకలదు లేదనఁగరాదు
హింసలేకుండ సాగని సంస్కృతిఁ వి
నష్టమయిపోక జీవులున్నతిని బొందు
గతి నెఱింగించు శ్రుతియె తద్గతి విధించె॥ 138

విధి విహితమౌట దాని దప్పిదమనంగ
రాదు బ్రదుకునందేమొ సర్వత్ర నున్న
హింస నొప్పుచు నొక యజ్ఞహింస మాత్ర
మొప్పదల కాక యుండుట ముప్పె యగును॥ 139

హింస లేకుండ బ్రదుకులవెట్లు సాగు?
కదపినంగాలు నోరేమొ మెదపినంత
కలుగు హింస సరే యిక దెలిసి తెలిసి
చేయు హింసయ దెంతో యమేయమగును॥ 140

అహారహము విహారణమ్మున
నహింసయే పరమమను శ్రుతి యతివిశదముగన్
విహితమిది యజ్ఞమందని
బహుళమ్ముగ బల్కు నహిత ఫలకమ్మగునే? 141

పశువునకు హితము చెప్పెను
పశువది తా వచ్చినట్టి పంచకు జెప్పెన్
విశదముగ హితము జెప్పెను
విశసన మొనరించు మఖికి విశ్వమ్మునకున్ ॥ 142

నమ్మిచరించు నా మనువునాటి శ్రుతీరిత ధర్మమార్గ క
ర్మమ్ముల నాచరించు నలరాముని రాజ్యములోని సుప్రజల్
తెమ్మని సుంతవార్త యటు దివ్యుల కంపిన జాలు వారు కో
శొమ్మని యీయ దామయిరి కోరిక చెట్లుగ లోకమంతకున్॥ 143

పుష్పకమెక్కి రాము డటు పోవుట వచ్చుట రెండు వార్తలే
పుష్ప సుగంధమట్లుగనె పొక్కిన నంతె ప్రజాళి మోదపున్
బాష్పము లొప్ప దృప్తులయి పండిన పంట భుజించినారు వా
క్పుష్ప సమర్పణంబులను బూజితు జేసిరి రామ భూమిపున్॥ 144

పూవు కనరాదు పరిమళం బావులెత్తు
ఫలము లభియించు నేమి కావలయు నింక?

రాముఁ గానక యుండియుఁ బ్రజలు వాని
భావముం బట్టి కనిరి సాఫల్యమెంతొ! 145

అంతర్యామిత రామునందు నిజమై యాశ్చర్యముం గొల్పుఁ ద
త్స్వాంతం బర్ణవతుల్యమై జనుల కంధంబోదు కానీ యన
ఘాంతర్వ్యక్తి మణి ప్రకాండములు హార్దధ్వాంతముల్ మాపుచున్
శాంతమ్మై వెలుఁగొందు నెల్లరకు నచ్చో నెప్పుడెట్లెచ్చునో॥ 146

రా జగన్మాత్రశ్రమంబున రాత్రి గడపి
వచ్చినట్లును వచ్చిన వ్యవధి లేక
తమ్ములం బిల్చి ఋషుల నందఱను భక్తిఁ
బిలచికొని రాఁగఁ జెప్పి పంపించినట్లు 147

తెలిసె నెల్లర కెందుకో తెలియరాదు
ఊరు నూరెల్ల నానాఁటి నుండియో య
నంత చైతన్యమంది నట్లగుట నిజము!
ఎచటఁ జూచిన నుత్సవం బేచు కళయొ॥ 148

జనముల్ కూడుదు రధ్వరమ్ము కననో సప్తాహ సద్గాథలన్
విననో చిత్తము లూర్జితంబులగు సద్విద్యాశ్రమం బెంచ నో
మనముల్ సందేశి చాక్షుష క్రతువులన్ మన్నింపనో కూడి వీ
డిన యా పిమ్మట యోగముల్ కనుటఁ బండెన్ బంట లవ్వారికిన్ ॥

వేద మిహమ్ము నీయదని వెఱ్ఱుల యూహయెకాని వారలా
మోదిత సర్వభోగులయి మోక్షపథంబున సంచరించి ర
వ్వేద మిహమ్ము సర్వమెట విచ్చుచు నున్నదొ దానిఁ దెల్ప న
య్యాది నెఱింగినన్ ఫలము నందుట తేలికయౌట నెంచుచున్ ॥150

వలసిన నీళ్ళు బావియిడఁ బానము సేయుచుఁ గూరుచున్నచోఁ
దెలివియె? వర్షముల్ కురియు తెల్వి గడించుట తప్పిదంబొ? యా
తెలివి నశించినందున నె తీసెడి గోతుల నీరు లేక వి
హ్వాలత భజించు టొక్కటియె పద్ధతియౌను పరాస్తబుద్ధికిన్॥ 151

రామస్వామి వినీలమేఘమయ వర్ణాభ ప్రభారాశి ది
వ్యామోదమ్ము సమృద్ధిగాఁ బడయు ప్రోవన్ దమ్ము దిద్దంగ నా
భూమింబందు కొఅంతలేని బ్రదుకై వర్ధిల్లుటే కాక త
ద్భూమ బ్రహ్మపదంబు నందికొని సంపూర్ణాప్తులై రా జనుల్॥ 152

రాముఁడు తత్ప్రజా హృదయ రాజ్యము నేలు విధానమే కనం
బోము మఱొక్కచో నతఁడె మూల విరాట్టగు సర్వనీతికిన్
దా మను రీతియే ప్రజకు దారినిజూపుఁ బ్రశస్త లక్ష్యమై
రాముని యిష్టముల్ తెలియరా నటె పోదురు ప్రీతి నెంచుచున్॥ 153

ఆతఁడు చారచక్షువయి యంతట నుండి యెఱుంగుచుండు సం
ప్రీతిని గూర్చు సత్కృతులు పేర్చినచోట స్వయాన నిల్చి ని
ర్యాతుఁడుగా నహో యిటకు రాముఁడు వచ్చెను సత్కృతింగనన్
బ్రీతి నిదే విధంబుగను రే పటువచ్చు నటుల్ చరింప నౌ॥ 154

అనుకొని యట్టులే నడవ నందఱు యిండ్లకుఁ బోయి తృప్తులం
గని ముదమందుచుండు నొక కార్య మనిష్టముగాఁగఁ దోఁచినన్
జనములు చారవాక్యముల సత్యమెఱింగి నివృత్తి గాంతు రె
వ్వనిని నుపేక్ష సేయు టను వార్తయె యుండదు రాజ్యమందునన్॥

రాజై రాముఁడు కొల్వుతీర్చినది ధర్మ ప్రశ్నమున్నప్పు డ
వ్యాజ ప్రస్తుతి చేసి యుత్తముల లక్ష్యంబంచు చూపించు స
త్పూజా భాగ్యము పట్టినప్పుడు తపస్వుల్ పెద్ద లేరైన వి
భ్రాజద్ధర్మ మెఱుంగఁ జెప్పుటకుఁ దాత్పర్యాబ్ధులైనప్పుడున్॥ 156

సభ తీర్పున్ బని పట్టె నన్నను విశేషం బుండి తీరున్ వృథా
రభసం బెప్పుడుగాదు తీర్చిన సభన్ రాద్ధాంత మున్నీతమై
యభయం బిచ్చు జనాళికెల్లరకు సర్వాంశంబులున్ స్పష్టమై
ప్రభలం జిమ్మఁగ దార్ఢ్యమొప్పఁ జను తద్రాజ్యంబు శస్తంబగున్॥

నిశ్చితమైన లక్ష్యమది నేతకు భూప్రజ కొక్కటై పునః
పశ్చిమ బుద్ధి నెంచని విపశ్చిదుపార్జిత నీతి వెంట ధీ

నిశ్చయ మొప్పనేగెడి మనీషులకెందు జయంబె కల్గెడిన్
కశ్చన లెవ్వరున్ గణుతిగాంచరు ధర్మ వినిర్ణయంబులన్॥ 158

రాముని చారులెల్ల రనురక్తులు రాజునెడన్ విశిష్ట వి
ద్యా మహితుల్ సురారులకునైన రహస్యము తేలనీక లో
కామయ వారకంబులగు నాప్త వచస్సుల వ్యాప్తిఁ జేయుచున్
రాముని తత్త్వ మెల్లెడల రాజిలఁజేయు మహానుభావులున్॥ 159

చారువివేక సౌరభ లసన్మహనీయ మనోంబుజాత సం
చార జనాళి తామగుచు సంస్కృతి నిర్వహణ ప్రవీణులై
సారతమాచ్ఛధర్మ శుభసంపదలన్ దులదూగుచుందు ర
వ్వారలు విశ్రుతుల్ ప్రజకువారె ప్రమాణము లన్ని రీతులన్॥ 160

వీరు చారులన్న వివరమే తెలియదు
పౌరులందు తామపార గౌర
వంబునంది కొంచు వర్తిల్లుచుందురు
రాము నెడఁదలన్న రాణనుంద్రు॥ 161

ఇదివఱకే రఘూత్తముఁడ దెంతొ మహోత్సవ మొప్పఁజేయు న
భ్యుదయ కుమారమంగళము పొంటెఁ బురంబున నన్ని ప్రాంతముల్
సదమల సుప్రభాతములు శ్రావణ పూర్ణిమనాటి ప్రొద్దుటన్
మది కది తృప్తి రామునకు మన్ననసేసె నితోధికమ్ముఁగన్॥ 162

గర్భిణి సీత లక్ష్మణుఁడు కానలదింపి పురంబు చేరు నా
దుర్భర దుర్దినంబెటులొ త్రోసిన రాముఁడు నాటి ద్వాదశిన్
నిర్భర దుఃఖ మొడ్డిగిలి నెమ్మది నంది యనంతరంబు తా
నర్భక యోగమెంచి వ్రతమాచరణం బొనరింప నెంచుచున్॥ 163

ఆ సంవత్సర మా యయోధ్యగల వత్సానీక మింటింటఁ ద
న్మాసం బందుదయించు వారలకు క్షేమస్థైర్య భాగ్యాది సం
తోషం బబ్బెడునట్లు పూజలను దృప్తుల్ చేసెఁ దత్పూర్ణిమన్
వేసాలెన్ని వహించినన్ దుదకుఁ దృప్తిం బొందువాఁ డొక్కఁడో॥

మఱు సంవత్సరమేఁడు నిండిన శిశుల్ తన్మజాని పూజాదరం
బరుదారం గొనఁజాలి రాత్మజనకాత్యంత ప్రమోదమ్ముగన్
దరువాతన్ బ్రతి వత్సరం బిటు స్వసంతానమ్ముతో నీడు వ
త్సరనం దోఁచెడి బాలబాలికలు తృప్తుల్ గాఁగఁబూజల్ గొనన్॥

గర్భైకాదశమందు క్షత్రియులు సంస్కారంబు పొందన్ ద్విజా
విర్భూతిన్ గను వేళ రాము నెదలో స్వీయార్భక ప్రీతి ప్రా
దుర్భూతంబయి యున్నియేఁడు లోక యెత్తున్ దానొకెత్తై ముదా
విర్భూతిన్ దివిజత్వమే యెసఁగె నవ్వీటన్ బ్రజాకోటికిన్॥ 166

పదునాక్కేఁడులు సీత యెచ్చటనో యే వాత్సల్య పూర్ణాత్మ నో
ప్పిద మానాశ్రమమందొ సంతతికి సద్విద్యా పరిశ్రాంతిఁ గూ
ర్చి దిదృక్షామతి క్షేమమ్మై మను మనస్సైగాని నిర్ణీతిగా
నెదియున్ నేరని రామచంద్రునకు నా యేడాది తల్లబ్ధియై॥ 167

పది రెండేఁడుల బాల బాలికలు నే వర్ణంపు వారైనన స
మ్మదముం గూర్పఁగ జానకీ ముఖపు సొంపుం జాయ లెందైనఁ దా
మొదవం బోలు నటన్న యాశ నయనాం శూద్గారి సర్వస్వమై
వెదకున్ వెంటనె త్రిప్పి కొంచరుగు నుర్వీజాని మేలెంచుచుఁ॥ 168

ఇది యొక లీల యీ జగతి నెవ్వరు నెవ్వరి కేదికాక బు
ద్బుదములవోలెఁ బుట్టుచును బోవుచు నున్న క్షణంబు సంధి యం
దదికిన మోహమై యొకఁ డహంకృతి నందుచు నాది నాదనన్
బ్రదుకున దుఃఖముఁ విరియ బాఱిన మోదముగాఁగ నొప్పెడిఁ॥ 169

తన బిడ్డల్ కనరాక రాఘవుఁడు తత్ప్రాయంబు నందున్న వా
రిని బిడ్డల్ బలెఁజూచుచోఁ దనను వారింబట్టి లోకానికిఁ
ఘన మోదంబిడె నంతె కా కెచట నిక్కంబుండిరో యచ్చటఁ
గననయ్యెఁ ఘన మోద మియ్యదియె సౌఖ్యంబౌన యేకాత్మకుఁ॥

ఏతచ్ఛ్రావణ పూర్ణిమా దివసమం దెచ్చో ద్విజ బ్రహ్మగ
వ్రాతంబుల్ గుమిగూడి దేశికులు తీర్పఁ దా ముహా కర్మచేఁ

జేతః పక్వత నందుచో ముదము గాంచెన్ రాఘవుండంత నా
సీత బ్రహ్మ ఋషీశ్వర ప్రతతి యందించెన్ మహామోదముల్॥ 171

భరతుండు లక్ష్మణుండుం జని భక్తి సమర్చ లొనర్చి ధారుణీ
శ్వరు మనవిన్ నివేదనము సల్పం బ్రియంపడి వారలెల్లరున్
నరవరు శ్రద్ధతోన్ ముదమునన్ దని వందుచు వచ్చిరన్న సం
బరమున రాముండా ఋషుల పాదములన్ శిరసుంచి మ్రొక్కుచున్॥

మీరల్ సత్కృప నాదు విన్నపము నెమ్మిన్ బూని విచ్చేసి నా
రీ రాజ్యంబున కంతకున్ బ్రభువు లీ రీమీ మహాజ్ఞంబడిన్
శ్రీరాముం డొనరించు సర్వహుణ మీ సేవామతిన్ నన్ను ధ
ర్మారంభంబున నుంచి కావవలెనయ్యా! మీరె ధర్మప్రభుల్॥ 173

నలువుర మన్నదమ్ములము నాయన మూర్తుల మేము తండ్రి ని
స్తులమగు వేదధర్మమును సూరి మహాజన సమ్మతంబుగా
నిలిపిన కీర్తిశాలి రజనీచర సంఘము తోడి యాజులన్
గెలుపు సురల్ గొనంగం బరికించిన ధార్మికుం డొజబంతియహా॥ 174

అఱువదివేల వత్సరము లార్య నుతంబగు రాజ్యమేలె ని
ద్ధరం బితృ తుల్యులైన నృపధర్మ మహిష్ఠులు కానరారు మీ
రెఱుంగని మాట కాదిది మఱేమును వారుగ నశ్వమేధముల్॥
జరుపంగ జన్మమందితిమి జన్నము నేనును జేయనెంచెదన్॥ 175

సంకల్పం బిది మున్నె కల్గిన దగస్త్య స్వామియున్ మొన్న నా
శంకల్ మాన్పి యవశ్యమియ్యది వెసన్ సన్నాహముల్ సేయు మా
తం కాపేతముగా ఫలించునని ప్రోత్సాహించె మీరెల్ల రీ
వంక న్నన్నుం గృతార్థుం జేయవలె సర్వశ్రేయముల్ పొందంగన్॥

అన్ని జన్నంబులకు మిన్న యశ్వమేధ
మదియు నత్యంత శ్రద్ధ మహానుభావు
లైన మీ బోంట్లు సాయమై యండ నిలువ
నిర్వహింపగం దగును మన్నింపుండయ్య॥ 177

ఏ మిమ్ము నాశ్రయించితి
నీ మహితాధ్వరము నిర్వహించు శుభేచ్ఛన్
దా మంది నన్ను దీక్షితు
క్షేమమ్ముగ నొడ్డు నెక్కఁ జేయుఁడు కరుణన్॥ 178

అని యెంతో వినయాన విన్నపము సేయన్ మౌని సంఘమ్ము నం
దున మౌనమ్మున నిస్తరంగ ఘన సింధుంబోలె గంభీరుఁడై
తనలోఁ దానగు నవ్వశిష్ఠ మునిమూర్ధన్యుండు శ్రీరామ చం
ద్రుని ప్రేమంబున గాంచి నేత్ర సుషమాతోయంబులన్ దేల్చుచున్॥

వత్సా! రాఘవ! సాధుజీవ సుకృత ప్రాప్తాత్మదేహా! మహీ
భృత్సంరక్షక నశ్వమేధముఖ మావేల్మిన్ సమస్తాఘ జా
లోత్సన్నత్వము నంది శుద్ధుఁడవుగా నుర్విన్ బ్రశస్తాచ్ఛ ధ
ర్మోత్సాహంబున వాలి యేలెదవు సర్వోపాస్య దైవంబవై॥ 180

రావణ జేతవై తిరిగి రా నపుడే యనుకొంటి, నన్నియున్
గా వనుకొన్న యట్టులు సుఖప్రసవంగని సీతఁ బిమ్మటన్
నీవిది చేయఁగా వలయు నేత కవశ్యమటంచుఁ జెప్పి నీ
చే విధి చోదితంబుగ రచింపఁగఁ జేయుదు నంచు నెంచితిన్॥ 181

ఆయమ నట్లు కానలకు నంపఁగ నే మటు ఋశ్యశృంగు స
త్త్రాయిత భూమియందె మననాయెను నిన్నటిదాఁక నేఁడు రా
నాయెను నీదు విన్నపము నంది మతేనిటు వచ్చునప్పుడున్
మాయిలు వెల్గఁజేయు ముది మౌనిని తా నిటు రాన నెంజుమీ! 182

ఎంత తపస్విని జనగజేశ్వరి యయ్యును సీత దుఃఖమున్
సుంత సహింపఁజాలని ప్రసూన మనస్విని యాటఁ దత్త్వమొ
క్కింతయుఁగాన నెంచదు మహీతనయామణి క్షేమ మెంచుచున్
స్వాంతము నందు నిన్ను నెడఁబాయని వానిగఁజూడ నెంచెడిన్॥ 183

నాకం జూఁడగ నీవు నీ మఖమిట న్నాకుండఁ దన్నెన్నమి శా
స్తోక క్షేత్రము గోమతీ తటిని శుద్ధుండై వ్రతంబూనఁ బ్ర

త్యేక ప్రాభవ మొప్పి శీఘ్ర ఫలదాయింగా శుభంబౌట యే
కాకచోటికి నెల్లవారలును రాఁగా వీలుఁగా దోఁచెడిన్॥ 184

పూర్వేక్ష్వాకులు తాము జన్మముల నెప్డున్ బట్టణప్రాంత వే
ణ్యార్వాగ్వేలము వెంటఁ జేయుటది తథ్యంబయ్యె నీ పొంద నౌ
సర్వశ్రేయము పొంటె మార్పిది యవశ్యంబంచుఁ దోఁచున్ దప
స్సర్వస్వ ప్రవిదాన శీల ముని వాసంబందు రాగోమతిన్॥ 185

అని గురుఁడాడ రామవిభుఁ డాగురుపత్ని యెడంద సీతకై
కనెడి తపస్సు నెంచుచు జగజ్జననీ సమమైన యామె రా
కను మది గోరియైనను మఖంబును గోమతి యొడ్డునందె చే
యను వలెనంచు నిశ్చయము నంది కృతజ్ఞతఁ గేలుమోడ్చినన్॥

జాబాలి రాముఁ గాంచుచు
బాబూ! గురుహృదయ నిబిడ భావము కంటే?
సాఁ బాలు కష్టసంతతి
కాఁబోలదు క్రతువు చేయఁగలిగియ యున్నన్॥ 187

జగమిది యంత్ర తుల్య మగు జాఱుట దానికి నైజ మెప్డు నే
తగ నొకఁడుండి యెప్పటికి దానిని మాటికిఁ దొంటి పాటునన్
దగ నిలఁబెట్టుచుండవలెఁ దత్క్రియకైనది యశ్వమేధ మం
తగ ఫలమున్ వచించు శ్రుతి తత్పరతన్ గ్రతుదీక్షఁ బూనుమీ!

జాఱినఁ జక్కదిద్దుటకు జాలక యుండఁగఁ జూచి కొంటకున్
వారయదెంత? భూవిభుఁడు పాల్యజనాళి మనఃప్రదోషముల్
తీఱఁగ దీని భక్తిమెయి తీర్చుచు నుండిన నన్నదమ్ములా
క్రూరమృగాళి వైఖరి నరుల్ బలె నుండెడివారు కారహో! 189

క్రతు సంస్కారము నందకుండు నెడ నారణ్యోగ్ర జంతు స్వభా
వత జీవాళికిఁ గల్గుచుండునట యవ్వాలిం గనుంగొంటి, మా
క్రతు విధ్వంసకు రావణుం గనెడి భాగ్యం బబ్బె వా రన్నలా?
మతు లట్లౌటకు హేతువున్ దొలఁచు నీ మాన్యాధ్వరం బెంతయున్॥

పరితో జ్వాలల వహ్నిఁ జొచ్చి నవపుష్పం బట్లు క్షేమమ్ముగా
సుర సంఘమ్ములు చూచుచుండ వెలికిన్ శుద్ధత్వ మాహాత్మ్య ని
ర్ఝరయై వచ్చిన సీతఁ గూర్చి యిటు విశ్వాసంబు లేకుండు ని
ష్ఠురతల్ మానవులందు హెచ్చుటయుఁ జూటున్ యజ్ఞక ర్తవ్యతన్॥

నమ్ముట నమ్మినట్టి సుజనమ్ముల వంచన సేయకుండుటల్
క్రమ్మిన యట్టి దేహ మొడికమ్ముగ నుండదు దీనిఁ బట్టి ని
క్కమ్మగు నాత్మనందవలెఁ గాయపు లక్ష్యమెయద్ది యంచునున్
నమ్ముట మానవాళికిది నైజము తప్పట జంతు తత్త్వ మా॥ 192

నరజాతిన్ నరలక్షణంబు చెడకుండన్ గాచి చిత్తమ్ములన్
సరిదిద్దన్ హయమేధ మొక్కటియె దక్షంబౌను రామా! మహో
ద్వర మిద్దానిఁ బొనర్ప యత్నము సమృద్ధంబై చనంగా వలెన్
దురగం బొక్కటి కాదు జంతువులు తోడ్తో నేడు నూర్లొప్పెడున్॥

మున్నా ళేబది ఘోరకానన పశుల్ ముఖ్యంబులౌఁ బట్టి తే
నెన్నా ళ్లైనా సజీవబద్ధములు ప్రత్యేకంబు నొక్కొక్క రీ
తిన్నానా గతులన్ జరించునవి బంధింపించి యుంచంగ నౌ
జన్నంబందవి సంస్కృతంబులయి నైజ ప్రాభవం బందెడిన్॥ 194

పురుష వ్యాఘ్రము మున్నుగాఁగలుగు మెల్పుంజూపి తేనైన య
బ్బురముల్ చాలఁగనుండు వానిని దృఢంబుల్ బోనులందుంచి య
ధ్వర భూమిన్ బరిరక్ష సేయవలె శ్రద్ధాభక్తు లొప్పారి ముం
దఱగాఁ బూనక యున్న సాధ్యపడ వద్దావన్ బ్రయాసంబగున్॥ 195

వానిం జంపరు వేదచోదితముగాఁ బర్యగ్ని కార్యప్రధా
నూన ప్రక్రియ సంస్కృతింగని పునస్స్వత్తే జనం బంది యం
తానన్ జాతికి మేలుగూర్చు నిఁక నానా గ్రామ్యజంతూత్కరం
బైనన్ మూఁడు శతంబు లర్వదియు మేధ్యమ్ముల్ ప్రయత్నమ్ము మై॥

తమతో పాటుగఁ దామురానయిన మందంగళ్లు నన్నింటికిన్
బ్రమదం బొప్పఁగఁ బాశవార్తి వదలింపంగల్గు నిక్కమ్ముగన్

ప్రముఖంబైన తురంగమం బొసఁగు సర్వశ్రేష్ఠ విశ్వాత్మక
త్వము సర్వోత్తమ మశ్వమేధమగు శ్రద్ధన్ దానిఁ జేయందగున్॥

జాబాలి యిట్లు పలుకఁగ
నా బౌద్ధము వినిచి నట్టి యతఁడే యితఁడా
యీ బుద్ధి నిశ్చయమ్మున
కాబికిరపు వాదమునకు నతుకదటంచున్॥ 198

రాముఁడు సంతసించి మధురస్మిత ముగ్ధ ముఖారవిందుఁడై
మోమర వాంచి మ్రొక్కెఁదన ముందగు రాముని వామదేవుఁడ
ద్ధా! మహనీయ మంజుగుణధామ! రఘూత్తమ! మంత్రివర్యులన్
బ్రేమను బిల్చి యత్న మొనరింపఁగఁ బంపుము నేటి నుండియే॥ 199

సన్నాహం బొనరించి చైత్రమున నశ్వంబున్ విసర్జించుచో
నిన్నేలన్ జరియించి వత్సరము సుస్వేచ్ఛన్ యథాస్థాన మం
దున్నిద్రస్థితి నిల్వ నాఁడు మొదలై యొక్కఁడు పూర్ణంబుగా
నెన్నో వేల్పులు సాఁగఁగా వలయు రెండేండ్లొప్పు దీక్షా విధుల్॥ 200

ఆ రెండేండ్లును రాజు దీక్షితుఁడు రాజ్యంబెల్ల నధ్వర్యుఁడే
సారంబందున భూపుఁడై మెలఁగి రక్షం జేయఁగా నౌను సం
భారంబుల్ సమకూర్చుకొంటకును వేశ్మంబుల్ వినిర్మింప నా
నా రాజన్యుల బ్రాహ్మణోత్తములఁ గానన్ బిల్వఁ బూనన్ వలెన్॥

ఊరక యన్న వెంట నగునో యివి యన్నిటి కందఱుండి యె
వ్వారెది నిర్ణయించికొని వానిని వారు సమగ్ర దీక్షతోఁ
దీరుప జాగరూకు లయి తేలెడి లోపము లప్పుడప్పుడే
తీరుచు శ్రద్ధఁజూప నొక తీరు కృతార్థత నందనయ్యెడిన్॥ 202

పశువుల సేకరింపవలె వస్తువులన్ సమకూర్చుకోవలెన్
వసతుల నేర్పరింపవలె భక్తిమెయిన్ యజనంబుఁజూడ న
ద్దెసలను బట్టి వచ్చు నతిథి ప్రకరంబుల కెట్టి లోటు నుం
బొసఁగని యట్లు సిద్ధపడి పూజ్యత నందవలెన్ జగమ్ముచే॥ 203

ఇప్పటినుండి హెచ్చరిక నేత్రైఅఁ జూపినగాని చైత్ర మా
నప్పటి కన్నియుఁ దెమల నందున నీయజనంబు నందెనో
చొప్పడు ఛిద్ర మంచుఁ జొఅఁ జూతురు వేత్తలు బ్రహ్మరాక్షసుల్
చొప్పడె నేనభద్ర మగుఁజూ యజమానికి లోకమంతకున్॥ 204

కావున జాగరూకతను గల్పము చెప్పిన రీతి నన్నిటిన్
దావునఁ జేర్చి లక్షణ యుతంబగునశ్వము, నల్ల యిత్తి బోల్
మావు ముఖంబునన్ దెలుపు మచ్చ కిరీటము వంటిదొప్ప నీ
భూవిభు నాత్మతా ననెడి పొల్పు వహించిన దానిఁ దేవలెన్॥ 205

అల ప్రజాపతి కన్నుబ్బి తొలఁగి పడగ
పుట్టినది యశ్వ మద్దాని బట్టి యశ్వ
మేధ మొనరింప నతఁడు నుత్సేధమందెఁ
గాన క్రతువిది పూర్ణత్వ కారణంబు॥ 206

బ్రహ్మ హత్యాది ఘనపాప పంక మడఁచి
దీక్షితున కిదియుఁ బ్రజా పతిత్వ మొసఁగు
శ్రద్ధ నొనరింప నౌను రాజన్య వరుఁడు
తనకు జగతికిఁ గూర్చు హితమ్ము పొందె॥ 207

అందఱకు సాధ్య పడదిద్ది యమిత కష్ట
సాధ్య మగుటను నీకు సుసాధ్య మగును
ఇంకనుం జాగ దేల రప్పింపు మిపుడె
మంత్రి వరుల నియోగింపు మాన్య మతుల॥ 208

అనియెడి వామదేవు హృదయమ్ము గ్రహించిన లక్ష్మణుండు రా
ముని దెసఁ జూడ నాతఁడును మ్రొక్కి పురోధకుఁ గాశ్యపుంగనన్
మునివరుఁ డాతఁ డిట్టులనె మోదము గూర్పుము రామచంద్ర వెం
టనె క్రతు యత్నమూని యొకటన్ జడియన్ బనిలేదు నీకిటన్॥
సీత పరోక్ష సంస్థితయె చెంద దనర్హత దానిచేత వి
ఖ్యాత హిరణ్మ యావనిజ కాంతగ ధర్మము సాగుచుండె నా

సీతయె యిందు మూఁగురయి చేయును యజ్ఞ విశిష్ట ధర్మముల్
నాతులు మూఁవు రుండవలె నా కెటు లౌనని జంకఁబోకుమీ॥ 210

తీర్పుఁడ వీవు ధర్మమునఁ దీర్చిన తీర్పగు నీదు నేక ప
త్నీ వ్రత మట్లు సాగవలె దేహముతో సతి చెంత లేని వో
నీ వ్రత మెట్లు సాగినదొ నేఁడును నట్టులె మూఁడు మూర్తులై
సువ్రత! యజ్ఞకర్మమున సుందరి నిల్చి ఫలమ్ము కూర్చెడిన్॥ 211

కానఁ గడంగు మింక నని కాశ్యపుఁ డాడగ రామచంద్రుఁడ
మ్లాన ముఖాబ్జుఁడై యనుజు నంపఁగ వచ్చిరి మంత్రులెల్లరున్
ధీనిధి వారిఁజూచి జగతీ పరిపాలన దక్షులార! మి
మ్మూని, గడింతు ధన్యతనహో మతిమంతులు మీర లెల్లరున్॥212

హయమేధం బొనరింప నౌననుచు బ్రహ్మర్షుల్ దయాదృష్టి నా
జ్ఞ యొసర్పన్ మిముఁ బిల్వ నంపితిని యజ్ఞంబద్ది సర్వోత్తమం
బయి భూపాలకుఁ డెంత వాఁడయిన మేలౌ శ్రద్ధఁ దీర్పం దగున్
నయవేత్తల్ మఱి నాకు మీ రయిన సన్నాహంబు సేయన్ వలెన్॥

సువిశాల మ్మగు గోమతీ తటము సంశోధించి యచ్చో ప్రశ
స్త విధిన్ యజ్ఞగృహమ్ములున్ ముని నివాసంబుల్ దిదృక్షాగత
స్తవనీయాతిథి వాసముల్ వివిధ వేశ్మంబుల్ వినిర్మింపఁగా
నవు రెండేండ్లట నుండఁగా వలయుఁగాదా సర్వాలాసక్తిమై॥ 214

ఏ లోపమ్మును లే నటుల్ వసతు లెన్నేఁ జేయగా నౌను దే
శాలం బట్టి జనమ్ము వత్తురు దిదృక్షాబుద్ధి నెవ్వారు గా
నీ లోటంచుఁ దలంపరాదు స్వజనంబే యన్న చందాన డెం
దాలన్ మోదమునంద సర్వమును శ్రద్ధన్ గూర్చి యందింపనౌ॥ 215

ఏ యే వస్తువు లెంత యెంత వలెనో యే కొంచెమో యెక్కువే
మై యున్నన్ దిగులుండఁబోదు, పురిదాపై లేదు, సర్వమ్ము నం
దే యుండన్ వలె దేనికిన్ సమయమందే మాత్రమున్ బర్వాలం
దీయంగా నగు చిక్కు పుట్టఁదగ దెంతే ముందు చూపుండనౌ॥ 216

మీకేఁ జెప్పెడిదేమి రాజ్యమిది నెమ్మిన్ సాగు మీ నేర్పుమై
సాకేతావని యజ్ఞ కర్మముల దీక్షన్ ధన్యతన్ జెందె మీ
రా కర్మిష్ఠులు వేద వేత్తలు మహా యజ్ఞంబు సద్యః ఫల
శ్రీకంబౌనటు జాగరూకతను వాసింగూర్పెఁ డత్యంతమున్ ॥ 217

రావణ జేతృ గౌరవము రామునకున్ గడియించి పెట్టు సు
గ్రీవ విభీషణాదులను ప్రేమను బిల్వఁడు వార లెల్లరున్
రావలె నధ్వరంబుఁగన రాజుల, విప్రుల, వైశ్య శూద్రులన్
భూవిభు ధన్యుఁ జేయు తలఁపుంగని రండని పిల్వఁబంపుఁడీ 218

అన్నిటి కింకఁ దీర్పరి మహర్షి వశిష్ఠులె వారి యాజ్ఞ యె
ట్లున్న నటుల్ సమస్త మగుచుండుగఁ బోలును దీక్షనందు చో
నిన్నృప ధర్మ నిర్వహణ మెట్లును వారికె చెందు నేఁడె మీ
రెన్నుఁడు వారి భూపతిగ నేది వచింతురో యద్ది చేయనా॥ 219

అని వినయాన మౌనివరు సాంజలి యౌచు నమస్కరించు రా
ముని గని సర్వులున్ ఋషులు మోదము నందుచు నధ్వర్వంబు వెం
టనె ఫలవంత మౌనను నెడందల దీవనలిచ్చి రాము దీ
క్షను గొని యాడుచున్ జనఁగ స్వాశ్రమ వీథుల కంతరాముఁడున్ ॥

కుల గురు నాజ్ఞ నొంది తన కూర్మి యమాత్యులు ప్రత్యహంబు తా
మలపు గణింప కంతవఱ కర్మిలి చేసిన యత్న మంతయున్
దెలుపుచునుండ ముందుగనె తీర్చిన పద్ధతి రాజ్యమెల్ల నై
దొలఁగక సాగుచుండ నెటు తొందర లేని ప్రశాంతచిత్తుఁడై॥ 221

అధ్వర భావనా మహితమైన యెడంద పవిత్రతన్ గనన్
విధ్వతి శాయి దీధితుల వెక్కసమై చను నేత్రకాంతులన్
సాధ్విని కాంచనావనిజ స్నాత నొనర్చుచు నిత్య జీవయా
త్రాధ్వగుఁడైన తానెపుడు నాసతి వీడని యట్లె నిల్చెడిన్॥ 222

ఇతరుల కామె బొమ్మ యగునేమొ మహీజయె సర్వమైన యా
పతికి హిరణ్మయాకృతియుఁ బత్నియె యౌను సచేతనమ్ముగా

హితమును రామణీయకము నెప్పుడు నోచును సర్వవేళ లం
దతివగ వెంబడిన్ నిలుచు నట్టులె తృప్తిని గూర్చుచుండెడిన్ ॥ 223

సీత యొకర్తె మూఁపురుగఁ జెందగ నొనను కాశ్యపోక్తి సం
ప్రీతిని గూర్ప యజ్ఞవిధి భిన్నకృతుల్ నెఱవేర్చుపొంతె వా
వాతగ నొక్క మూర్తియును బైఁబరివృత్తిగ వేఱుమూర్తి ని
ర్మాతలు తీర్చి తేర రఘురాముఁడు వాని ముదానఁ గాంచుచున్ ॥

సీత చరిత్రయున్ ద్రివిధ చిత్రము జన్మపు భూమి నున్న యా
సీత యొకండు, వెల్వడి విశిష్టత జానకియైన దొక్కఁడున్,
ప్రీతినిగూర్చి ధర్మగతి వెంబడి నుండు విదేహజాత వే
త్రై తగు దానికిం దగిన యట్టులె మూర్తులు మూఁడు నొప్పెడిన్ ॥

ఈ తొలి మూర్తియే మహిమ యీమెయె జానకి పట్టునుందె, వా
వాతయె సీతయా పృథివి పట్టిగ నుద్భవమందె; గానన
వ్రాతము వెంబడించి తనపట్టు ప్రతిజ్ఞకు దీటుగాఁగ వి
ఖ్యాత విదేహజాత యనఁగాఁ బరివృత్తిని బొందె దీక్షయై॥ 226

మూఁడును బొమ్మలయ్యు మును ముందగు సీత సమక్షమందు నా
ఱేఁడు శిశుత్వమంది యెద ప్రీతి వహింపగ నిద్రపోవు, నూ
టాడఁగఁ జేయు జానకి నెడందను హత్తి ముదంబునందు, వె
న్నాడు విదేహజన్ వివశుఁడై వహియించుచు సిద్ధి నందెడున్ ॥ 227

ఏకాంతంబున రాముఁడీ పగిది శ్రీప్రీంభూప్రియాశ్లేషమా
ధ్వీకం గానుచుఁ జేయు చేఁతలకుఁ దృప్తిన్ బొంది సౌమిత్రి ల
క్ష్మీ కాంతుండని భక్తిసంభరితుఁడై సేవించు నన్యుల్ ధరి
త్రీ కాంతున్ రఘురామునే కనుచు భక్తిం గొల్తు రెల్లప్పుడున్ ॥

మేధీయాశ్వము సర్వలక్షణయుతిన్ మిర్మిట్లు గొల్పెన్ మహో
త్సేధ స్నిగ్ధమనోహర ద్యుతులతో దీర్ఘాస్య మధ్యస్థ సం
బాధ శ్వేతకిరీట చిహ్నమున నభ్రశ్రేష్ఠ మజ్జాంశువై
వేధో నిర్మితి సశ్వమై దగియెనా విచ్చేసె నచ్చోటికిన్ ॥ 229

తను వెల్లన్ గనులైన చూడఁదగు నద్దానిన్ గనుల్ రెండుగాఁ
దనివిం జెందక పౌరులెల్లరును యాతాయాత వృత్తిన్ బదే
కనుచుండన్ విపినోగ్రజంతు తతిరాఁగా రద్దితగ్గన్ నవం
బన మోజౌటయె యశ్వరాజమున కాహాయూరటం గూర్చెఁబో॥

పురుష వ్యాఘ్రము మున్నుఁగా మును కనంబోనట్టి జంతూత్కరం
బరుదై వచ్చినఁ బంజరస్థముల డాయంబోక చూడంగనౌ
తెరువుం గూర్చి భటాళి హెచ్చరిక పంక్తిన్ దీర్చి నిల్వంగ వా
విఁగాఁ జూచిరి పౌరులెల్లరును దన్వింబోని చిత్తంబులన్॥ 231

ఇన్ని విచిత్ర జంతువుల నేవిధి సృష్టి యొనర్చె వేధ యె
న్నెన్ని తను ప్రభేదములు హింస్రములై కడు భీకరంబులై
యున్నవి దేహశక్తి నివి యూర్జితమైనను మానవుండహో
యన్నిటిఁ బట్టి వైచుఁ దనకైన మహాద్భుత బుద్ధి మేటియై॥ 232

జలచర జాతులన్ దమకుఁ జాలిన పెద్దమడుంగులందు వి
చ్చలవిడి సంచరింపవిడి, చట్టుప లొప్పెడి పక్షిజాతి నుం
జుల ధరణీజ సంతతులఁ జూడ ముదంబగు నట్టు గట్టి, నే
లల బడి ప్రాకువాని వలలందగు బోనుల నిల్పి రొప్పుగన్॥ 233

అన్నియు రాజధానికటులాగతి నంది నియుక్తులొప్పికో
నెన్నిక నందినంతఁ గదలింతురు వానిని యజ్ఞభూమికిన్
మొన్నటిదాక బైలగుచుఁ బొల్చిన గోమతి తీరమందు నేఁ
డెన్నగఁ గ్రొత్తయూరె ప్రభవించిన దెంతయు శోభలీనుచున్॥ 234

పంచక్రోశ విశాల పుణ్యధరణీ భాగంబు నందెన్ని యో
చంచత్సుందర పర్ణశాలలును వేశ్మంబుల్ మహాసౌధముల్
పంచారించిన మంచెలున్ విరివియౌ పచ్చాకు పందిళ్లు ని
ల్లించన్ గొంచెము చోటు లేనటులు పెల్లేచెన్ నవాభోగముల్॥

కొలతకుఁ దగ్గ యిట్టికలు గూర్చి రఘూత్తము మేనికొల్త క
గ్గలముగ నిర్వదొక్క మడుగౌనటు వేదిని గట్టి రొప్పుగన్

బలమగు రెక్కలన్ విరిసి బల్లిదుఁడౌ గరుడుండు నేలపై
నిలిచిన యట్టులొప్పె నది నింగికి లేచు న దెప్పుడో యనన్॥ 236

నిర్మాణంబులు సాగుచుండఁగనె మంత్రి శ్రేష్ఠు లత్యంతమున్
గర్మ శ్రద్ధ గలట్టి వారలను ముఖ్యవ్యక్తులం బిల్వఁగా
శర్మా కాంతులఁ బంపి రెందఱనో రాజశ్రేష్ఠుఁడౌ రాము నీ
ధర్మారంభము చూడరా దొడగి రుత్సాహంబు నిల్పోపరన్॥ 237

అశ్వోత్సర్జన మాను చైత్రమునఁ దామా పాటికే చేర నా
విశ్వాసంబున దూర దేశజులు రా పిల్లొంది శైత్యార్తి చే
నిశ్వాసంబులు రుద్ధమై చనెడి గ్లానిన్ సుంత పాటింపకే
యశ్వాదుల్ సవరించి మాఘమున నే యాత్రన్ బ్రవేశింపఁగన్॥ 238

సూర్యుం డాకసమందునన్ దశ దిశాస్తోమంబు లందుండి తా
త్పర్యం బొప్పఁగ రామచంద్రు హయమేధంబున్ గనన్వచ్చు నా
నార్యానీక మహాప్రవాహములు పెల్లై పొంగుటల్ చూచి యీ
సౌర్యుం డౌ రఘురాము కీర్తిరమ కాశ్చర్యంబు నందెన్ గడున్॥

అటు కిష్కింధకు వార్త చేరె నపుడే యాకాశ మార్గాన ఘూ
ర్జటి వై వ్రాలెను హన్మ వెంబడి మహాజాంఘాలికుల్ దూఁకి రాన్
పటు దోర్వీర్యులు వారు వచ్చి రన భూపశ్రేష్ఠుఁడౌ రాముఁ డు
త్కట సంతోషము నంది తానిడియె సఖ్యంబున్ వినీతాత్ముఁడై॥

మఱి రెన్నాళ్ళకు లంకలోఁ దెలిసె రామస్వామిఁ గన్గో నిరం
తరమున్ సంబర మందు రాక్షసులు వందల్ వేలు మూఁగంగ సం
స్మరియించెన్ ఘన పుష్పకం బదియురా సర్వప్రజంగూడి ని
ర్భరుఁడై సాధు విభీషణుం డిఁక భరింపన్ రాదు మోదంబనన్॥ 241

బహుళ చతుర్దశీ రజని వచ్చినచో రఘురాముఁ డూర్జితుం
డహమునఁ బచ్చి నీరయిన నంటక తా నుపవాసముండి రా
త్రి హరుని యామయామమున దీపితభక్తి మహాభిషేక ని
ర్వహణమునన్ బ్రసన్నునిగ వాలిచి నిల్చె శివాద్వయుండు గాన్॥

నాఁడారాముని జూచినట్టి జను లానందంబు వర్ణింప వా
యోడున్ శేషుఁడనన్ దరంబగునె యన్యుల్ దాని నూహింప నా
ఱేఁడే చంద్రుఁడుగాఁగ మిన్నలమి వర్షించెన్ సుధాధారలన్
జేడెత్తన్ శశి మౌళి మౌళిపయిఁ దప్పెన్ జీఁకటుల్ పూర్ణిమై॥ 243

శివరాత్రి వ్రత మాచరించి శుభుఁడై శ్రీరాముఁడా స్వర్ణ భూ
భవతోఁగూడి నిజార్ధ హైమవతితో భర్గుండు నాఁడోఁచెఁ బా
ర్థివ శైవార్చకు లా య యోధ్య జను లర్థిన్ సాంబమూర్తిన్ గనుం
గవతోఁ జూచిన తృప్తి నందిరి యమోఘంబైన పుణ్యంబునన్॥

హనుమంతుం డపు డమ్మ బొమ్మ కడ నున్నట్లుండి శీర్షంబునం
దున నా తల్లి ధరించి తన్మయతఁ జిందుల్ ద్రొక్కె లంకాపురిన్
గని తల్లీ! నినురాముఁ జేర్తుననఁగాఁ గాదన్న లోపఁబు తీ
ఱిన దీనాటికి కటన్న తృప్తిఁగనెఁ బారీభూత చేతస్కుఁడై॥ 245

శివరాత్రితోఁ జలి శివశివా యని యేగెఁ
బందిళ్ళ జన మారు బయలు ప్రాకెఁ
బగలెండ ముదిరి పైఁబట్ట దుర్భర మయ్యె
స్నానమ్ము ప్రియమయ్యె జనములకును
శివలింగ తుల్యతన్ జెలఁగె మావుల పిందె
లర్భకుల్ కొఱికి రయ్యావి గ్రహించి
శిశిర వసంతర్తు వశమైన ప్రకృతి రూ
పొందు చిత్రమ్ము నానందగించె

రామ మంత్రులై సర్వ కార్యములు తీర్ప
మిగులు నవి పూర్తి చేసిరి రగులు భక్తి
సర్వ కపిరాక్షసులు గూడి సరసమతులు
హనుమయున్ విభీషణుఁడు ముందంజ వేయ॥ 246

ఫాల్గుణ శుద్ధమే వెనుకఁ బట్టెను యత్న మదెల్లఁ బూర్తియై
కల్గిన తీఱుబాటుబడి కాలమెటుల్ కొనసాగు నూరిలో

నల్గుట లేల పోదమని నల్వురు సాగిరి యూరి చెర్వ నా
ల్గల్గులు తీసి నట్లగుచు నందఱు పౌ జన ముఖ్యులుండిరన్॥ 247

సర్వా యోధ్య యు గోమతీ తట విశిష్ట క్షేత్రవాసంబు సౌ
పర్వా వాసమటన్న బుద్ధిఁజనఁ బూర్వస్థానముం జేరు వా
రోర్వ్యాం జాలరు వేళ తప్పుట లటంచూహించి యాతిథ్యముల్
సర్వుల్ పొందఁగ నన్ని వీళ్ళులను దీక్షన్ గూర్చిరా ప్రెగ్గడల్॥

అట నిట నెక్కడేన్ సవన మంచుఁ బరస్థలి నుండి వచ్చు వా
రట మట పొందకుండఁ బరమాదర మందుచుఁ దృప్తి నందుటన్
బటు తర కార్య నిర్వహణ బంధురధీశులు రామ మంత్రులన్
స్ఫుట యశమబ్బెఁ బౌరులకుఁ బుణ్యము దక్కెను గొల్చియుండుటన్॥

ఆనందనామకము స
ర్వానంద ప్రదము వత్సరాది యుగాదిన్
స్వానంద నిర్భరుండగు
శ్రీనిత్యుఁడు రాఘువుండు ప్రీతుండగుచున్॥ 250

లవణుం జంపి మునీంద్ర సంఘమున కాహ్లాదంబు చేకూర్చి సం
స్తవనీయంబుగ ద్వాదశాబ్దములు తద్రాజ్యంబు పాలించి భ్రా
తృవియోగమ్ము సహింపఁజాలక 'మనాది'ం బొంది భారం బమా
త్యవశమ్మై చన జన్మముంగన నయోధ్యం జేరు శత్రుఘ్నుతో॥ 251

ఆనందంబున సోదరుల్ నలువు రుద్యద్ధర్మ లభ్యాంజన
స్నానంబాడి మనుష్య జీవిత రహస్యమ్మున్ ప్రపంచించు వ్యా
ఖ్యానంబైవ యుగాది పచ్చడిని గర్మాంగంబుగాఁ గ్రోలి రే
దైనన్ స్వాదువెయయ్యె ధర్మమున శ్రద్ధా స్వీతులై నిల్చుటన్॥

నవ వస్త్రంబులు తాల్చి కాంతలును వెంటన్ రాఁగఁ దమ్ముల్ పురో
భవు రాముంగని వందనంబు లొనరింపన్ దీవనల్ పొల్చు నే
త్ర వికాసమ్ముగ వారిఁజూచి తన చెంతన్ నిల్చు సౌవర్ణభూ
భవలన్ గాంచిన నెల్లరున్ మదుల సంభావించి రా జానకిన్॥ 253

అవనిజ మూర్తులున్ మృదు నవాంబర ధారణ నందగించి యా
ధవు సవిధంబునన్ హృదయ ధామ మహత్తర దివ్య తేజ మా
వివిధ మనోహరాకృతుల వేడుకఁదాల్చి చరించు చొప్పునన్
మివుల వెలుంగ జానకి సమీపమునన్ నడయాడి నట్టులై॥ 254

స్వామియుఁ దమ్ములున్ సతులు సాధ్వి నెడందల నిల్పి యామె సం
క్షేమముకై జగజ్జననికిన్ నతు లర్పణ సేయఁబూనఁగా
నామెయె యీమెగా నుదయమందిన భావము తోఁచి పూజనం
బై మఖ మమ్మ తృప్తిగను నంచుఁ దలంచిరి హృష్ట చిత్తులై॥. 255

హయమేధాగ్ర సమర్చితా! త్రిజగతీ హ్లాదప్రదా! శాంభవీ!
భయ దుఃఖ స్మయ దుష్ట సంసృతి మహాపత్కాంధి నిస్తారక
ప్రియ పాదాంబుజ యుగ్మ! భక్త హృదయశ్రేణీ తమోధ్వాంసి వి
స్మయ కృద్దివ్య మహస్క! సూర్య శశి శుమ్మ ప్రౌఢ తేజస్వినీ! 255

అనుచున్ సర్వ జన స్తుతింగ నెడి లోకారాధ్య విశ్వప్రసూ
ఘన తేజో విభవంబు సర్వగతమై కర్మ ప్రబోధాత్మక
ప్రణయంబంది వెలుంగ ధారణి సుతాప్రాణుండు మూర్తిత్రయా
త్మను వై దేహిని బల్లకిన్ నిలిపి యుత్సాహంబు దీపింపఁగన్॥ 257

శుభ వేళన్ జనె గోమతీతటికి వాక్ శుద్ధుల్ మహామౌని వ
ల్లభు లగ్రేసరులై ప్రశస్త కరిజాలంబెక్కి సాగన్ దురం
గ భటాళుల్ వెనువెంటరాఁగ రథయుగ్మం బందు తా నూర్మిళా
విభుతోఁ దక్కిన సోదర ద్వయముతోఁ బృథ్వీ సుతాయాత్రగన్॥

మంగళ తూర్యనాదములు మంజులమై విను నెల్లవారి ను
ప్పొంగఁగఁజేయ తన్మ విభుఁడు భూసుత కట్లు మహోత్సవంబుగా
మంగళగోమతీ సవిధ మాన్యమఖావనిఁజేరి నంత రా
ముంగని పొంగె నా జన సమూహము సంభ్రమము పున్నమింబలెన్॥

యోగ్యవేళా పరిజ్ఞాత లుర్వి సురులు
సాంగ్రహణి కేష్టి మొదలుగా సవన హయము

విడుచు నంతకుఁ గల్పోక్త విధివిధాన
మించు కంతయు విడక చేయించి నారు॥ 260

హయ చతురంఘ్రి దేశముల నర్పిత మయ్యె హవిస్సు లద్ది తా
నయి యొట కేగినన్ దిరిగి యచ్చటికిన్ బటు మంత్రకృష్టిని
శ్చయముగ వచ్చునట్లు హరుసంబున మౌను లనుజ్ఞ యిచ్చినన్
యయువు విసృష్టమయ్యె నొక హాయన మెల్ల ధరిత్రి చుట్టఁగన్॥

కౌసల్యా సుతుఁడైన రామ విభు నాజ్ఞన్ యజ్ఞ మేధ్యంబుగా
నీ సింధూద్భవ సాగుచున్నయది యుర్వీ శాన ముఖ్యానుజ
శ్రీ సౌమిత్రియె రక్షకుండిట హయస్వేచ్ఛా ప్రచారంబు వ్య
ర్థాశన్ భగ్న మొనర్పఁ జూడకుఁడు కల్యాణంబు మీ కయ్యెడున్॥

ముఖ పట్టో ల్లిఖితంబు కంటఁబడ రాముంగాంచి నట్లౌను నా
నఖ శీర్షమ్మగ భక్తి నమ్రులగుచున్ నానా ధరిత్రీ విభుల్
సఖితం జూపి యమూల్య వస్తుచయ మాత్మోర్జాని కర్పించుచున్
మఖపీఠో మహనీయ కాంతుఁ దెలుపన్ మన్నించి సౌమిత్రియున్॥

తప్పక రండటంచు వసుధా పతులన్ ధరణీ సురాళులన్
జెప్పిన సర్వ ధార్మికుల స్నిగ్ధహృదంతర మొప్పఁ బిల్చుచున్
దప్పట, బద్ధమాట, రుజతాకుట యెచ్చట లేక స్వేచ్ఛమై
త్రిప్పి హయంబు వత్సరము తీఱు నన్ మఖభూమి లక్ష్యమై॥

వచ్చుచుండ గోమతీ ప్రాంత యజ్ఞ
వాటి నెల్లరు నొకవంక వాజి నెదురు
చూచుచు న్నిత్య మచ్చోటి సుకృతకార్య
ములను గాంచుచు మోదముం బొందఁ గనిరి॥ 265

అశ్వోత్సర్జన మైననాటికె సమస్తాశావకాశ స్థితుల్
విశ్వాసమ్మున వచ్చి చేరి రటకున్ విశ్వేశుఁడౌ రాముఁడీ
శశ్వ త్సౌఖ్య శుభావహంబయిన యజ్ఞ శ్రేష్ఠముం జేయు నేఁ
డాశ్వాసంబు లభించు జీవతతి కాహాయంచు సోత్కంఠులై॥ 266

శాంతయు ఋశ్య శృంగుఁడును సాధ్వి యరుంధతి ముందు సాగ వి
శ్రాంతిగఁ దల్లులున్ జనకరాజును వెంబడిరాగ గోమతీ
ప్రాంత మఖావనిన్ దరియు వార్త నెఱింగిన రామచంద్రుఁ డ
త్యంత ముదంబునంది వినయంబున మ్రొక్కుచుఁ దోడి తెచ్చినన్॥

సీతాస్వర్ణ మయాకృతి త్రితయ సుస్మితాంశు మాలా పరి
స్ఫ్యాతంబైన మఖావనిన్ నిలిచి యం దుర్వీజ యున్నట్టులే
చేతంబుల్ ముదమొంద రాము నెడ సుస్నిగ్ధాత్ములై మాటలం
దోతప్రోత మనస్కులై రెడము లేకున్నట్లై యెల్లప్పుడున్॥ 268

తిరుగం బోయిన తేజి తా మఖ ధరిత్రిం జేరునందాఁక న
ధ్వర కార్యంబులు చాల స్వల్పములు నిత్యమ్మందు నైమిత్తికం
బరయం గావలె నంతమాత్రమె యసంఖ్యాకమ్ముగా నున్న చూ
పఱ కాలమ్ము సుఖమ్ముగాఁ గడప నేర్పాటయ్యె సత్కార్యముల్॥

'లోకో భిన్న రుచిర్హి' యన్నటులు సుశ్లోకుల్ సమభ్యస్త వి
ద్యాకారుల్ వివిధంబులన్ జన మనోఽహ్లాదంబుగాఁ దెల్పుచో
నేకోనం గన గుంపులై జనము హాయింబొంద నానందన
శ్రీకంబై రఘురాము యజ్ఞభువి తాల్చెన్ నాక సౌభాగ్యమున్॥

ఒకచోఁ బల్వురు వేదవేత్తలు మహా వ్యూహంబుగాఁ జేరి యొ
క్కొకరున్ సుస్వర మొప్ప నేకగళమందుద్ఘాత మైనట్లుగా
సకలానందకరంబుగా నిగమ వాక్చాతుర్యముం జూపుచోఁ
జకితుల్ శ్రోతలు సత్యలోకమని యెంచన్ జాలి రానందమై॥ 271

తర్కప్రౌఢులు పండితుల్ నిలిచి సిద్ధాంతం బిదన్నన్ శుభో
దర్కంబెంచుచుఁ బూర్వ పక్ష మొకరుద్ఘాటింపఁ గుంభీంద్రమున్
మార్కొన్ సింహమునాలసన్మతి పరామర్శింప నుత్సాహమై
కూర్కుల్ వీడి జనంబుకూడి వినిరాకోలాహలం బంతయున్॥ 272

సానం దేడిన కత్తివంటి మతి వీసం బేని దోసంబు నె
ద్దానన్ సైపక చీల్చి చెండుట వినోదంబైన యచ్చోటఁ గా

లూనం జాలరు శిక్షణారహితు లేదో చర్య యున్నించునే
గానీ సారమెఱుంగు ధీసరణి లేకన్ నిల్వ లేరచ్చటన్ ॥ 273

అదిగో యచ్చట పెద్దగుంపయిన దత్యంతమ్ము నేకాగ్రమై
మెదలుద్దీపిత భావమగ్నములుగా నే లోకమందో వసిం
చెదరన్నట్లు పురాణముల్ వినుచు వాసింగాంచుచున్నారు శ్రో
తృదయా సింధువు తత్ప్రవక్త నుతినందెన్ హార్దమర్మజ్ఞుఁడై ॥ 274

అతఁడఖిలార్థ వేత్తయయి యచ్చట నున్న మహాజనంబు క
ర్షిత మతి వీనులై విన వశీకృతచిత్తుఁడు వారి చిత్తముల్
శిత మొనరించుఁ దన్మయతఁ జిందులుద్రొక్కఁగఁ జేయు, దేహ వి
స్మృతి గనఁ జేయుఁ బూర్ణరససిద్ధిని బొందగఁ జేయు దక్షుఁడై ॥ 275

మధుపుం స్కోకిల గొంతు విప్పె ననఁగా మంజు స్వరాలాపమై
సుధలం దోఁగెద రొక్కచో జనము చక్షుశ్శ్రోత్రముల్ సర్వ వా
ర్నిధు లందుండి బహిర్గతంబులయి యిందేనిల్చె భోగంబు లె
త్తి ధరిత్రీ విభవంబు గాంచనన వీతెంచన్ సుధాస్రోతసుల్ ॥ 276

అభినయవేత్త లింకొకట హారి మనోజ్ఞ కథా విధానముల్
ప్రభుతదలిర్ప శాస్త్రవిధిఁ బట్టిన హస్తము చూచుచూపు భా
వభరితమై యెడందలను బట్టి గరుత్తతి మొల్వఁ జేయుటన్
నిభృత మరాళ సంచయము నింగిని బోవుననన్ నటింపఁగన్ ॥ 277

కనెడి జనంబు తన్మయతఁ గాంతురు కాంచుచు నున్నయంత సే
పును దము తా మెఱుంగుదుర? మున్గిన దెచ్చట? తేలుటెచ్చటో?
తనువున వీనులున్ గనులె తక్కిన యంగములేమి యయ్యెనో
యన రసవార్ధి వీచికల నాడెడి హంసలె యాదు రెల్లరున్ ॥ 278

కాలక్షేపమె లక్ష్యమయ్యెను సుసంస్కారంబు చేకూర్చెడం
డాలన్ సత్యముఁదోఁపఁ జేయఁగల విద్యల్ పెక్కులన్ నేర్తు రం
డాలున్ బిడ్డల కూటితోఁ బరము తా మందం గలా రన్నచోఁ
జాలున్ నాటి జనంబు మానవత ప్రాశస్త్యంబు గుర్తింపఁగన్ ॥ 279

సత్యము సుందరం బగుచు శైవము నైనదె స్వీకరింప దౌ
ర్గత్య మదేల కల్గు? బ్రదుకన్ వలెఁ దప్పదు దానితోనె సౌ
మత్యము నంది సర్వఫల మాన్యత నందెడి లక్ష్యమున్నచో
వ్యత్యయ మందునే బ్రదుకు భారము తోఁచునె మానవాళికిన్॥ 280

యజనాలోకన కాంక్షమై నట నసంఖ్యాకమ్ముగానున్న స
త్ప్రజ కాశ్చర్యము గాఁగఁ గాలము గణింపన్ రాక సాగంగ నీ
రజ బంధ్యన్వయ రాఘవోత్తము సమర్చన్ బొందు నవ్వారి పూ
ర్వజనుః పుణ్యము పంట కొగ్గినది కొల్వన్ రా కనంతంబుగన్॥ 281

రాజారాముఁడు దీక్షితుండగుటతో రాజ్యంబు నధ్వర్యుఁడే
తేజశ్శాలిత నిర్వహింపవలె నా ధీమంతుఁడే యజ్ఞ భూ
భ్రాజిష్ణుండు వశిష్ఠుఁ డెల్లెడల సర్వవ్యాపకుండై మనో
రా జీవంబుల నేలి కానక యె తీర్పన్ సాగె సర్వస్వమున్॥ 282

రెండేండ్ల య్యెడి దీక్షలో మునిఁగి యీ తేఁడున్నచో లక్ష్మి యం
దుండం బోలునె యండ లేక? విధి తానూహించి యీ చిక్కు బా
పం డొక్కండుదయాన క్షత్రియుఁడు తప్పం బోక సాయాహ్న మం
దం డగ్లానయి నిల్వగా వలయు వీణాలాప సంకర్షణన్॥ 283

శ్రీరమణంబు నంద దది సిగ్గిలి విప్రులఁ జేరఁ బోదు త
త్కారణమై యనశ్యముగ క్షత్రియుఁ డేమలు సంజలందు వీ
ణారణ నంబునన్ రమను నర్తిలఁ జేయఁగ నౌనటంచుఁ జె
న్నారు హితంబు పల్కినది యట్టులె సాగెడి నిత్య మయ్యెడన్॥

శ్రవణానందకరంబు సామ మది సర్వశ్రేష్ఠ సంగీత మా
చెవులన్ సోకినయంత డెందములు తాల్చెన్ ఱెక్కలన్నట్లు వ్యో
మ విహారంబున కుత్సహించు నిఁక సామం బే విపంచీ సము
ద్భవమై పొల్చిన వేఱె చెప్పవలెనో భావాంబరం బుబ్బెడిన్॥ 285

తొలు నంజన్ మలు సంజ నిత్య మట మాధుర్యావధీ భూత ని
స్తుల నా దార్ణవ వీచి సంతములు దొంతుల్ దొంతులై నృత్య హే

లల నొయ్యారము లొల్కఁబోయ నగునాహ్లాదంబు వర్ణించు టె
ట్టులు? మేనుల్ పడియుండ గుండియలు పెట్టున్ మెట్లు స్వర్గానికిన్॥

కాలక్షేపము శాస్త్రచోదితము నా కార్యంబు లిల్లెన్ని యో
చాలన్ సాగుచు నుండ నెవ్వరికి నిష్టంబెద్ది యచ్చోటఁ దా
మై లీలాగతి కాలముం గడపుచో నానంద సామ్రాజ్యమై
శ్రీ లీలావతి రామయాజ్ఞ భువి వాసించెన్ మహాప్రీతిమై॥ 287

దినముల్ బంక్తులు వేలు లక్షలును బంక్తిన్ బంక్తి వేల్వేలుగా
జనముల్ యజ్ఞనివేదితాన్నములు విశ్వాసంబునన్ దించుఁ దృ
ప్తిని గాంచన్ గని రాముఁ డాత్మఁ గను తృప్తిన్ దమ్ములన్ బిల్చి యె
వ్వనికిన్ లోపము తోఁపరాదనుచుఁ దాత్పర్యమ్ము హెచ్చించెడిన్॥

పరమాన్నంబుల తోడి భోజనము దేవప్రీతిగాఁ బెట్టి యా
దర మత్యంతము చూపు చొక్కకరి శ్రద్ధన్ గాంచుచుండంగ న
ధ్వర వైశ్వానర పూజ సాగు నటులోపం బెట్లు కల్పించు? హె
చ్చరికన్ నిల్వఁగఁ జెప్పు మాటయది యజ్వన్ జెప్పు శ్రద్ధాన్వితున్॥

ఆ వేళ యీ వేళ యని లేక యెవ రెప్డు
వలయునన్నను నప్డె బంతి సాగ
విసుగన్న మాటయే విసుమాన మైపోవ
నభిమాన పడనీక యడిగి పెట్టఁ
దమ తమ ప్రత్యేక తత్త్వంబులం బట్టి
యెవరేది కోరిన నేర్చి యీయఁ
బాకమ్ములన్ మించి వడ్డించు మన్ననల్
మదికింపునించి సమ్మోదము పెంప

జనకజా ప్రాణనాథు యజ్ఞ ప్రదేశ
పరిధి విరివిగ నున్న పందిరుల యందు
నవధి లేనట్టి వైశ్వానరార్చ సాగె
నమృత మస్తన నధ్వరం బన్నినాళ్ళు! 290

హాయమింకన్ మఖభూమి చేరుటకు నెట్లైనన్ నెలల్మూఁడు ని
శ్చయమై పట్టు ననంగఁ దాపసులు వాసంబున్న పూరిళ్ళలో
జయనాదంబులు పిక్కటిల్లఁ గని రాశ్చర్యంబుగా నెల్లరున్
బ్రియ శిష్యద్వయ యుక్తుఁడై దిగు తపస్విశ్రేష్ఠుఁ బ్రాచేతసున్॥ 291

భరతుం దా మునిలోక మూర్ధమణి నాప్యాయంబునం గొల్చి సుం
దర శిష్యద్వయమందె చూడ్కి నిలుపన్ దత్త్వజ్ఞుఁడౌ మౌని యె
వ్వారు వీరంచుఁ దలంతువో క్రతువు సాఫల్యంబు నొందింప వ
చ్చిరి సర్వంబు క్రమాన వేద్యమగు మచ్ఛిష్యుల్ నమన్న్యస్తుల్॥

అని ముడి విప్పకుండగనె యాడిన వారల ముద్దు మోములన్
గనుగొని ప్రీతి నొందుచు సుఖంబుగ వాసము చేయ యోగ్యమై
చనునొక పర్ణశాలను విశాలము సుందరమైన దాని న
ర్పణ మొనరించి మౌనికడఁ బ్రాంజలియై సెలవంది యేగినన్॥ 293

ప్రాచేతసుఁడు వచ్చె బాలక ద్వయముతో
నను వార్త మఖభూమి నల్లు కొనియె
జనకాది గురులు కౌసల్యాది వృద్ధులు
చని వారిఁ గాంచి దీవనలు కురిసి
జానకీ ముఖబింబ సాదృశ్యమును గాంచి
లోలోన మురిసి యాలోల హృదయ
లగుచుఁ బ్రశ్నించియు నా మౌని శిష్యుల
మనుట కంటెను వేఱు వినఁగ రాక
యెదల యారాటములు తీఱ కదియె తెలియుఁ
గాలమున నన్న శాంతిని గనఁగ లేక
దిన దినము వారిఁ జూచి వచ్చిన నెగాని
మనసు నిల్పఁగ లేని వేదనను గనఁగ॥ 294

వారును మౌని యాజ్ఞబడి వల్లకులన్ ధరియించి మీటుచున్
శారద మౌని బాలకుల చందమునన్ దిగి వచ్చె నన్నటుల్
నారద శిక్షితం బయిన నాద సుధారస మొప్పు దివ్య వా
ణీ రమణీయ మాదికృతి నిర్భరులై వినిపింప సాగినన్॥ 295

నాద స్వచ్ఛత, మాధురీ గరిమ నానామాన వానీక మ
ర్యాదా నూన మహార్థ సంభరిత చర్యా వర్ణన ప్రౌఢి, త
ద్వేదార్థ ప్రవణత్వ, మార్యనుత సంవిజ్జీవనా భోగముఁ
మోదంబుఁ సమకూర్ప నెల్లరట గుంపుల్ గూడుచుండ్రెప్పుడుఁ॥

పంచక్రోశ విశాల మాసవన భూభాగంబు వీరెప్పు డ
య్యంచుఁ దాటక చత్వరంబులను రథ్యావేదులం దెచ్చటేఁ
మించుఁ వేడుక పల్వురుండు నెడ సంప్రీతాత్ములై పాడుచో
నంచుల్ ముట్టెడి పారవశ్యమున శ్రోత్రానీక మేపారెడిఁ॥ 297

పుట్టంబుట్టువు పుట్టు వీగుటకునై పుట్టించె నీ గాథ యే
ఘుట్టంబేని మనోహరంబగును గంగం బోలె విన్నంత నే
పట్టుఁ గుండియ నెట్టు పాపముల శశ్వద్ధర్మ నిష్ఠామతిఁ
రెట్టించుఁ వినఁబోద మయ్యెడకు రారేయంచు నుత్సాహులై॥ 298

జనముల్ కూడి కుమారక ద్వయము వాత్సల్యమ్మునన్ బిల్చి మా
చనువున్ మన్నన సేయుఁడంచు వినిపించన్ గోరి విన్చుందు రా
ముని కుట్జల్ చని యెప్పుడైన సరియే మోదంబునన్ వింటు ర
య్యిన వంశోత్తము పుణ్యాగాథ వినుటే యింపయ్యె నవ్వారికిన్॥ 299

సరిగా వత్సర మయ్యె నన్న తఱి కశ్వంబున్ మఖస్థానమున్
దరిసెన్ లక్ష్మణ రక్షితంబగుచు నద్దాసిన్ యథాశాస్త్ర సం
స్కరణం బొప్పఁగ ఋత్విజుల్ నిలిపి రుక్తంబైన పుణ్యస్థలిన్
జరుగంగావలె వత్సరంబు మరలన్ శామిత్రమున్ జల్పఁగన్॥ 300

ఆనందాబ్ధముకంటె వేగముగ నిత్యంబాది కావ్యంబు శ్రో
త్రానందంబుగ వించు బాలకుల నేర్పై రాక్షసాబ్దంబు ప
ట్టైనం గానక నెట్ట గల్గిరి జనంబా ఫాల్గుణాంతంబునన్
శ్రీనిత్యున్ రఘురాము యజ్ఞవిధి కూర్చెన్ బ్రహ్మకాలజ్ఞుఁడై॥

అపదాతుల్ చనుదెంచి రెల్లరును మంత్రాకారులా బ్రాహ్మణుల్
ద్విపరాజంబుల నెక్కి రామయజనార్త్విజ్యంబు సంప్రార్థ్యమై

నిపుణుల్ ద్వాదశ ఋత్విజుల్ నలువురిందే మున్నె బ్రహ్మాది ము
ఖ్య పదంబుల్ వహియింప నంత మఖకార్యంబుల్ విజృంభింపఁగన్ ॥

ఆరంభంబున వైశ్వదేవములు నిత్యంబొప్ప మూఁడౌచు నా
వారంబైన యనంతరంబగును కల్పప్రోక్త హోమంబు లే
యే రీతిన్ వచియించె శాస్త్రమటులే హెచ్చైన శ్రద్ధన్ దినం
బారాజన్యుని యాజకుల్ క్రతువు సేయంజాలి రుద్యుక్తులై ॥ 303

అశ్వమేధమునకు నంగభూతములైన
యాగజాతమిట్లు సాగుచుండ
ముఖ్య యజ్ఞమునకు మూలభూతములైన
చిన్ని చిన్ని పనులు చేయవలయు॥ 304

ఎంత చిన్న పనియు నేవేళ కేది చేయ
వలయు నపుడె దాని సలుపవలయు
నన్ని మంత్ర యుక్తమగుచు సాగుచునుండు
శక్తిమంతమగుచు శ్రద్ధమీఱ॥ 305

ఏక వింశతి యూపంబు లేర్చి కూర్చి
పర్ణులున్ ఖాదిరంబులు బైల్వములును
దేవదారులు నేవియెన్నె వలయునో
సరిగ నవి తెచ్చి రొకటి శ్లేష్మాతకంబు॥ 306

వర్ధకులు వాని ఋత్విగర్పణము సేయఁ
గొలతలకుఁ దగురీతి చేతలకు మెచ్చి
లెక్క సరిజూచుకొని వానినొక్క దెసను
భద్రపఱిచిరి వారు నిర్నిద్రు లగుచు॥ 307

యూపోచ్ఛ్రయ కాలం బను
రూపంబయి యరుగుదేర శ్రుత్యుక్త విధిన్
దీపిత యాజ్ఞాగార
శ్రీ పూరక మణి కిరీట శిఖలా వానిన్ ॥ 308

నడుమ శ్లేష్మాతకంబుంచి కుడి యెడమల
నెడము షణ్ణవత్యంగుళం బేర్పడంగ
దేవదారులు మోదగుల్ చేవగలుగు
శైల్వములు ఖాదిరంబులు పాతినారు॥ 309

అంచులఁ బాలాశంబుల
నుంచి సమంచితముగ నవి యొక్కొకఁడట కే
తెంచిన దేవత లనఁ గా
వించి రలం కృతము గాఁగ నెంచిన పూజల్॥ 310

పసుపుతో మంచి గంధంబు మిసిమి తేఱ
నిలువునం బూసి పూలదండల నమర్చి
కొసల నూతన వస్త్రముల్ కొప్పు వెట్టి
కుంకుమపు బొట్లు పెట్టి రా గుంజలకును॥ 311

శుల్బసూత్ర విదులు శుష్మ వేదులు గట్టి
రఖిల కర్మ కుశలు లైనవారు
శాస్త్ర చోదితముగ స్వర్ణేష్ట కాచయ
నం బొనర్చి యర్చ నంబుగాగ॥ 312

అశ్వమేధ యాజ కది యిర్వదొక రెట్లు
కొలతఁ గలిగి నిడివి తలను వాంచి
విప్పి రెండు ఱెక్కలొప్పు పుచ్ఛముతోడి
గరుడి యనఁగ రూపు గాంచవలయు॥ 313

బంగరు టిట్టికల్ పఱచి వారు రచించిన వేది యొప్పె శ్రీ
రంగ పతీశభక్తుఁడగు రాఘవుఁ డావిభుఁ డొక్కరాట స్వా
మింగని సేవసేయ నడి మిన్నున నుండి సువర్ణుఁ డిట్టులై
ముంగల నిల్చి నన్నటులు మోదము నందగఁ జూప ఱెల్లకున్ ॥ 314

అగ్ని సంధాన మొనరించి రంత శుల్బ
కర్మ కుశలులౌ బ్రాహ్మణుల్ మర్మ విదులు

అన్ని దెసల హిరణ్య సహస్ర శతల
ప్రోక్షితములయి జ్వలియింప రూక్షశిఖులు॥ 315

ముఖ్యమైన మఖము మూన్నాళ్లె సాగును
వివిధ విధులు ముందు వెనుక నుండు
నంతవఱకు తీఱికై నట్లు కాదప్పు
డున్న వేళ చాలదన్న యట్లు॥ 316

తొలి దిన మగ్నిష్టోమము
సలుపుదు రది యజ్వ ప్రతి వసంతమునందున్
సలిపెడి దే యిపు డదియును
వెలయును పూర్వాంగ మగుచు విధిచోదితమై॥ 317

సవనము మూఁడు వేళలను సాగుచు నుండఁగ భిన్న దేవతా
స్తవన విధిన్ కరంభమును ధానమునున్ బరివాపమున్ బయ
స్య విధి విధానముఁ దెలిసి యర్పణ సేయుచు సోమ దేవు సం
స్తవనమునన్ విశేష పరితర్పితుఁ జేయుదు రూర్జితాత్ములై॥ 318

తుల యిడరాని శ్రద్ధమెయి తోరపు భక్తిని నాఁడు సోమదే
వుల యజియించుటే యగును పూర్ణుఁడు రాముఁడు యజ్వగాఁగ వా
నులు మఖ యాజకుల్ మనుపు నూల్కొని దీక్షను వేల్వ సోమరా
జుల దయపూర్ణమై విరియ సోముఁడె యయ్యెను రాముఁడయ్యెడన్॥

మలిదిన మూపిరాశదు సమస్త మఖక్రియ నాఁడె యూట వం
దలపయి నున్న యా పశులు ధన్యతనందును వహ్నిసంస్కృతం
బు లగుచు వన్యముల్ పశులు పొందు విముక్తిని గ్రామ్యముల్ పశుల్
దళితములౌచు సర్వ విధదైవత కోటికిఁ దృప్తిఁ గూర్చెడిన్॥ 320

ఆహవనీయ వహ్ని కెదురౌనడి యూపమునందు బద్ధమై
వాహ మెసంగ దాని కిరు పార్శ్వములందును దూపరంబు ని
ర్వాహ మెలర్ప గో మృగము బద్ధమొనర్చి విభిన్న దేవతా
వ్యూహము కోరు గ్రామ్య పశులుంతురు తక్కిన యూప సంతతిన్॥

జలచర ఖేచరంబులు భుజంగము లుగ్ర వనేచరంబులున్
నిలువవు యూపబద్ధమయి నేర్పున వానిని పంజరంబులన్
నిలిపి సుదీర్ఘ రజ్జువుల నిస్తుల యూపనిబద్ధ సత్పశు
స్థలముల కంటఁగట్టి యనుసంధితముల్ పొనరింతు రొప్పఁగన్॥ 322

నానా దైవత్యము వివి
వానన్ నరపశు వొకండు బద్ధంబయి త
త్త్వానన్ విశ్వమె యజ్ఞ
స్థానము పశువులగు జీవ జాలమటంచున్॥ 323

తెలుపును, దత్పరిస్థితికి ధీనిధి యాతఁడు సమ్మతించి రా
వలయును బ్రాహ్మణుండు, గుణవంతుడు, వేదవిదుండు నొటచేఁ
దెలిసియె వచ్చి నిల్చునట దీన పశూత్ప్రియమానటన్న ని
శ్చలమతి నట్టులే నిలుచు సర్వ పశూత్కర మబ్బురంబుగన్॥ 324

యూపములందు బద్ధమయియున్న పశూత్కర మర్చితంబుగా
నే పరితాపముంగనగ నేక శిరస్సుల నొప్పు నా విరా
డ్రూపుఁడె నాఁగ నిల్వ నను రూప మనస్థితి ధ్యానమగ్నుఁడై
భూపుఁడు పొల్చెఁదానె తను పోడిమి నాహుతి సేయునన్నటుల్॥

తెలియని యజ్ఞులీ సవన దీక్ష కసాయి దుకాణ మన్నటుల్
పలుకుఱె గాని యూపశులపాటి వివేకము గాంచఁబోరు ని
శ్చలమయి జన్నపుం బశువు సాగు జలంబును ద్రావు ముందుగా
విలువ నెఱింగి జన్మమును వీడు కృతార్థత నందుచూఁడుటన్॥ 326

క్రందన మాచరించినను ద్రావక యున్నను నీరు దానికిం
జెందిన పాచితంబులవి చేయఁగ నౌను వచించు శాస్త్ర మ
ట్లెందును చేయనైన గతి యేర్పడ లేదన రామయజ్ఞ మే
చందమునన్ మహోమహిమ సాగెనొ లోక మెఱుంగఁ జాలెడిన్॥

జన్నము సప్తతంతువగు సప్త విధంబుల ఛందముల్ సమా
సన్నము లౌట మంత్రగతి సత్య మదయ్యును పంచభూతముల్

మిన్నున సూర్యచంద్రులును మేకొని పూరుషుతోడ నేకమై
యున్న జగంబునన్ బురుషుఁ డొందు పశుత్వము జన్నమందిటుల్॥

తనయందుండిన పూరుషున్ నిలిపి తత్తత్పాప నిష్కాసనం
బున శుద్ధుం బొనరింప నొక్కొక పశున్ బూజించి యజ్ఞాహుతిం
బొనరింపన్ వలెఁ దాన యట్లయినఁ దత్పూర్ణాహుతిన్ గల్గు మే
లును లోకంబున కందఁజేయు నొకఁడెట్లుండున్ విశిష్ట స్థితిన్। 329

తానుండి తన విశుద్ధత
మే నందిన సర్వ జగము మేల్కాంచుటకై
పూనంగ వలయు నధికృతుఁ
డే నస్సంహార కాధ్వరే శార్చనమున్॥ 340

వివిధారణ్య పశుల్ సమంత్ర విధిఁ దృప్తింగూర్చి దేవాళి క
య్యవి తక్కంగల జీవకోటి కఘు మాహాత్మ్యంబు బోధించు న
ట్టివి పర్యగ్ని కృతంబులై విపినవాటిన్ నిల్చియుండంగ మా
నవుఁడున్ వానివలెన్ విముక్తుఁడగు నైనన్ వాఁడు త్యక్తుండగున్॥

పశుకృతుఁడైన మానవుఁడు వన్యమృగంబుల తోడ నొక్కఁడై
యసువులు తొల్చు నంతవఱ కచ్చటనే వసియింపఁగావలెన్
విశసన ముండదంతె మృతి వేడి వరించిన యట్లె దానికై
పసదన మంది తజ్జనము వానిని వీడుట కొప్పి కోవలెన్॥ 332

పశువగు వాఁడు తత్పశుత వాఁడు వహింపగ నొప్పువారు దే
వసములు విశ్వ శాంతికయి వారలొనర్చెడు త్యాగ మెంతయా
పసదన మెంత యయ్యు విలువన్ వెలయించునె వేదమందు వి
శ్వసన మదెంత యుండవలె వారికి విశ్వమె వందనం బిడున్॥ 333

ప్రాతస్సవనము నందే
బ్రాతినఁ బలు గ్రామ్య పశుల వపలు దివౌకః
ప్రీతిగ హుత మొనరించిరి
ఘ్రాత వపాగంధ మఘు విఘాతము సలుపన్॥ 334

పశుసమజ నాభిదేశ
ప్రసృతంబయి వపలంభించుఁ బలుచని పొరయై
విశసన నిపుణులు దానిన్
గుశలత వెలిదీసి జువ్విగొమ్మ నిగుర్పన్॥ 335

హోమమ్ము సేయఁగావలె
సామాన్యము గాఁగ నట్లె జరుగును కానీ
యీ మేధమందు హవిసును
నీమముగా వైతసమున నిలుపఁగ వలయిన్॥ 336

వప లేదశ్వమునందుఁ గావున నె తత్పార్శ్వంబులన్ దూపరం
బపురూపంబగు గోమృగంబునిడి యశ్వాబద్ధమైయుండ న
ల్పపుటూహల్విడి మంత్రశక్తి నవి స్వాపం బంది యున్నట్లు శ్రే
యపు మూర్ఛన్ గనఁ బత్నిఁ జేయనగు రాజాద్యోప చారంబులన్॥

ముగురు భార్యలున్న ముగురకుఁ బనిగల్గుఁ
దండ్రి కుండి రట్లు తనయుఁడేమొ
పట్టి దీక్ష నేకపత్నీ వ్రతంబందుఁ
గాన విగ్రహముల పూనవలసె॥ 338

కాంచన విగ్రహత్వమును గాంచిన జానకి కుత్స లేకయ
శ్వాంచిత దేహ పార్శ్వమున యందుఁ బరుండుట తేలికయ్యె జీ
వించియుఁ బ్రాణముల్ నిలిపి విగ్రహతన్ భజియింపఁగల్గు యో
గాంచిత దేహ కామెకిది యక్కఱ లేని సహాయమయ్యెఁబో॥ 339

మాధ్యందిన సవనంబున
మేధ్యాశ్వము దానివెంట మిగిలిన పశువుల్
విధ్యుక్త విధానంబున
వధ్యములై హుతము లగును వహ్నుల యందున్॥ 340

నానా దేవతలా ప్రజాపతియు నానందంబు నందంగ స
ర్వైన స్సంహారమున్ సమస్త శుభదంబౌ నశ్వ సత్రమ్మ ద్వాపా

స్థానీయంబగు చంద్ర సంజ్ఞఁగల మాసంబుౝ ద్విపార్శ్వస్థ ప
శ్వా సీతాహ్వా వపాద్వ యాన్వితము మేలై వేల్వఁ దద్గంధముౝ॥

మూఁజూచెన్ రఘురాముఁ డంతట నఘుంబుల్ మూలతశ్ఛిన్నమై
ప్రాఁజీరల్ వలె విచ్చి రూపఱుటతో రాజీవ నేత్రత్వ వి
భ్రాజద్దివ్య మహస్కుఁడై వెలుఁగు నారామావనీశుౝ మహా
తేజుౝ గాంచి ముదంబునందిరి జనుల్ దేదీప్యమానాస్యులై॥ 342

మంత్రాధీనము దేవత
మంత్రము తద్వీర్య మెఱుఁగు మాన్యుల వశమా
మంత్రాకృతు లయ్యధ్వర
తంత్ర ప్రవణాగ్ర జన్మ తాపస వర్యుల్॥ 343

ఇఁక దివమెల్లఁ దన్మఖమహీస్థలికే దిగివచ్చె నన్న న
మ్మకము ఘటిల్లు టబ్బురమె క్ష్మాపతి తోఁచెఁ బ్రజాపతింబలెౝ
బ్రకటితులైరి ఋత్విజులు బ్రహ్మముఖుల్ దివిజ ప్రకాండులై
సకల జనుల్ సురల్ బలెనె సారమహత్త్వము నంది రయ్యెడౝ॥

మఖ హాయ వివిధాంగంబులు
నిఖిలామరగణము తృప్తి నెక్కొనహుతమై
మఖఫల మవిలంబంబుగ
సుఖరూపత విరిసె ననఁగఁ జొక్కిరి సర్వుల్॥ 345

పచ్చని మేని బట్టతల వాని నభిజ్ఞుని స్విన్నగాత్రునిౝ
నిచ్చలు కంటి ఱెప్పలను నిల్పక మాటి కెగుర్చువాని పై
పెచ్చుగఁబిల్లి కన్నులగు విప్రుని దెచ్చి తదీయ మూర్ధ మం
దచ్చపు నేతితో నవబృంధాంగము వారుణహోమ మొప్పఁగన్॥ 346

సలిపిరి తత్ఫలితమ్ముగ
సలిలాధీశ్వరుఁడు కరము సంతుష్టుండై
పిలిచిన పలికెడు వాఁడై
సలిలాపూర్ణం బొనర్చె సర్వ ధరిత్రిన్॥ 347

ఒక్కొకవేళ నొక్కొకటి యున్న నెగాని విశిష్ట సిద్ధి తా
నెక్కొనఁబోదు వేదమిది నిర్ణయమున్ బొనరించు పద్ధతిన్
జక్కఁగఁ జూడ సృష్టిగల సర్వ మెదో యొకవేళఁ బూజ్యమై
యక్కఱకౌ నటంచుఁ దెలి యందగు హేయము దైవమెట్లగున్॥

హయ మేధావబృథార్ద్రి దేహమగు రామాంభోధరంబందు వి
స్మయ కృచ్ఛాశ్వత వైద్యుపాపఘన యాస్వర్ణావ నీజంగనన్
ప్రియ దేహార్ధము నందునున్న శివుఁడే విచ్చేసినట్లై మఖా
శయ మత్యంతము సిద్ధి నందిన మహాసంతోష ముప్పొంగఁగన్॥ 349

క్రతుఫల మగ్నిహోత్రి కగుగాక శ్రమంబు వ్యయంబునంది దీ
క్షితమతి యాట న్యాయ్యమది శ్రేష్ఠమఖంబగుదీనియందు ప్రో
క్షితులయి సర్వులుం గనిరి సిద్ధిని మంత్రమహత్త్వ మెంతయో
శ్రుతి వచియించుఁ దత్పరత స్తోత్ర మొనర్చినఁ జాలు సిద్ధికిన్॥ 350

శ్రీపతియైన రాఘవుఁడు చేతికి నెమ్ములు లేని యట్లుగాఁ
జేపిన కామధేను వన క్షీరములన్ గురిపించె దక్షిణల్
తేపకుఁ దమ్ము భక్తి నుతిఁ దేల్చెడి రాఘవు శ్రేయమెంచి ని
ర్లేపులు ఋత్విజుల్ గొనిరి లీనమహస్కులు బ్రహ్మవర్చసుల్॥ 351

హయమేధంబున ముఖ్యభాగమగు నుక్థ్యంబయ్యె నారాత్రి యె
ల్లయు దీక్షావిధి నన్న హోమము సురాహ్లాదంబుగా సాగెఁ ద
న్మయులై దేవతలెల్ల రచ్చటనె మంత్రస్నిగ్ధులై నిల్వఁ దా
మయి ఋత్విక్కులు పూని రాపయిఁ దృతీయాహ్ణార్హ కృత్యాళికిన్॥

మూఁడవ నాఁడతి రాత్రము
పోడిమి వేల్వంగఁ బడియెఁ బుణ్యసమృద్ధిన్
దేడిన రాఘవుఁ డంతట
వాడి మయూఖములు కలుగు వాఁడని పింపన్॥ 353

ఆ మూన్నాళ్ళు నెవ్వరికిఁ దీటికయే లేనట్లయ్యె. పిమ్మట
నుత్తరాంగములుగా నిర్వర్తింపవలసిన జ్యోతిష్టోమ

మ్నాయుషియు నతిరాత్రంబులు నభిజి ద్విశ్వజి
దప్తోర్యామాది మహాక్రతువులతో నశ్వమేధమ్ము
సాంగంబుగాఁ బూర్తి గావించి నంత॥ 354

దశరథు జన్మము చూచిన
ప్రశమిత మతులైన ప్రజలు రామముఖంబున్
విశదముగ దేవకృత మిది
ప్రశస్త మిట్టి దరు దనుచుఁ బ్రస్తుతి పట్టన్॥ 355

ప్రాయశ్చిత్త మటన్న మాటె వినిపింపన్ లేదు సర్వంబు నే
చాయన్ నిర్ణయ మయ్యె నట్టులె ప్రశస్తంబై యమోఘంబుగాఁ
జేయంగల్గిరి దేవతాగణము మెచ్చన్ ఋత్త్విజుల్ సద్ద్విజుల్
భూయస్తృప్తిని గాంచిరందఱు ముదంబుంబొంది రత్యంతమున్॥ 356

నవనిధు లప్పఁజెప్పెధననాథుఁ డనంగ రఘూత్తముండు చూ
ఱ విడిచెఁ గోశమున్ ద్విజ పరంపర యోగ్యతకొద్ది స్వర్ణమున్
వివిధమణుల్ తమంతఁగొని విర్వఁగ దీవనలిచ్చి యేగుచో
రవివలెఁ జూచుచున్ నిలిచె రాఘవుఁ డంజలి బద్ధుఁడయ్యెడన్॥ 357

సాయాహ్నంబుల నిత్యమున్ సవన దేశంబందు లక్ష్మీకరో
పాయంబై శ్రుతి వీణపై వినుచు విద్వత్ క్షత్రియున్ రాముఁడా
ప్యాయం బొప్పఁగఁ గాఁగలించుకొని తృప్త స్వాంతుఁగావించె నా
శ్రేయఃకామియుఁ దృప్తుఁడయ్యెఁ దన దారింబోక యచ్చోటనే॥

నిలిచిన రాముఁ డాతని గనెన్ మఱియే మను ప్రశ్న మొప్ప ని
శ్చలుఁడయి యాతఁడెంతకును సాహసముం బొనరింపలేక ది
క్కులు పరికించుచుండ నటకున్ జనుదెంచిన రాజసోదరుల్
సలిపిరి వందనాదికము క్ష్మాపతికిన్ జయఘోష మొప్పఁగన్॥ 359

మూవురు తల్లులున్ సవనమున్ ముగియించిన రాముగాంచి బల్
దీవన లీయగా నరుగు దెంచిరి శాంతయు ఋశ్యశృంగుఁడున్
దేవి యరుంధతీ సతియు దీప్తమహస్కుత నేగుదెంచి రా
భూవిభుఁడంద ఱొక్కపరి ప్రోవగుటన్ గమనించుచుండఁగన్॥ 360

జనకునితో వశిష్ఠులును సాగి ప్రచేతసు పుత్త్రి రాక నె
న్నిన మతి నిల్వవారును వినీత కుమారక యుగ్మయుక్తులై
కనఁబడ నందఱున్ గలిసి క్ష్మాపతి యున్నెడ కేగుదేర వి
చ్చిన రఘురాము కన్నుగవ చెందె వినూతన రాగమాధురుల్ ॥ 361

తక్కిన సర్వులున్ గనిరి దారకులన్ మును వారి గానమున్
జొక్కిన వీనులన్ వినిరి చూచినకొద్ది యెడందలందుఁ బెం
పెక్కిన ప్రేమమై కవల నెవ్వరి బిడ్డలటన్న ప్రశ్నమున్
దక్కి విడంగరాని ముడి దార్కొని యూరక మిన్నకుండిరిన్ ॥ 362

అందఱ కాత్మవస్తు వది యాంతరమాట తదీయ వాస్తవం
బందియు నందరట్లై యగునట్లై కుమారులు రామ జానకీ
నందను లౌదురన్న నుడి నాలుక దాఁకను వచ్చి వ్యక్తతం
బొందక లోన లోనఁ దలపోయుదు రయ్యది సిద్ధినందఁగన్ ॥ 363

ఇంతకు రామచంద్రుఁ డొకడే మును వారిని జూడనట్టిఁడై
స్వాంతము సర్వ మా దెసకు సాగ విలోచన యుగ్మమాత్మ ని
ప్రాక్కాంతి కసంవృతంబయిన చాయ సమస్తము వారెయన్న య
ట్లింతయు ఱెప్ప వేయక యటే కనుచున్ ముదమందుచుండఁగన్ ॥

మునివరుఁ డానతిచ్చినటు మూర్ధము లా రఘురాము పాద పీ
ఠిని స్పృశి యించునట్లు ప్రకటీకృత భక్తిని మ్రొక్కి వల్లకీ
స్వనములు తోడుగా మధుర వాఙ్మయవార్ధి తరంగ పంక్తులూ
చిన యటు లాదికావ్య సుధ చిందులు ద్రొక్కఁగ వారు పాడుచో॥

విని విని చొక్కి చొక్కి పరవీ స్థితి నందిన వారలందఱున్
గని విని చొక్కనఁడు మహీకాంతుని రాముని గాంచుచున్ మహీ
తనయ స్ఫురింప ధారణి సుతామణి దర్పణమందుఁ దోఁచు రా
ముని ప్రతిబింబముల్ కనిన పోలిక బాలకులన్ దలంచుచున్ ॥ 366

ఒకరి నొకళ్ళు చూచి కొను చుజ్జ్వల నేత్రములందు భావముల్
ప్రకటన మంద నందఱటు రాముని గాంచఁగ నాతఁ డాత్మ బో

ధక మహిత ప్రబంధ రసధారలలోఁ దను దాను నిల్పఁ జా
లక విహరించుచుక్ లహరులక్ గదలాడెడి హంసఁ బోలినక్॥ 367

ఆతని తన్మయత్వమున కందఱు నివ్వెర నంది యట్టులే
చేతము లప్పగించిముని శేఖర దివ్య ముఖారవింద సం
భూత వచో మధుద్రవము ముగ్ధకుమారక కంఠనాళని
ర్యాతము కర్ణపేయమయి యానుచు గాంచిరి సర్వ విస్మృతిక్॥ 368

అపుడెపుడో మహీతలమునందు గతించిన గాథయయ్యు నేఁ
డిపుడిట కంటి కెట్టెదుట నేర్పడసాగుచు నున్న యట్లె నే
రుపునఁ గనంగఁజేయు రసరూఢ కథా కథనంబు గల్గి కా
లపు గమనంబు తోఁపనటు లాగి యెడందల నిల్వఁ జేసెడిన్॥ 369

ఉపనతమైన యర్థమది యుట్టి పడన్ సమ సుందరంబులౌ
నిపుణ వచో నిబంధముల నిండినదై మధుర శ్రవంబునై
యుపగత సంధియోగమున నొప్పెడి చిక్కని కూర్పుగల్గు మా
నిప కృత లక్ష్యభూత రఘునేతృచరిత్రము సర్వసేవ్యమౌ॥ 370

తమ యెద సర్వమౌ మునికృత ప్రముఖార్థమునందుఁ జొచ్చి త
త్త్వము స్ఫుట మౌనటుల్ పలుకు దారకు లయ్యది వించు మార్గ ము
త్తమమయి శ్రోతలూర్జిత కథా వినిబద్ధ మనస్కు లౌటచేఁ
దమ తమ మేనులన్ మఱచి తన్మయతన్ భజియింతు రెప్పుడున్॥

వినుఁడీ వీనుల విందుగా వినుతు మీ వీరాధిరాడ్గాథ మా
కనఘుం డాముని పూర్ణ వత్సలత నంకారోపణం బొప్ప మె
చ్చిన డెందాన ననుగ్రహించినది వాసింగూర్చు మీకంచు శ్రో
తృ నికాయంబున కప్పుడప్పు డొక యుత్తేజంబు కల్పించుచున్॥

పసి మోము లందొప్పు భావ వైవిధ్యంబు
నద్భుతంబయి యెదల్ హత్తికొనఁగ
భావానుకూల సుస్వర రాగ చాతుర్య
మెదలూచి రసవార్ధి నేలఁజేయ

లయ తాళ గతి కొప్పు లాస్య విన్యాసంబు
సరసమై పారవశ్యంబు గొలుప
నన్యోన్య సహకార మాశ్చర్యమును గొల్పి
శిక్షావిధిన్ బ్రశంసింపఁ జేయఁ

బుట్టఁ బుట్టువు పుట్టించు పుణ్యగాథ
చెవులు చవులును గల సర్వ జీవతతికి
నాత్మసంతారకంబుగా నందఁజేయఁ
బుట్టినామన్న యట్టులా భూపశిశులు॥ 373

వినిపింపన్ గతమెల్ల మేల్కనుటతో విస్రావ బాష్పాకుల
ప్రణయాలోకన మోహనుండయిన ధీరస్వాంతుఁడా రాముఁడా
ముని వంకన్ గనుగొంచుఁ దామిటకు నీ ముగ్ధాంబుజాతాస్యులన్
గొనిరా నా జని చారితార్థ్యము గనెన్ గొల్తున్ మిమున్ భక్తిమై॥

ఇతరుల కాత్మ కింపగు నహీన కథా శ్రవణంబెకాని నా
కితరము కాని యాత్మ కథయే యిది యాట సమస్తగాథయున్
బ్రతిదిన మిట్టులే వినఁగ వాంఛితమయ్యె ననుగ్రహింపుఁడీ
సుతులకు మీకు నే కొఱత చొప్పడఁ బోదని విన్నవించినన్॥ 375

రాము నెడంద లోఁతుఁ గనరాని మహోత్సులు మానమూన నో
రామ! సమస్తలోకనుత రమ్యమనోజ్ఞ గుణాభిరామ! నా
స్వామి! త్వదీయ గాథయిది సాగి నినుం గనుకంటె నాకు వే
ఱేమి యభీప్సితంబనుచు నిట్టులె వింతురు నీకు బాలకుల్॥ 376

అని ముని విన్నవించి దినమల్లె కథాశ్రవణంబు కూర్పఁగా
దినమున కొక్కవేయి యయి తీఱుట కిర్వది నాల్గునాళ్ళు ప
ట్టినఁ దుదినాఁడు రాఘవుఁడు డెందము నిల్వఁగలేని యట్టిఁడై
ఘనముని పాదపద్మములఁ గ్రమకిరీటము వాల్చి యిట్లనెన్॥ 377

అవగత సర్వవేత్తలగు నాత్మవిదుల్ భవదీయబుద్ధి వై
భవమున రాము నాత్మకథ భవ్యతమంబయి శ్రావ్యమయ్యె నీ

భువినిటు నేను శాశ్వతుఁడఁ బూర్ణదయామతి మీకుఁ గల్గుటన్
దివికెగఁ బ్రాకి యీ కథయె దివ్యత గూర్చును జీవకోటికిన్॥ 378

దానికేమిగాని తత్త్వజ్ఞ యామూల
మీ కథా విధానమెంచి చూడ
శక్తి శక్తములకు సాగు నద్వైతత్త్వ
మద్భుతముగ వ్యక్తమయ్యె నిందు॥ 379

రాము నయనంబు కాదిందు రామ యయన
మే ప్రధానమై సత్కథ యొల్ల నడచె
సృష్టి తత్త్వంబు నిట్లు విస్పష్ట పఱచు
సార్థకాఖ్యంబు సాధు రామాయణంబు॥ 380

జటులయి శిక్షితాత్ములయి క్షత్రియ తేజము కొట్టవచ్చు నీ
వటువుల గాంచినంత నవవారిజ సుందర జానకీ ముఖ
స్ఫుట తర లక్షణంబులవి పుష్కలమై యెదఁజొచ్చి కోశ వి
స్ఫుటనమువోలె నాంతరము పూర్ణముగా నెఱిఁగించె నాత్మకున్॥

అయినను మీరు సర్వవిదులౌట యథార్థ మెఱుంగఁ గోరి ని
శ్చయమున కాకరంబయిన సర్వము విన్నపముం బొనర్తు ని
ర్దయ విధి తాడితుండయిన రాముని దేర్పఁడు మీరెఱుంగు నె
ల్లయుఁ గరుణించి చెప్పి సకలజ్ఞులు మీరలెఱుంగ కుందురే? 382

యజన మహీజ తద్రివు కృతాపహృతింగని వత్సరంబు దు
ర్ద్విజు గృహమందె యుండనయి దేవరిపుండటు వంశనాశనం
బజు మనుమండు సేయ విగతాసువె యయ్యె మహీజవహ్నిఁజొ
చ్చి జలము వోలె వెల్వడుచు శీలము చాటియు దుష్టమా విధిన్॥

పాల్యుల దారమోహితుఁడు వల్లభుఁడన్ పరివాద మేచుటన్
శల్యము వెల్వరింప మహిజా త్యజనంబె యుపాయమౌట సౌ
శీల్యము వ్యక్తమై జనము సిగ్గిలు ముందని సత్కృపాంబు పౌ
ష్కల్యులు మౌనులుండు నెడఁజానను డింపగఁదమ్ముఁ బంపితిన్॥ 384

అనుజుఁడు దింపివచ్చినది యార్యుల యాశ్రమ వాటి చెంత నీ
తనయుల యీడు నామహిసుతా త్యజనంబును నొక్కలెక్కయై
కనిన ప్రియా ముఖ స్మృతిని గాఢతరంబుగ నెంతు వీరు త
త్తనయులె యంచు సత్యము నుదారతఁ దెల్పగదే మునీశ్వరా॥ 385

అవనిజ పూర్ణగర్భమున యందుఁ గవల్ కలరన్న సత్యమున్
సువిదితమయ్యెఁ జిత్రములు చూచి ప్రయాసమునంది రామ బా
హువె యుపధానమై నిదురనొందు నమాయికఁ దాఁకి నప్పుడే
కవలగు నీ కుమారకులు కామిని బిడ్డలె యౌదురో మునీ! 386

అని ముని నార్తుఁడై యడుగు నా రఘురాముని నార్ద్రనేత్రుఁడై
కని కని మౌని బాలకుల క్రమ ముఖాబ్జము లందు దృష్టియై
నినుఁగని త్వత్కథా కథన నిర్భరులై తగు నీకుమారులన్
నినుఁ గనఁజేసి నీ కథను నీకు సమర్పణ సేయు కాంక్షతో॥ 387

మనిన సుదీర్ఘకాలమది మాన్యత గాంచెను నేటికిట్లు నా
కనిన తపస్సు పండినది క్ష్మాసుతయున్ మఱి నీవు కూడి మీ
కనిన కుమారులన్ గలియ గల్గిన లోకమె ధన్యమయ్యెడిన్
మనికి కృతార్థమయ్యెడిని మాన్య జగత్త్రియ ధర్మపాలకా! 308

నేఁ దెలియంగఁ జాలునది నీవు నెఱుంగుదు నిన్ను మించి నే
నేదియు నేర నీ మనసు నింపు వహింపఁగ నీదుకోర్కె రా
గోదయ మొప్ప సర్వము నహో విదితం బొనరింతు భక్తిమై
నీదయ నాపయిన్ విరియ నిక్క మెఱుంగుము సావధానతన్॥ 389

తొలుతటి గాథ లిప్పుడవి తోయజనేత్ర వచింపనేల ని
స్తుల భవదీయ నామజప శుద్ధ మనస్కృత వ్యాధుఁడొక్కఁడీ
యిల ముని మాన్యుఁడైన కథ యెల్లరకున్ విదితంబె యౌను నా
కలవియె రామ! నిన్ను గొనియాడఁబడింబడి పుట్టఁబుట్టినన్॥ 390

నారదుఁడాదరించి నినునాకు వచించిన దాది జన్మ సం
తారకమైన నీదుకథ తత్పరతన్ వచియింప నెంచియున్

నేరని చందమై యెదను నిల్చి వచింతు వదెప్పు డంచు ని
న్నారక నామసంస్మరణ నోపికతో జపియించు చుండఁగన్॥ 391

ఒకనాఁడేను సశిష్యుఁడై యెది యెదో యూహించుకొంచున్ బ్రచా
రక పాదంబులు సాగు వెంటఁ దమసా ప్రాంతంబులందేలి మ
చ్చికఁ దత్తీర్థము సన్మనుష్య సుమన స్సీమంబలెన్ శాంతి పో
షకమై తోఁపగ స్నానమాడు మతి నిష్ఠన్ నిల్చి ప్రాంతాటవిన్॥

కనుగొంచున్ మదమందునుంటినపు డక్కాంతార మోరామ! మే
ల్కను చందంబున రంగురంగుల విహంగంబుల్ కులాయమ్ము లు
ర్విని దైన్యంబు భజింప నింగికయి పర్వెన్ శ్రావ్యసంగీత మే
చిన యానాటి యుషస్సు నేటి కటులే చెందించు సమ్మోహమున్॥

తెలతెలవారు వేళ జగతీ సతి మేలి ముసుంగు తీసి తాఁ
గల కలలాడుచున్ నుదుటఁ గస్తురి బొట్టును దిద్దికొంచుఁ బ
క్షుల కలకూజితాళి మిషఁగోమల కంఠము విప్పినట్టులై
పులకిత గాత్రతన్ నిలిచి పుణ్యసమృద్ధికిఁ బొంగునయ్యెడన్॥ 395

క్రౌంచ మిథునం బొకండు నాకంటఁబడియె
వాని చక్కందనంబు నవ్వాని ప్రణయ
చర్యలున్ నాకుఁ బారవశ్యంబు గొలుపఁ
గనులు త్రిప్పక వానినే కాంచుచుంటి॥ 395

ముకుముకు రాచికొంచు నెడముంగన కొండొరు వాని కొంచు వీ
డక పరువెత్తుచున్ దొలఁగి డాయఁగ వేగిరపాటు నందుచున్
నికట ధరిత్రి వ్రాలుచును నింగికి లేచుచుఁ జారు నిస్స్వన
ప్రకట పరస్పర ప్రణయ భావములన్ భువియెల్ల నింపుచున్॥ 396

తమలోకంబునఁ దాముగాఁ దిరుగు నా ద్వంద్వంబు నందంతలో
యముఁడే తెంచిన చందమై యెచటిదో యజ్ఞాత బాణంబు ప్రా
ణము తీయన్ మగపిట్ట తన్నికొనుచున్ ధాత్రిన్ వెసన్ గూలె ని
క్కము వో రాఘవ! యాక్షణాన నెదవ్రక్కల్ గాని వాఁడుండు నే?

విలవిల తన్నికొంచుఁ బృథివీ స్థలికింబడు భర్తఁజూచి యా
విలమతి నాఁడు క్రౌంచి పలవించిన దారుణ శోకగీతి వీ
నులబడి విస్మృతిం బడక నూవుల గానుగ గుండె పిండుసై
నిలిచిన నేల గ్రుంగునన నేటికిఁ గాంతును విహ్వలత్వమున్॥ 398

అపుడు నను నేనెఱుంగ హా యనుచు నోరు
విచ్చుకొని పట్టరాని యావేశ మొప్ప
హృచ్ఛరాసమ్ము విడుచు తీవ్రవేషు వనఁగ
పటు తరంబగు వాక్కు వెల్వడియె నిట్లు॥ 399

మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్॥ 400

అని వెలువడ్డ వాక్కు నియమాత్త సమాక్షర పాదబద్ధమై
యనుదిన మాడుకొనయిన యట్టులు కాక విలక్షణమ్ముగా
మనుపెఱుఁగంగ రానిగతి మోహనమై విన నింపుగాఁగ దా
నినె పలుమార్లు వేళగమనింపక పల్కుచుఁ దత్త్వ మారయన్॥401

పలుకు పడంతి నాయకుఁడు బ్రహ్మ సనుక్షమునందుఁదోఁచి యో
యలఘు తపస్వి వింతపడ కయ్యది శ్లోకమె శోక తీవ్రతన్
వెలువడినట్లు ఛందమది వీనులవిందగు నా యభీష్టముగ్
జలుపగ నీవశంబయిన సారసరస్వతి యం చెఱుంగు మీ! 402

నారదమౌని నీకు రఘునాయకు మోహనగాథ యెల్లఁ బొం
గారుదయన్ వచించె నరుదారగ నీవది కావ్యవైఖరిన్
దీరుపు మింక నాయను మతింబడి సర్వము తేట తెల్లమై
యూరిన యూటగా నుదయ మొందును నీ యెద భావితాత్మకా!403

ఆ పరమాత్మ రామవిభుఁడైనటు త్వన్ముఖనిర్గతామృతా
లాపముగాగ నా శ్రుతి యిలాతల మంతయుఁ జొక్కఁ జేయుసం
దీపిత భక్తినూని నియతిన్ గృతి కింక నుపక్రమింపు మీ
దాపును దూర మేది విదితంబగు సర్వ ముపస్థితంబుగన్॥ 404

గిరులున్నంతకు వాహినీ గణము రక్తిన్ సాగునందాఁక యీ
చరితంబున్ భువి సాధుసజ్జన గణశ్లాఘ్యమ్ముగా నిల్చు ను
ర్వర రామాయణ ముండునంతవఱకూర్ధ్వంబందు మల్లోక సు
స్థిర వాసంబు త్వదార్జితంబగు తపస్వీ! వేదవిద్యానిధీ! 405

అజుఁడటు లానతిచ్చి చనినంత జగత్పతి! రామచంద్ర! వా
రిజభవ సార సారఘ సరిద్విభవంబున మన్మనోంబు జా
తజమయి త్వత్కథానది సుధాసమసుందర వాఙ్నిబంధమై
బుజబుజ పొంగివచ్చి నిను పొందగ వేచిన దిన్ని నాళ్ళులున్॥ 406

తను వెటు లుండనీ మనసు తత్పరమై నిలుచున్నఁ గూరుచు
న్నను నడయాడినన్ బొరలినన్ నిదురంగన మేలుకొన్ననున్
నినుగను టొక్కటే గుఱిగ నీవయి వెల్వడెఁ గావ్యమిట్లు నే
ననునది వేఱె యున్నదగునా! ముని నాయక హృన్నివాసకా! 407

రచనము సాగునంతకును రాని దిగుల్ పొడసూపె నంతమం
దుచితము గాగ నీ కృతి నహో జగమంతకు వించుటెట్లు టం
చచల మనస్కతన్ నిలిచి యాత్మని మున్గి నిమీలితాక్షతన్
విచయన మాచరింతునని వీడిదిగుల్ క్షణకాల మున్నచో॥ 408

తమమూర్ధంబుల నాదుపాదముల చెంతం బెట్టి నీ బిడ్డ ల
చ్ఛముగా నీవె యనుగ్రహించి నటు నాస్వాంతంబు నందోఁప నే
త్రములన్ విచ్చి మనోహరాకృతుల విద్యాకారులన్ గాంచితిన్
విమలోపర్బుధ దివ్యకాంతి విలసద్విస్ఫార పద్మాక్షులన్॥ 409

అయిదవయేట నా కనుల కద్దిన కప్పురమైన వీరు క్ష
త్రియులని సూర్యవంశ్యులని దివ్యసహాయ విశిష్టపావనో
దయులని జంట బిడ్డలని తల్లి వచింప నెఱింగి కొంటి నా
కయిరి సమస్త మీ ద్వయము నద్భుతకావ్య జగత్ప్రశస్తికిన్॥ 410

ఇరువది నాల్గువేల కృతియిద్ది యొకేయొకమాఱు వించు ని
ర్వురు గ్రహియించి నారదులు పూర్ణదయన్ స్వరశిక్ష సేయ న

బ్బురముగ నెల్లవారికి నపూర్వముగా వినిపించు టొక్క చే
నరవర! జీవితాశయము నాఁజరియింతురు మద్విధేయులై॥ 411

తల్లి నటంచుఁ దెల్పికొను తన్వి మహాశయ! లోకమాతగా
నుల్లము నందుఁ దోఁచుఁగను టూర్జితకంధులు, కాంతిగోళముల్,
చల్లగ సర్వలోకముల సాకు పయస్సుల నొల్కఁబోయు వి
ద్యుల్లత తోడి మేఘములు యోగి జనావన మానవేశ్వరా! 412

నామాతీతగఁదోఁచు నాయమ నెడందన్ నిత్యమర్చింతు న
న్నోమన్ దామెయి తాల్చి వచ్చి యపుడప్డుండున్ మదావాస మం
దామెన్ జూడఁగ నెంచెదేని యటురమ్మా జన్మ సార్థక్యమై
యామే నంతఁ బరిత్యజించెదను తండ్రీ! యంచుఁ బ్రార్థించినన్॥

ఆ ముని గుండె లోఁతు తెలియంగల పెద్దలు మౌనమూని శ్రీ
రాముని వంకఁజూడ నెదరాయిడి నందియుఁ దోఁపరాక యా
రాముఁడు శాంతినూన జలరాశి తరంగ విహీనమైనటుల్
సోముఁడు లేనిరాత్రియయి శూన్య మనస్కత గాంచిరెల్లరున్॥ 414

అది భరియింపరాని యటు లర్భకులప్పుడు మోహనార్థ సం
పద లుదయింప నంసగ విపంచికలన్ నినదింపఁ జేయుచున్
మృదుపద మంగళాచరణమెత్తి సమాప్తము సేయ నెల్లరున్
మదుల ముదంబు నొంది బహుమాన పురస్సరు లౌచు మూర్ధముల్॥

ముద్దుగొనుచు వారి మోదంబునన్ దేల్చి
చవధిలేక కురిసి రాశిషములు
రాము హృదయవార్ధి రాకా శశాంకులై
వారు చనిరి మౌని వరుని వెంట॥ 416

## ఖండాంత పద్యములు

ఈయది ప్రత్యభిజ్ఞ జగదీశ్వరుఁ డయ్యును మానవుండు గా
నే యది తప్పదో యది మహీశ్వరుఁడై రఘునేత పొందు రా

మా యణ యజ్ఞగాథ బహుళార్థ సమన్విత రమ్యశిల్ప పా
థేయము జీవయాత్ర కతిథి కృతదేవ! యనుగ్రహింపు మా! 417

జననం బిచ్చిన తండ్రినిం దెలియ వాత్సల్యంబు పొంగారఁ ద
జ్జనకోద్ఘాటక మాప్తవాక్యమున విశ్వాసంబు ముఖ్యంబు, న
మ్మని వాఁడెట్లు రహస్యముం దెలియు? నమ్మాడ్కిఁ శ్రుతిఁ నమ్మి నా
జని మర్మంబు నెఱింగి నీవయను నిష్ఠన్ నిల్తు విశ్వేశ్వరా! 418

సుగంధి. క్ష్మా శతాంగ! చంద్ర ఖండ మండితా! యఖండితా
కాశతుల్య! హృత్థవేద్య! కాశమల్లికార్జునా!
శ్రీశబాణ! చిత్తజారి! చిన్మయా! మహాశయా
వేశ సాధ్య! భక్తహృద్గపీ! పరీక్షితార్జునా! 419

# ప్రత్యానయన ఖండము

❧

## ఈశానము

శ్రీ కాళహస్తి నిలయా!
యాకాశప్రముఖ లౌకికాష్ట శరీరా!
ఐకాత్మ్య సత్యబోధక!
శోకఘ్న జ్ఞానసూ ప్రచుంబిత దేహా! 1

యజ్ఞక్షేత్రము నుండి సర్వులు నయోధ్యన్ జేరు నానాఁడు లో
కజ్ఞుల్ పెద్దలు రాముఁ జేరి మహిజా కల్యాణకాంక్షోద్ధులై
యజ్ఞేశుం డటు బాలకాకృతిని ప్రత్యక్షంబుగా మౌనిరాడ్
విజ్ఞప్తిన్ వెనువెంటఁ దీర్పనగు రావేయంచుఁ బ్రార్థింపఁగన్॥ 2

స్మితపూర్వ ప్రతిభాషి రాముఁడటులే చేయం దగుంగాని త్మ
సుతయే బిడ్డల తల్లి యాననుచు వాక్శుద్ధుండు పల్కుండు స
న్మతి యాతం డొనరించె లోకజన నీ మాహాత్మ్య గానంబు త
త్సతి దర్శించి యనుగ్రహింపుమని స్తోత్రం బొప్పఁ గోరందగున్॥ 3

ఆ జననీ మతల్లి మునియాశ్రమ మందెపు డుండునో? సుత
వ్యాజమునన్ బదింబదిగ వచ్చునో రాదో? నృపాల మాత్రుఁడో
యీ జనుఁడేగు దెంచెనన నిచ్చునె దర్శన? మాత్మసిద్ధులే
యోజను నైనఁ దల్లిఁ గనుచుందురు సర్వగ యాచు నుండుటన్॥

అని యూరకుండిన నా పెద్దలు 5

గంభీరంబగు రాముభాషణము వ్యాఖ్యానౌక లేకుండ క్షీ
రాంభోధిం బలె దుష్ప్రవేశమయి ప్రత్యాఖ్యానముం జేయ కే

స్తంభీ భూతులుగాఁగ నిల్చుచుఁ బునస్సంజాత సంజ్ఞాకులై
సంభావించి చనంగ రాముఁడెదలో సంరంభమే పారఁగన్॥ 6

అన్నియుఁ దేవి యొక్క ముడి యాపినదింతకు లోకమాతగా
నెన్నెను మాని జానకి నహీన గుణాన్విత నట్టు లెన్నెఁ దా
నన్న యథార్థమే యగున మైనను పేరదియేల చెప్పఁ డీ
చిన్న ముడిన్ విడల్చుకొని శీఘ్రము యాయముఁ జూడఁగావలెన్॥ 7

బిడ్డలు నాదు బిడ్డలని విస్ఫుటమై యెదఁదోఁచుచుండెఁ గ
న్పడ్డ క్షణాన నట్టి యనుభావము కల్గుట సత్యమే యగున్
గడ్డకు చిక్కకగ్గె నసఁగా ముని బాలక బద్ధ దృష్టియై
యొడ్డి కొనంగ నిట్లనియెనో యనిపించును జాగరూకతన్॥ 8

అగునగు నామె నామ మసలాతనికిన్ బ్రకటించి యుండ దా
బిగువున నుండి యుండు ప్రభవించిన సూనుల శ్రేయమెంచి య
ట్లగుట మునీశ్వరుండును మహాశయుఁడై ప్రకటింప లేదు తా
నుగ సకల మ్మెఱింగియును నూల్కొనఁడించుక గుట్టు విప్పఁగన్॥ 9

పతి పత్నిన్ ద్యజియింప నజ్ఞజన భావంబందు శీలంబె శం
కిత మౌటెంతయు సాజ మట్లగుట యుక్తిన్ దత్పరిత్యక్త సం
వృతయై యెవ్వరో దేవతా సతియనన్ వృత్తాంతమున్ డాచి జీ
విత మెచ్చోటనో యెట్టులో గడపు నావేశంబు లేకుండఁగన్॥ 10

తనుఁదా రక్షితఁ జేసికొంచు సుతులన్ దద్వార్త సుంతేని చే
రను రానీక పునః పరిగ్రహణ దూరంబైనఁ బెల్లోర్పుతో
మనఁగా నౌనని సర్వరక్షకముగా త్మ్మోజాత వర్తించెఁ ద
ద్ఘన శీలన్ జగదేకమాత యని వక్కాణించు టాశ్చర్యమే? 11

మా కథ యన్నపేర ముని మాన్యుఁడు చెప్పిన దాత్మగాథ తా
నేకము నద్వితీయమయి యెట్లును భిన్నముకాని శక్తి మా
యాకృతి సర్వసంస్కృతి విహారము సల్పఁగ భిన్నభిన్న మా
పోకల నొప్పి యభ్యుదయమున్ గనఁ జేయుటె తోఁచునెల్లెటన్॥

ఆ కథ యెల్ల మా సుతుల కబ్బఁగఁ జేసెను వారు జానకీ
శోక కథా సుధారసము చుబ్బన చూఱలఁ దాముఁగ్రోలి ము
ల్లోకములట్లు క్రోలునటు శ్లోకముల బఱియించు చుండి రు
త్సేకము తోడ రాముఁడును సీతయు వారికి దేవతాకృతుల్॥ 13

సీతారాములు తల్లిదండ్రులనుచో సిగ్గందరీనాఁడు ప్ర
స్ఫీతాత్ముండగు మౌని చంద్రుఁడిటు మా శ్రేయస్సు కాంక్షించె మ
చ్చేతం బెంతయు ముగ్ధమై ముని జగచ్ఛీతాంశు నమ్మాన్యు లో
కాతీతుం గని భక్తిమై యెఱిగి రా నా వేశముం బొందెడిన్॥ 14

అయినను నేనెటుల్ చనఁగ నౌను? యదాగతి విప్రయోగ మి
ట్లయినదొ యద్ది నిర్గమన మందిన నేగుట నాకు యుక్తమౌ
నయినదొ లేదొ నేనెఱుఁగ నంచు రఘూత్తముఁ డందెసుప్తి; ని
శ్చయమతి సుస్థిరంబయిన స్తంభమె యూబిని గుంజ కాదహో! 15

నాటి మొదల్ పురిన్ దినదినంబును రాముని జూచు నెల్లరున్
సూటిగఁ దెత్తురీ నుడిని చూపులఁ జేతల మాటలందు న
ప్పాటితవైరి మానసము వ్యక్తము చేయక నిత్యకృత్యము
ద్ఘాటన చేసి పంపునది కష్టమె యైనది పౌరకోటికిన్॥ 16

జ్యోత్స్నాపతి రాము నెల్లరు నెకాయకిఁ జూడఁగ లేరు చూడగా
నోపిన పెద్దలెల్లరును నూర్జితు నెట్లు కదల్పలేక యా
రాపు భరింపరాక విడరాని మనోవ్యథ నందుచున్ బరీ
తాపము వ్యక్తమౌనటులు త్రవ్వుదు రెల్ల కథావిశేషముల్॥ 17

వారినిబట్టి వారును నవారిగ వారును వారు నెల్లరున్
గోరున దొక్కటే యనఁగఁ గోడయి కూసెను లోకమెల్ల రా
మా! రఘురామ! లెమ్ము నిజరాముని జూడగ నిమ్ము మమ్మునో
రార నుతింపనిమ్ము జగదాభరణంబును జానకీ సతిన్॥ 18

చార ముఖమ్ముగా భువిని సాగు సమస్త మెఱుంగుచుండు నా
ధీరుఁడు రామచంద్రుఁ డవధీరిత సీత జగత్ప్రశస్తి నిం

డారఁగ నందుచుండుటకు హాయినిగాంచియుఁ దోఁపనీక యే
మారుపులేని యట్లై విసుమానముగా దినముల్ నయింపఁగన్॥ 19

వైశాఖంబును జ్యేష్ఠముఞ్ జనియె బ్రాప్తాషాఢమై భూమి స
ర్వాశల్ క్రమ్మిన రామగాథ కృతకృత్యంబై సమస్తావనీ
దేశప్రాణి హృదంతరాళముల నుద్వేగంబు నందించి యా
శ్రీ శస్థాణుత స్పందనంబుఁగన వాంఛింపించె గాఢంబుగన్॥ 20

ఎదమొద యొక్కొకండగుచు నెక్కడి కక్కడ భిన్న భిన్నమై
పొదలుట జీవదృష్టి యది పూనిన దేహము దాటి స్వార్థముఞ్
వదలి పరార్థ భావనకుఁ బాఱిన యంత నఖండి తాత్మయై
పొదలుట తత్త్వదృష్టి జనముల్ కని రయ్యది రామగాథచే॥ 21

అందఱు నొక్కరీతిఁ గృతకాకృతులన్ విడి స్వస్వరూపులా
చందము దోఁప నెవ్వరెట సాగిన రామవిభుండు జానకిన్
బొందినగాని స్వాస్థ్యమును బొందగఁ బోమని సర్వవేళలం
దిందుముఖి మహత్త్వమునె యెంచుచు నామె స్తుతించుచున్నచో॥

ఇన్నాళ్ళెండల కెండి యెండి యిఁక నీ యెండన్ భరింపంగఁ జా
లన్నేనంచుఁ జరాచర ప్రకృతి గోలంబెట్ట నక్కూయి తా
మన్నించెన్ జగదీశుఁడన్న పగిదిన్ మాలామనోజ్ఞంబులై
స్విన్నాంభోదము లుద్భవించినవి లక్ష్మీకాంతు గాత్రంబులై॥ 23

శబ్దంబే గుణమైన యాకసము విశ్వవ్యాప్తమై యుండి ని
శ్శబ్దంబై యనుభూతి వేద్యమగుఁ దచ్ఛబ్దం బుదారంబుగా
నబ్దం బుద్భనమంది యాకసము దృశ్యంబైన యట్లుండు రా
మాబ్ద వ్యాప్త వసుంధరాజ ఘనకాలాంతర్యమా బ్రహ్మమా॥ 24

ఆకాశంబును బ్రహ్మ మొక్కఁడయి వేదాకార శబ్దోద్భవ
శ్రీకంబై నపుడాకృతిం గనిన సుస్నిగ్ధాంబుదాకారుఁడౌ
లోకాధీశుఁడు రాముఁడట్టి తఱి లోలోనుండఁగా లేని య
ట్లై కాలానుగుణత్వ మొప్పి యపుడప్డాకాశముం గాంచుచో॥ 25

అనలానిలాకాశ ఘన మబ్ధమై పున
ర్ఘనము క్ష్మాయాట నిక్కమని తెలుప
నన్యోన్య సంబంధ మవిభక్తమై తోఁచి
యన్నియు నేకమ్మె యనుచుఁ దెలుప
ఝడితి స్ఫురత్తటి చ్ఛా ర్వాంతరాకాశ
మానంద విస్ఫురదాత్మఁ దెలుప
సస్యానుకూలవర్షా సముత్సేకంబు
జీవకారుణ్య విస్తృతిని దెలుపఁ
జూచుఁ జూపుండ వలెఁగాక చూచువాఁడు
చూచునట్టిది తన్ను తానే చుమా య
టంచుఁ దెలుపునో నాఁగ నాఁడాత్మయందు
రామచంద్రుండు రమియించు రాణఁ దోఁచె॥ 26

సీతా మహాసాధ్వి శ్రీరాముఁ జెందింపఁ
గాలేక దినము గగ్గోలు పడున
గాంభీర్యమెల్ల గంగం బోవనారాముఁ
డుగ్గ బుట్టిన దుఃఖముబికి పడున
ఆర్తాఖిల ప్రాణి యంతరంగ క్షోభ
మాకాశమై యిట్టు లదరి పడున
ధరణీ గగన తుల్య ధరణిజా శ్రీరామ
యుక్తి యెట్లని విశ్వమూగి పడున
యన్న యట్లుగ లోక మల్లాడిపోయె
మంటికి న్మింటికి న్మధ్యఁ గుంటుపడక
యెడతెగని యేకధారగాఁ బడిన వాన
పెల్లున జగము తడిసి తపించుటయ్యె॥ 27

పతచ్ఛ్రావణ వర్షదంబుద జవం బిట్లేడు నాళ్ళుండి యా
భీతాహంబికఁ జాలు నన్న పగిదిఙ్ విశ్రాంతి నొందంగ ప్ర

స్ఫీతాంశుండయి మిన్ను విచ్చుకొని కన్పించెన్ జగచ్ఛక్షు వా
నేతం జూచుచునే సమస్త జగ మందించెన్ నమోవాకముల్॥ 28

ఉన్నట్లుండి నభోముఖంబు విడి యప్పుద్భూతమయ్యెన్ మహో
పన్నత్సో సకలార్తి వారకముగా స్పష్టార్థమా వాణి "నీ
కున్నే మోహము రామచంద్ర! త్రిజగం బుల్లాసమందంగ నీ
యన్నుం దెమ్ము కుమార యుక్తముగ రాజ్యంబేలు మక్రాంతముగ్"॥

ఆ మాటల్ విని సర్వలోక మపుడాహ్లాదమ్ము పొంగెత్త "రా
మా! మా కోసము సర్వలోక యువతీ మాణిక్యమా జానకిన్
ప్రేమన్ దెమ్ము కుమారయుక్తముగ నా ప్రేలాపమానాఁడె యీ
భూమిన్ మాసిన దింక నోర్వఁగలమే భూజాత లేకుండఁగన్॥ 30

ఎవఁడో యొక్కఁడటాడెనంచు జనమందెవ్వారికిం దెల్పకే
నవలారత్నము దింపి రమ్మనుచు నాజ్ఞంబెట్టి తా తమ్మునిన్
భువి సర్వస్వము నేఁడిటుల్ సతికి మోదమ్పొంగేలు సంధించి త
ల్లి వి రక్షింపు మటంచు వేడ వినవే లీలా జగన్మోహనా! 31

దివముల్ నేఁడు తెగించి మోహవశతన్ దేలేదు నీవామె నీ
భువికిన్ మేలగుపొంతెఁ దజ్జననితోఁ బూర్ణుండవై యేలుమా!
నవనీలాంబుద కాయ కాంతి కలితా! నా స్వామి! యంచున్ మహో
త్సవమై లోకము పొంగఁబల్కె నలసత్వంబింక నేలా ప్రభూ! 32

అని జనముల్ నిరంతరము నాడుచు నుండుట సాగి సాగి త
ప్పని సరియైనఁ దామెచని భవ్యమునీంద్రుదు తపోవనంబులన్
గని జననీ మతల్లిఁ బదకంజములన్ బడి వేడి తెచ్చు నూ
హను గలరన్నవార్త విననాయెను రాముఁడకంపితాత్ముఁడై॥ 33

అసలు భద్రుఁడు దుర్ముఖుఁడైనవాఁడు
సుముఖుఁడై సరాసరిగఁ దెచ్చు శుభవార్త
వినియుఁ గదలని రామభద్రుని యెడందఁ
బట్టఁజాలక భద్రుఁడభద్రుఁడయ్యె॥ 34

నాఁడేకాదశి నాఁడె సర్వులును యజ్ఞక్షేత్ర సంజాతనే
వేడం బోదమటంచు నూర్వెడిచి యావేశంబునంబోవ లే
దూడన్ వెన్నడి సాగు గోవనఁగ ముగ్ధుండై రఘూత్తంసుఁడా
నాఁడేగన్ జనబృంద మందిన మహానందంబు వంద్యంబగున్॥ 35

అంత బిగువున రాఘవుం డాగి యాగి
జనము సాగినఁ దానునుం జనుట యొప్పె
నాత్మ నిస్సంగ మై నిష్క్రియంబు నగుచుఁ
గదలు జీవుని బట్టి తాఁగదలు టగును॥ 36

అవికృతుఁడౌట నాతనికి నౌనది యేదియు లేదు దేవ మా
నవ హిత సాధనమ్మునకయి నాఁడు శరీరము దాల్చె నమ్మతో
నవని సమస్త మామెబడి నద్భుతుఁడై పొనరించి మించెఁ దా
నవనిజ వీడెనా? జనని యట్లు తలంచెన లక్ష్యసిద్ధికై॥ 37

జనముల నట్టి మాట కొనసాగుట హేతువు చేసి యామె యే
చనినది యోజనం బటులు సాగుట కాకరమైరొ వారె నేఁ
డురువడి నామెఁ దెచ్చుటకు నూకొన నూకొనె తాను, తానుగా
బరగునె స్వామి సంసృతిని? పట్టువడం డెటఁ దానె పర్వమై॥ 38

హృదయోద్వేగము పాదముల్ బడసి తానేగున్ మహానార మ
య్యది మోదంబు ఘటింప రాజరథ మధ్యంబందు సీతాకృతిన్
బదిలంబున్ బొనరించి తా డిగుచు నవ్వారిన్ సమీపింప నొ
ప్పిదమై యాపద యాత్ర సాగినది దేవీభక్త యాత్రావిధిన్॥ 39

అరదము డిగ్గి రాఘవుఁడు నవ్వల పోలిక పాదచారియై
త్వరితగతిం కనఁ గని పట్టపు టేనుఁగు ఛత్ర చామరాం
బర ముఖ రాజలాంఛన సమన్వితమున్ గొని తెచ్చె లక్ష్మణుం
డరు సము పట్టరానిదయి యందఱు జై యని దేవి నెన్నఁగన్॥ 40

ఒక యావేశము వెంటఁబోవు జన మయ్యున్ దత్సమాజంబు నం
దకలంకంబగు భక్తియుండుట నదే యవ్వారి కత్యంత శి

క్షకమై చెక్కలు విచ్చి యేగు గరుడాకారంబు తీర్పించె నొ
ద్దిక పుచ్ఛంబున రాఘవుండమరె భక్తిన్ దమ్ములే తేరగా॥

ఊరూరన్ జనబృందముల్ కలియుచో నుప్పొంగె సౌపర్ణుఁడా
సౌరుం గాంచి దివౌకసుల్ త్రిజగతీ సౌభాగ్య వాల్లభ్య మం
దారూఢింగను నా మహో జనత కాహ్లాదంబు సంధింప నా
దారిన్ మేఘవితానముల్ నిలిపి పై దారిన్ బ్రయాణించుచో॥ 42

నరనారీగణ ముర్వి సాగునటులే నా కౌకసుల్ సాగి రం
బరమం దట్లగు జంట వాహినుల పూర్వంబౌట నా రెంటి న
బ్బురమై చూచిరి చూడఁగల్గిన తపః పుణ్యాత్ము లిక్ష్వాకు వం
శరమా రక్షకులా వశిష్ఠులు శుభాశంసల్ ప్రవర్షించుచున్॥ 43

మనసు తానెంత వేగమై కనిన గమ్య
మట్లె దేహంబు కను టసాధ్యంబుగాన
గోమతిందాటి సురగంగకుం జనంగ
నారమున కట్లె పట్టె దినద్వయంబు॥ 44

హనుమయు నంగదుం డిచట నచ్చట సుస్థిర తీర వృక్షముల్
పనివడి పట్ట వారి బడబద్ధులు గానయి తక్కువానరుల్
క్షణమున గూర్చు వంతెనను గాలువ వోలిక గంగ దాటి యా
జనము కృతజ్ఞమూచు భవసాగరమున్ దరియించి నట్టులై॥ 45

హనుమను నంగదు పొగడగ
వినమితులై వారు రాము విభుదెస మ్రొక్కన్
జనపతి పట్టపు టేనుఁగు
కొని తేఁగా నవలి యొడ్డుకుం జనె ప్రీతిన్॥ 46

రాజ రథస్థితావనిజ రాక రథంబున నట్లె యుండె నీ
భూజను లెల్లరున్ విభుని బొమ్మను గాంచుచు నుండిరంత ని
ర్వ్యాజ కృపామహోన్నతుఁడు వారిధి లంఘన చాతురీ కథా
భ్రాజితుఁడందఱుం గనగ స్వర్ణమహీజను దెచ్చి యేన్గుపై॥ 47

ఉనుచుటతో ముద మొందిన
జనగణ గళకాహళములు జయనాదంబుల్
పొనరించెను జన విభునకు
జననికిఁ దద్భక్తవరుఁడు సామీరికినిన్ ॥ 48

ద్వాదశి రాత్రి యెల్లయును బట్టి నటుల్ జన మెల్లవారు తా
మా దెసకుం జనంగ నపుడందఱ భాగ్యము పండినట్లు సూ
ర్యోదయమయ్యె నెల్లరు మహోత్సుకులై విరచించి కాల్యముల్
చాఁదిన భక్తి భానునకు జాగిలి మ్రొక్కుచు నున్న యంతలో॥ 49

పొడుగున గంగ యొడ్డుబడి పుట్టలు వేలకొలంది పుట్టి వె
ల్వడిన పిపీలికల్ బలె నపారముగాఁ గనిపించు నాజనం
బెడ మడఁగంగ క్రిక్కిరియు టెంతయు విస్మయమై వనంబు లం
దెడపెడ గాఁగనుండి గమనించిరి ప్రాంత తపస్వి బాలకుల్॥ 50

అటకే తెంచిన వాని కన్గొనియె సర్వా యోధ్యయే కాదు త
త్తట మందున్నది కోసలావని సమస్తంబందె యుండెన్ బరి
స్ఫుట భక్తిన్ దొలుకాడు నాస్యములతోఁ బొల్పారు నవ్వారిఁ జూ
చుటతో రాముఁడు వచ్చెనా యనెడి యౌత్సుక్యంబు దీపింపఁగన్॥

అదుగో రాముఁడటంచు వెల్వడిన మాటై నా కుజాతుండు వెం
బడి శిష్యుల్ బరువెత్తిరాఁగఁ జనియెన్ భద్రేభ పార్శ్వస్థుఁడై
మృడ తేజో విభవానఁ గాననగు లక్ష్మీకాంతు సేవింప నా
యొడయఁడున్ గనె వచ్చు వాని సముఁడై యుత్ఫుల్ల నేత్రాబ్జుఁడై॥

స్వామీ నీ విటు లేగుదెంచితివి వాత్సల్యంబు పొంగార నిఁ
కేమైనన్ గృతకృత్యతం గనెదు రావే మత్తపోభూమి స
ర్వా మోదంబుగ నీ వటన్ నిలువ సత్యావిష్కృతిన్ శ్రేయమై
క్షేమంబెల్ల జగత్తు పొందగలుగున్ శ్రీశా! జగన్మోహనా! 53

అని ముని మోదబాష్ప కలికావృత నేత్రయుగంబు లోని రా
ముని గనఁ జేయునాఁ దనకు ముందగు రాముని దివ్యరూపమే

కనుగొనుచుండ బాలకులకై యటు నిట్లుగఁ జూచి కానమిన్
జనవరుఁడా మునీంద్రు పదసారసముల్ పెనుభక్తి క్రొమ్మొక్కుచున్॥

ఓ మహనీయ! నీదుకృప నుజ్జ్వలమైన చిదాత్మగాథ న
న్నోమిన నీ భువిన్ మనికి యార్జిత మయ్యెను విశ్వసార నా
దామృత వీచిగా హృదికి నందఁగఁ జేసిన యాకుమారు లే
రీ? మురళీ మనోజ్ఞ మృదురీతిని గానము చేసి రయ్యెడన్॥ 55

నా యెదవారిఁ జూచుచుఁ బున శ్శ్రవణం బొనరింప గాథ వాం
ఛాయుతమాచు శాంతిఁ గనఁ జాలమి నిల్వక వీరి వెంట రా
నా యెను వారి తల్లియను నాయమ జానకి యే యటన్న ని
శ్చాయక బుద్ధి వీరిటులు సాగిరి తత్త్వవిదాం వరాగ్రణీ! 56

అనుచో రాముని నిర్మమత్వ మది యూహాతీతమై తోఁపఁ ద
ల్లిని ధ్యానించి క్షణంబు మౌనమున నిల్చెన్ మౌని యల్లంతలోఁ
గనులన్ విచ్చి రఘూత్తముం గనుచు రక్షాదక్ష! రామా! వినూ
తనమౌ ప్రక్రియ మత్కృతంబయిన నృత్యప్రౌఢ దృశ్యంబునన్॥ 57

మనసై యింద్రుఁడు శిక్ష నందుటకునై మాన్యాప్సరోవారమున్
బనిచెన్ వారిట మాసముండి కృతి యభ్యస్తంబుగా నింద్రు మ
న్నన నందన్ జనుచుండి రక్షణకునై నానా మహాస్త్ర ప్రయో
గ నిధుల్ బాలురఁ దోడు రమ్మనఁగ స్వర్గం బేగి రన్నంతలో॥ 58

అరుగో బాలుడు బాలు రన్న నుడియై యాకాశ మార్గంబు నె
ల్లరు చూడంగఁ గుశలవుల్ దిగిరి బాలప్రాయ రామ స్మృతిన్
బరమానందము నందఁ జేయుచుఁ గవల్ ప్రాచేతసున్ భక్తి క్రొమ్మొ
క్కి రఘూత్తంసుని పాద పద్మముల నర్థిన్ మొక్కి రానమ్రులై॥

మౌని వరుండు తా ననిన మాటలలోఁ గవ లస్త్రవేత్తలన్
దానికి డెంద ముల్కి పడ దారకులన్ గనుగొన్న రాముఁడా
రానిసువుల్ మహాస్త్రమను రాజము లెట్లు గడింపఁగల్గిరో
ధీనిధులౌదురంచు హృది తేటి ముదంబున వారి నిర్వారన్॥ 60

లాలనమొప్పఁ బార్శ్వగతులై బొనరించి యనుంగులార! మీ
యాలపనంబు వించు ముదమందఁగ వచ్చితి వచ్చు వెంట మీ
కేల కనంగ రా రనుచు నీ ముని నడ్గితి నంతలోననే
వాలిన దేవతాకృతుల వచ్చితి రాత శతాయురున్నతుల్॥ 61

మునివర్యుండు వచించె నచ్చరలు మిమ్ముంగోర రక్షార్థమై
చనినారంట మహాస్త్ర వేత్తలగుచున్ సంతోష మయ్యెన్ మిముం
గనగానే యెఱుఁగంగ నయ్యెనట మీ కౌకేళి మీరింత వా
రనఁగా నా మది తృప్తినందుచు నమందానందముం బొందెడిన్॥ 62

అవును గాని వీరకృతాస్త్రులని యెఱుఁగుదు
ననుపదిష్టమ్ము గాఁగ మహాస్త్ర విద్య
పట్టువడఁజాల దెంతటి వారికైన
నెట్టులబ్బెను దగ్గురు లెవరు మీకు? 63

తెలిసినఁ జెప్పుఁడన్న జగతీ పరిపాలన దక్ష! రామ! మా
తెలిసిన సర్వ విద్యలకు ధీనిధు లీ మునులొక్కరే గురుల్
నెలకొను ప్రేమ మమ్ము నుపనీతులఁ జేసిన యంతలోననే
వెలసిన వీ మహాస్త్రములు వీరనుతంబులు జృంభకాస్త్రముల్॥ 64

గురుకృప కాక వేఱొకటి గుహ్యతమంబులఁ దెల్పఁ జాలునే
పరమ నిగూఢమైన యను భావము గల్గు మహాత్ములాట చే
నెఱుఁగని దుండఁజాలదని యెంచెద మంతియకాక తత్కృపన్
గఱచితి మేక వీరుఁడనఁగాఁ దగు నీదగు పుణ్యగాథయున్॥ 65

తెలిసి సమస్తలోక నుత దివ్య గుణాఢ్యుని, నేక బాణ వి
హ్వాలిత గభీరవార్ధి, నచలాయిత రాక్షస దేహపాతనో
చ్ఛలిత నిశాత బాణుని, ప్రశంసిత ధార్మికు, రాము నిన్ను మా
తెలియని వున్నె దేవ! భవదీయదయామహిమ మమ్ముకానగున్॥ 66

అనుచుఁ గుమారులన్న తఱి నా రఘురాముని డెందమందుఁ దోఁ
చినది హఠాత్తుగా మునుపు సీత వినమ్రత నస్త్ర చిత్రముల్

కనుగొని యాడినప్పుడవి గర్భము నందెడు గాతమంచుఁ దా
ననిన యనుగ్రహంపు నుడి యంతటఁ దీఱిన వన్ని శంకలున్॥ 67

శంకా శంకువు తీఱి నంతట ముఖస్థానా వృతాశ్మ స్థిరా
తంకం బొక్కట భిన్నమై చనఁగ నంతస్సార మొక్కుమ్మడిన్
బింకంబేది బహిర్గతంబగు నటుల్ పృథ్వీట్ హృదావేగ మే
ణాంకాకారుల నిర్వారం బొరయు చూహాతీతమై పొర్లినన్॥ 68

స్వామీ స్వామి యిదేమి పొంగనుచు వత్సల్ రాము బాహుద్వయం
బామై పూనఁగ నాతఁడిర్వురను గాఢాశ్లేష మందుంచి త
ద్భ్యామ బ్రహ్మ పదంబు నందినటు స్తబ్ధుండై చిరంబుండి త
త్సోమాస్య ద్వయబద్ధ దృష్టియయి నాతో రండు మీరిట్లనన్॥ 69

వారును లేచి రాము నిరుప్రక్కలఁ జేతులు పూని యేగుచోఁ
బోరన నెల్లరున్ మదుల పొంగు వెలార్పగ గంగయొడ్డు నం
దారవి శిష్య సేవ ముదమారగ నందుచు రావి నీడలోఁ
దేఱెడి రాజహస్తిగల తీర్థము చేరిచి రాముఁ డుండఁగన్॥ 70

ఏలికయైన రాముఁడటు లెట్టెదుటన్ నిలుచుండ బట్టి యో
బాలకు లాడు కేలికలు భావినటన్న తలంపు గల్గియో
చాలిత దీర్ఘ హస్తమును జాచి కుమారుల మూర్ధదేశముల్
లాలన మొప్ప ముట్టి మృదులమ్ముగ నట్టిటు లూగియాడుచున్ 71

పదముల్ వంచి కరంబునెత్తి మధురాహ్వానంబుగా ఘీంకృతిన్
బ్రిదులం జేయఁదదీయ పృష్ఠమున దేవీ మూర్తితోఁపన్ రమా
స్పద మా స్వర్ణ మయాకృతిన్ జనని యే సందర్శనం బిచ్చి న
ట్లుదితంబౌ పెనుభక్తి బాలకులు శ్రేయో మూర్తియా తల్లికిన్॥ 72

నతులర్పించుచు దానికిన్ దెసల జ్యోత్స్న మోహనాబ్జాస్యులై
సుతులుండన్ బతి యంక సంస్థిత నవాసు ప్రాయ పుత్ర ద్వయా
న్వితయా జానకిఁ గాంచి నట్లగుచు దేవీయంచు నెగ్గెత్తుచో
సుతులు ద్విగ్నులు రామునాదుకొని వాచో నిస్స్వనం బొప్పఁగన్॥

బొమ్మైయున్నది యమ్మ యచ్చట ప్రభూ! మున్యాశ్రమంబందుఁ దా
నెమ్మై నుండునొ యక్లై యున్నదిట భద్రేభస్థితిన్ దేవివై
యిమ్మై పూజల నందుచుంట మది కెంతే మోదమయ్యెన్ గటా
క్షమ్ముల్ విప్పి యెఱుంగఁ జెప్పఁగద వే క్ష్మాజాత మా తల్లియా?74

తల్లి నెఱింగియున్ సుతులు తత్త్వమెఱుంగుట దుర్లభంబు మా
యుల్లములందు నీదు కథనున్న సతీజగతీ శిరోమణిన్
దెల్లముగాఁగ లోకజననీ మతి నిత్యము గొల్చుచుండియున్
దల్లి తదాత్మ యాననెడి తత్త్వ మెఱుంగక యుంటి మయ్యరో! 75

గురువులుగూడ మా కెఱుక గూర్పఁగ లేదిట మేమె కాలమం
దెఱుఁగఁగ నెంచిరో జనని యెంతయు మాకయి వేచియుండు, రం
డరుగుద మంచు వేడగజ మద్భుత మా మృదురావ మొప్పఁ దా
నొరిగియె యుండ రామ విభుఁ డూర్జితుఁడెక్కెఁ గుమార యుక్తుఁడై॥

జయరామా యను మోదఘోష విపులాశా వ్యాప్తమై మ్రోసె సం
శయముల్ వీడి కుమార యుక్తుఁడయి విశ్వప్రాణి లోకంబు త
న్మయమై వెంబడి వచ్చుచుండఁగ మహానాగంబుపై నెక్కి స్వా
శ్రయమౌ నాశ్రమ వాటి లక్ష్యమయి కౌసల్యా సుతుం డుండుటల్॥

విని జనకాత్మజాత తన వీనుల విన్నది సత్యమో యెడం
దను నిరతంబు మ్రోయునది తథ్యమొ రెండు నభిన్నమౌనొ యే
మనియును నిశ్చయంబు కననప్పుడు చేయఁగనైన దేమి యౌ
నని తలపోయు చాత్మవశయై తనయందె మునింగి యుండఁగన్॥ 78

సకుమారుండగు స్వామిఁ దెచ్చు ద్విపరాజం బాశ్రమద్వార వీ
థిక నిల్వన్ ముని పత్ను లెల్లరు సుధీధ్యేయున్ సమీపించి స్వ
స్తిక పాత్రంబుల నెఱ్ఱనీళ్ళులను దృష్టిందీసి యారాత్రికం
బకళంకంబుగ నిచ్చి స్వాగతము లొయ్యంబల్కె నయ్యర్భకుల్॥ 79

జననీ యంచుఁ దదీయ పర్ణకుటికుత్సాహంబునంబోయి యం
దు నెటంగానగ రాక నీ పవన మందున్ నిల్చునాఁడోఁచి యే

గిన నవ్వారిని బట్టి తాను చని రక్తిం గాంచె శ్రీరాముఁ డ
జ్జననీ రత్నము యోగినీ మణిని శ్రేష్ఠశ్లాఘ్య శీలోన్నతన్॥ 80

నీప వృక్ష చ్ఛాయ నిద్దంపు తిన్నెపై
నలికి ముగ్గులు పెట్టినట్టి చోటఁ
బఱచిన నవకుశాస్తరణంబు పై సాంగ
కృష్ణాజినము మనః కృషిని దెలుపఁ
బై పట్టు వస్త్రంబు పఱచి పద్మాసనా
సీనయై యోగ సుస్థిరత మెఱయ
బోర్లగించిన గవ్వఁబోలు కన్ డిప్పలఁ
దరణి రశ్మల తళ త్తళలు నిగుడ
జానులందాకు పద్మనాళానుకారి
బాహులత లుల్ల మొలికించు వాహినులుగ
శాంత గంభీర పూర్ణ కాసారమైన
నిశ్చలాత్మీయ సతిఁగాంచి నిల్చె విభుఁడు॥ 81

గురువుల్ శిష్యులు నవ్వశిష్ఠులును దక్కంగల్గు మౌనీశ్వరుల్
సరి నిర్వంకల నిల్చి మౌనమున వాత్సల్యప్రపూర్ణాత్మ ని
వ్వరి ముల్లంతఁగ విచ్చునో కనులు సంప్రార్థింపఁగా వచ్చు నం
చరయన్ నిల్చిరి సర్వులున్ బయల నిర్యత్ప్రాణముల్ పట్టుచున్॥

అది సాక్షాజ్జగ దేకమాత స్వపురంబైనట్టు, లాత్మేశ సం
పద సర్వస్వము నందె యున్నట్టు, లసంభావ్యమ్ము సంభావ్యమై
పొదలుంగాక వికారమున్నదియె సంపూర్ణాత్మ కేనాఁడటం
చుదితంబైన మనస్సమాధిగని నిత్యోత్సాహులై రెల్లరున్॥ 83

అద్దంబం దగుపించు బొమ్మగుణముల్ యాథార్థ్యమై తోఁచి య
య్యద్దం బట్లు వికారమందె ననఁగా నాశ్చర్యముం గొల్పి తా
నుద్దీప్తం గనుచుండు నంతియ నిజంబూహింప నిర్లేపమా
నద్దంబున్నది లేనె లేదితర మున్నట్లుండు తత్సన్నిధిన్॥ 84

ప్రతిబింబంబును బింబ మద్దమని సంభావించు టింకొక్కఁడౌ
గతి లేకంతియ యున్న దాత్మయొకఁడే కాలమ్ము దేశమ్ము త
ద్గ్వితయోద్భూత సమస్త విశ్వమిది దేవీమూర్తియౌ దేవి సం
స్తుతమౌ నాత్మ కభిన్నయై యెసఁగు నెందున్ దానయై యుండుచున్॥

మాటేమున్నది యాటయేమి కలదమ్మా నీవు రాకున్నచోఁ
జాశై లోపలి మాటుమూల గదిలో స్తంభించునాయయ్య నా
రాటం దెచ్చితి ప్రోదిచేసితివి బాహాటమ్ముగానాడె నీ
నాటన్ నాటక మంతయున్ రసధునీ స్నాతమ్ము గావించుచున్॥ 86

నీవు న్నేనని వేఱుగా మనుటలో నిర్నిద్ర లీలా జగ
ద్భావాంభోధి ప్రపంచితంబగుట సర్వశ్రేయముంగూర్చు త
త్కైవల్య స్థితి నందఁ జేయుటకె యౌ కామేశ్వరీ! రాగదే
దేవీ! యంచు హృదంతరాంతరములన్ దేవీస్తుతుల్ సాగుచో॥ 87

రవి కిరణ ప్రసారమున రాగిలి విచ్చు సరోజ యుగ్మమన్
జవి నరవిచ్చు కన్నుగవ స్వామిని గాంచిన యంతలోననే
యువ మెదురెక్కినట్లు కవలిర్వురు తల్లిని జేర నాత్మ సం
భవులను గౌగలించికొని పారమెఱుంగని మోదమందుచున్॥ 88

అభిముఖుఁడైన యాత్మవిభు నాస్యము నందునె దృష్టినిల్పి త
త్ప్రభలు రఘూత్తమాంబక దివాకర శీతమయూఖ రోచులం
దభయ మొసంగుచున్ గలియ నర్భకు లిర్వురు వెంటరా స్వయం
ప్రభయగు తల్లి తండ్రియగు రాఘవు పాదములందు వ్రాలినన్॥ 89

తండ్రీ తండ్రి యటంచు దారకులు తత్త్వంబెల్ల విస్పష్టమై
తీండ్రింపన్ హృదయంబు లుల్లసిల భక్తిన్ మ్రొక్క నవ్వేళతో
వేంద్రం బంతయుఁ దీటి ప్లాదమయమై విశ్వంబు వెల్గొందె నీ
గుండ్రాళ్ళన్ గరగించు సత్కథ నహో గుండెల్ ద్రవించుంగదే! 90

సీతారామ పరస్పరాంబక మరీచిస్ఫార సమ్మేళన
స్ఫీతంబైన జగంబు కాంచినది తన్వీ గూడి ముక్కంటిదై

చేత నర్వ నియామకుండగు శివుఁ శీతాంశు మౌళిఁ సమా
సీతస్కంద గణేశ సంయుతుని మున్నీరైన మోదంబునన్॥ 91

జయజయ సర్వలోకనుత సాధుకథా కమనీయ వార్నిధీ!
జయజయ సర్వ జీవగణ సన్నుత హృద్రథ దివ్యసారథీ!
జయజయ జానకీహృదయ సారసరంజన దక్షభానిధీ!
జయజయ రామచంద్ర! శ్రితశాసకధీ! కరుణా పయోనిధీ! 92

దిక్కులు పిక్కటిల్ల నినదించిన తజ్జయ నాదసంతతిన్
నిక్క మెఱుంగనయ్యె ధరణింగల సర్వము యోగజాతమై
మక్కువ నించుఁ దక్కునెడ మానవతా మహిమంబువాసి పెం
పెక్కిన దానవత్వమయి హీనతనందు జగంబు సర్వమున్॥ 93

ఆ దురవస్థయందె పరమాత్ముయుఁదాఁ బురుషోత్తమాఖ్యుఁడై
యాది జగంబు మానవత నున్నతికింగొని తెచ్చు దైవమై
మోదము గూర్చు రామవిభు మోహన జీవితగాథ యెల్లలో
కాది, త్రిలోకపూజ్యుఁడగు నాతని ధర్మమునే వచించెడిన్॥ 94

ధర్మమె సర్వాధారము,
ధర్మమె దైవమ్ము, ధర్మ తత్పరు నెపుడున్
ధర్మమె రక్షించును భువి
మర్మంబిది తెలిసి మనుట మానవుల కగున్॥ 95

సీతారామ మయంబు విశ్వమగు కృష్టిన్ యత్నసాఫల్యమై
చేతం బుజ్జ్వలమౌట సర్వగతమౌ సిద్ధాంతమై యుంటచే
సీతామాత్ర విమోహితాత్ముఁడయి తాఁజెందెన్ వినాశంబు న
ద్దైతేయుండు, ఋషీశ్వరుల్ విభవమందంగా సహోరాములై॥ 96

ఆశ్రమ వాటి ద్వారమున నందఱకున్ మునుముందు తానుగా
ప్రశ్రయమొప్ప నిల్చు గజరాజము మోదమునంది సర్వలో
కాశ్రయమైన యోంకృతియు యానన ఘీంకృతిసేయ నెల్లరున్
స్వాశ్రయ మందినట్లుగనె జాగృతినంది రమారమేశులన్॥ 97

సుతులంగూడి యనుగ్రహింపుఁడనుచున్ శుండాల మెక్కించి భూ
సుత స్వర్ణాకృతి మోచి యాహనుమ యాశుప్రక్రియన్ స్తోత్రముల్
నుతిగీతంబులు పాడుచున్ గదలఁ జిందుల్ద్రొక్కు తద్భక్త స
న్మతితోఁ దామును గూడియాడు చటవీ మార్గంబునన్ సాగినన్॥ 98

అలరుల జల్లు పెల్లగుచు నాగక వచ్చెను దారివెంట మి
న్నులబడి దేవదుందుభుల నూత్న నినాదము లేగుదెంచె ది
వ్యులు ముదమేచి డెందములు పొంగ నొనర్చెడి నృత్యగానముల్
లలితములై వినంబడియె లగ్నమనస్కుల కంతరాత్మలన్॥ 99

తిరుగు ప్రయాణమైన జగతీ జనతా బహుదీర్ఘ వాహినిన్
దరియక యొక్కరుండెవఁడో తన్మయతాస్థితి పీడకుండె ని
ర్భరుఁడతఁ డాగిపోయినది పట్టక యే చనిరెల్లవారు త్వా
వరుఁగదలింపఁ దామె చనఁగా వలెనంచుఁ గదల్చినట్టిఁడై॥ 100

నామాతీతుఁడనంగా
స్వామిని స్తంభింపఁజేసెఁ బదరుచు తానై
యీామెయి జనతతిఁ గదలిచి
స్వామిని గదలింపఁజేసె భక్తుఁడు తానై॥ 101

అతఁడటనే సమాధియగు టబ్బుర మేమియుగాదు జీవిత
స్థితి నతి దీనులై మనియుఁ జేకువ నొక్కొకవేళ సర్వభూ
నుత ఘనకార్యముల్ సలిపి నోళుల కెక్కని పేరులేని వా
రతి తర సంఖ్యలందెసఁగుట య్యది నైజము జీవయాత్రలో॥ 102

వాని స్వస్థితి తెలిసిన వాఁడొకండె
యన్నియుండానె యగుచుఁ గానట్టులుండి
జగతి నిశ్శ్రేయసంబంద జరుపువాఁడు
సర్వహృత్సాక్షియా రామచంద్రుఁడతఁడు॥ 103

ఆ విధి రామభూవిభుఁడు నాఁడడి నందిన దాని మాపి జీ
వావళి సత్యముం దెలిసి యభ్యుదయంబును పొందునట్లు తా

నై విరహంబు నోర్చికొని యట్లె కళత్రము యోగమూర్తియై
దేవిగ నిల్వ నిట్లిపుడు తెచ్చుట సర్వజగత్ప్రశస్తమా॥ 104

లోకులు కాకులూరకయ లొచ్చుగ హెచ్చుగఁ బల్కుచుందు రా
లేకి నుడుల్ గణింపఁ బనిలేదని చుల్కన చేయలేదు న
న్నీ కరణిన్ దృణమ్ముగ గణింతువె నీవని గొంతునొక్క లే
దేక విభుండు తానగుచు నేలును లోకము సర్వనాత్ముఁడై॥ 105

అవనీపాలన మెన్నఁగా నగును లోకారాధనం బంచు నీ
భువి సర్వమ్ము చిదాత్మయే యగుట తప్పం దెల్పి రక్షింపఁగాఁ
జవిగా నట్టి నుడుల్ జనించు నవి పూజ్యంబుల్ శిరోధార్యముల్
చెవిఁ బెట్టన్ దలపోయ కజ్ఞత మెయిన్ సిగ్గేది వర్తించుచో॥ 106

చెడు వెన్నండును దప్పదీ జగతి, రాశీభూత సౌజన్యమై
మృడ తేజో విభవుండు రామవిభుఁ డాత్మేశుండు తానౌచు నా
నుడి పుట్టన్ దలఁదాల్చి దిద్దికొనెఁ దన్నుం దాను నేఁడాతఁడే
గుడులందుండి సమర్చితుండగుట పల్కన్ దత్సమర్చా విధిన్॥ 107

అర్చకుఁ డర్చితుండగుట యయ్యది తథ్యము వేఁడు తన్నుఁ దా
నర్చన సేయుదాని కెడమై యితరమ్ముగ నెంచునో యతం
డర్చకుఁడే యనంగఁదగ దద్వయభావము శాంతిహేతువై
చర్చకు దింపు ద్వైత మనసా నభయంబును గూర్చు నెప్పుడున్॥

రామస్వామి సమర్చనా మహిమచే రామత్వ మాలోకమై
శ్రీమల్లోక మహత్త్వ మంతయును దచ్ఛ్రీ రామునం దేచి శ్రీ
రామాలోకన మందఁ జేసినది యారాన్మోహనంబై జగత్
క్షేమంబున్ గనఁజేయు గాథయయి కీర్తింగాంచె నేనాటికిన్॥ 109

తను దైవంబని యెంచి లోకులిడు స్తోత్రంబుల్ వినంబోక త
ప్పని యేమైనను బల్కుచోఁ దెలుపుఁడంచా రాముఁడీలోక మం
దున విశ్వాసము నుంచె నానుడిని భక్తుండౌచుఁ బాటించె నా
తనికిన్ సాటిగలండె రాఘవుఁడహో త్రైలోక్య సుశ్లోకుఁడా॥ 110

పొగడిత కుబ్బిపోయి తనపుట్టువ మేయము తానులేనిచో
జగమిది క్రుంగిపోవునని సాగునటే ప్రభు పీఠమందుఁ దా
దిగవిడిచెన్ రఘూత్తముఁడు తేకువ నప్పుడె యిప్పుడైననున్
దిగవిడువం గలం డదియ తేలిక యాపని త్యాగశీలికిన్॥ 111

గద్దె నెక్కుట కాలిపైఁ గాలు వెట్టి
కూరుచుండి సుఖంబు చేకొనఁగ గాదు
అల కిరీటమ్ము కంటె శతాధికంబు
బరువు ధర్మమ్ము నిర్వహింపంగ నగును॥ 112

రాజు రాజనఁ గరము కరమ్ము గొనుచుఁ
గడుపులోఁజల్ల కదలక కాళ్ళుసాఁపి
స్వీయసౌఖ్యమ్ము పొందె నుర్వీ జనాళి
యభిమతార్థమ్ము ద్రోసి వేయంగఁ గాదు॥ 113

రాజనఁ దండ్రియై ప్రజల రక్షణ సేయవలెన్ సమస్త భూ
మీజన మాన్యుఁడై యిలను మెట్టిన దైవ మటన్న ఖ్యాతితో
రాజిలగావలెన్ దొసఁగు రాఁజన దెన్నఁడు పాలనంబునన్;
రాజయినన్ సుఖంబు కనరాదుగదా తలక్రిందు లైననున్॥ 114

దోషి నిర్దోషి నెఱిఁగి తద్దోషమునకుఁ
దగిన దండన విధియించు తఱిని దొసఁగు
లెంత వానికి రావచ్చు నీకతాన
నృపున కంతాన యముని మన్నింపు నిజము॥ 115

అగుటన్ లోకమునందు నెవ్వఁడును రాజ్యాపేక్షఁ బోరాడఁగాఁ
దగ దెన్నండును ధర్మభారవహనార్థం బెవ్వఁడే ముందుకున్
దగువాఁడై చనుదెంచుచో నయమె స్వార్థంబెంచి యర్థార్థియై
జగమేల్ భారము నెత్తి కెత్తికొనుటల్ సవ్యంబు గా దేనికిన్॥ 116

రాజే తానుగ ధర్మమున్ జెఱిచి సామ్రాజ్యమ్ము సాధించినన్
రాజెట్లో ప్రజ యట్లటన్న నుడి వ్యర్థంబౌనె వెన్వెంట నీ

వ్యాజంబుగొని యెల్లవారు ప్రభులై స్వార్థప్రతిస్పర్థులై
తేజోవంతమునైన ధర్మమది నిస్తేజమ్ముగాఁ జేయరే? 117

ఆత్మబంధుల కధిక భాగ్యంబులబ్బి
నుర్వి సర్వు లుసూరు మంచుడికి పోవఁ
దనప్రభుస్థితి రక్షించుకొనుట యొకటె
లక్ష్యమై యుండు వాఁడు నిర్లజ్జుఁడగును॥ 118

అధికారం బొకఁడబ్బినంతటన క్రౌర్యం బేచి యున్మార్గుఁడై
బుధులం గాదని స్తోత్రపాఠకులె మెప్పుంబొందు వారౌచు దు
ష్ప్రథకున్ జంకని రాజు రాజగునె దౌర్భాగ్యంబునన్ లోకులా
యధమున్ రాజుగ గాంతు రాతఁడును నిర్యాతుండగున్ వేళకున్॥

రాజనరాజు రాముఁడగు రంజనమే పరమార్థమాట నీ
రాజన మెత్తి దేవుఁడని ప్రస్తుతి సేయఁగ లోకులెల్లరున్
భ్రాజిత ధర్మమూర్తియయి పాలనసేయును స్వార్థబుద్ధి యే
యోజను జూచినం గనమహో జనరంజకుఁడైన రాములో॥ 120

అంతటి విప్రయోగమున కాహుతియై తుదకెట్లొ కూడుచో
నంతటి శాంతమూర్తియయి యింతిని గైకొనె యామెకోసమై
యంతటి రాక్షసున్ గెడపి యంత వ్యథంబడి సుంత మాటకై
యింతిని వీడుటన్న పని యెవ్వఁడు చేయఁగలాఁడు సృష్టిలో॥ 121

మమతా శూన్యుఁడు, శాంతచిత్తుఁ, డనహంభావుండు, నిర్లిప్తుఁ, డు
త్తముఁ, డశ్రాంత పరిశ్రమాస్పదుఁడు, నిర్ద్వంద్వుండు, మౌనీంద్ర స
త్తమ పాదాంబుజసేవకుం, డఖిలబాధా మోచకం, డన్య దు
ర్దమ శత్రుంజయ కీర్తి మంతుఁడతఁడౌ ధాత్రీ ప్రభుండన్నచో॥ 122

ఎన్నిని వారలెన్ని నటు లెన్నక రాముని రాజ్యపాలనం
బెన్నుచు ముగ్ధులై చనుచు నేఁటికి సాగెడి రామకీర్తనా
సన్న సుధాసరస్సులను స్నానములన్ దలమునక్కలౌచు న
భ్యున్నత యోగకక్ష్యలను భూతములైన మహాత్మ్యమందుచున్॥

జనముల్ సాగుచు నుండ భద్రగజ పృష్ఠ స్థాన రాజోచి తా
సనమం దింతిని బిడ్డలం గలిసి విస్రబ్ధాత్ముఁడై యుండి రా
మునకు న్నాకుఁ బడంతివై యువిద సమ్మోదంబు నిట్లందు తీ
వనఁగా స్వామి! యదేమి మాట యెడబాటైనన్ సతీద్రోహమే?

కనఁబడి చెప్ప లేదనుచు గాసిలితిన్ మునుముందుఁ బిమ్మటన్
జనపతి వాచు నీ వటులు సల్పుట తప్పదటంచు నెంచి నా
మనమున నూరడిల్లితిని మాతను గంగను సంస్మరింప వా
రనయము తోడు నిల్చి యనుఁగైన కుమారుల నప్పగించిరిన్॥ 125

వదినె భగీరథాత్మజ కృపామతి నన్నెదలోని దీప మ
ట్లుదిత మహాస్కృతన్ గనిన దుండునె లోపము నట్టిచోట నా
సదయుఁడు మాని వీరిగాని సాకెను నీకెనగాగ దిద్దె నిం
కెది వరణీయమో యదియు నిట్లు లభించెను గాల మబ్బినన్॥ 126

నా దశ కేమిగాని రఘునాయక! నీ వటు నన్ను వీడి య
య్యాది రమేశు భావమున నద్వయతన్ నిలువంగఁబోక యే
దేదియొ యూహ సేయుచునె యెల్ల యు కాలముఁ బుచ్చుచోఁ ప్రభూ!
ప్రోది లభించు టెట్లనుచుఁ బొందిన వేదన చెప్పరానిదా॥ 127

వదినెయుఁ జెప్పకుండఁగనె పంపిన దచ్చట నిన్ను గాంచి నీ
కొదవిన దుఃఖమున్ గనుచు నూపిరి యాడక నాకు నేనె నీ
యెదుటఁ బడం దలంచియును నేమియుఁ జేయఁగ లేక సాహసం
బొదవఁగఁ దాకియుంటి విరఘూష్మ సమస్తమదృశ్యమై చనన్॥ 128

ఆ తాకుం గని నీవు తేటితివి నా యాకారముంగాంచ శే
కా తావందు ననుం దలంచి కనరావా యంచు వాపోవు నీ
కా తర్కం బెద కద్దికోఁ గలిగి త్యక్తంజేసి తీవందునే?
సీతన్ దాల్చితి వెప్పుడున్ హృదిని లక్ష్మీనాథ మన్నింపవే! 129

అను సీతా మధురోక్తి డెందమున కాహ్లాదంబు కల్గింపఁ జే
తను దత్కాంత కరమ్ము కైకొనుచుఁ గాంతాలోక చూడామణీ!

యను కంపన్ ననుఁ దాకి రక్షయిడి నీ వక్షుల కన్పింప లే
దన రామా! వరమయ్యె శాపముగ నాదౌభాగ్య మట్లుండుటన్ ॥

పరికిఁ గాన రావనుచు నిచ్చె వరంబును గంగ కానిచోఁ
భీరువు నై రసాతలము వీడను నేనని యా వరంబునన్
జేరితిఁ దత్ప్రదేశమును జీవన హానిను గాంచి తాకితిన్
దేటి చిరాత్రి నందియు నదృశ్యగనే మననయ్యె నచ్చటన్ ॥ 131

అనసూయా దివిజాపగల్ మదుల నా యందార్ద్రలై యుండియున్
గాను నాదోషత వారొసంగు వరముల్ ఘోర ప్రకాశంబు లా
నన నెట్టెన్ దురవస్థ దుఃఖమయ భాగ్యన్ నాకు సౌఖ్యంబు లే
దని వాపోయిన యంత మాత్రమున లభ్యంబౌనె యో రాఘవా!

అగుపడరామి నా విషయమై యెటు లెంతువో నీ వటంచు నేఁ
బొగిలితి, లాభ మేమి? నినుఁ బుట్టెడు దుఃఖమునందు ముంచితిఁ
బగిలెడు గుండెనిల్ప ముని వర్యులు వచ్చిరి వారు రానిచోఁ
మిగిలెడి దాననే యిటులు మేలొన గూర్చిరి హానులన్నచోఁ॥ 133

నిజము నిజమ్మ జానకి మనీషులు వారటు వచ్చి తేర్చ రీ
ప్రజ పయి వత్సలత్వమున వారి ఋణం బెటు తీఱుఁ గూలము
ద్రుజ కరుణా మహాంబుధులు రూక్షతపోనిధులా యగస్త్యులే
నిజగతి దిద్దకుండినను నేనని రాముఁ డొకండు నుండునే? 134

అరిగితి వారి యాశ్రమమునందె యెఱింగితి మర్మ మెల్ల వా
రెఱుఁగఁగ జెప్పి రాఘవు నహీన మహాదురి తౌఘ శృంఖలన్
కరఁచి నశింపఁ జేసెడి మఖప్రవరం బొనరింపఁ జేసి యీ
వరమిటు వాలఁజేసిరన వాలిన మోమయి సీత మ్రొక్కెనన్ ॥ 135

తల్లియుఁ దండ్రి యట్లు బహుధా వివిధ స్మృతి మగ్న చిత్తులై
యుల్లము లొల్కఁబోసి కొను చూరట నందెడి నట్టివేళఁ బె
న్వెల్లిగఁ దోఁచుఁ గావ్యగత వృత్తములన్ దమలోనఁ దామెయై
యుల్లము లుల్లసిల్ల వెలి కూదక యే రమియించి రర్భకుల్ ॥ 136

వా రటు వారి లోకమున వారుగ నుండగ భక్తలోక మ
వ్వారి మహానుభావమునె ప్రస్తుతి సేయు చనుక్రమింప నా
దారి ప్రవాహమో వనమొ దాటున దేదియొ పట్టకుండనే
చేరి రయోధ్య మోద వివశీకృతమై భువనంబు లుబ్బఁగన్॥ 137

అపుడౌత్సుక్యము తొందరింపఁ జనుచో నట్లయ్యె రెన్నాళ్ళు నేఁ
డిపు డానంద మహాతివేగ మగు టట్లేసాగి యీ నాటికే
స్వపురంబందిరి నాఁడు పూర్ణిమ నభస్సర్వమ్ము రాకామయ
ప్రపమై యుండగ రాము గాంచిరి మహారాజున్ సదారాజుగన్॥

శ్రావణ పూర్ణిమానిశిని రాఘవుఁ డద్భుతుఁడయ్యె నశ్వ మే
ధావధి నందుదాఁక యెడమై చనినట్టి కుమార మంగళం
బీ విధిఁ బూర్ణమై విరియు టెంతయు నిండును గూర్పఁ బూర్ణుఁడై
భావన కందరాని యనుభావము నందఁగఁ జేసె భూమికిన్॥ 139

ఊరని పేరె యందఱిటు లూగి త్యజించుట వీరి నందుకో
నేరును లే రటన్ శిశులు వృద్ధు లవధ్యులు నుండి లేనమై
శ్రీరమణీ మణిన్ నవశిరీష సుమాంగను జానకీ సతిన్
వారని ప్రేమఁ దెచ్చు రఘువంశ సుధాంబుధి సోముఁగన్గొనన్॥ 140

ప్రోవగు సత్తప స్సగుచుఁ బ్రోలికి వెల్పల వేచి యున్న దా
దేవి యరుంధతీ సతి సతీ జగదాభరణంబు సీత లే .
కేవము గాంచి యేగి మును పిప్పటి కిట్లుగ వచ్చి నెమ్మదిన్
దీవన లీయ మోదమవధీకృత మైనది జీవకోటికిన్॥ 141

వేద పురాణ శాస్త్ర పదవీ సదవీయసి యైన పెద్ద ము
త్తైదువ యీమె వచ్చి యటు లద్భుత వైఖరి సీత నందుకో
వేద పురాణ శాస్త్ర పదవిన్ బయనించిన నాటిలోక మ
ట్లాదట మాతృకార్ణ మహితాత్మత నందిన చందమై చనెన్॥ 142

కోసల దేశ వాసు లనుకోని విధంబున ముందఱుండి సీ
తా సముపేతుఁడౌ విభుని దత్సుతులన్ దమకిచ్చు శేముషీ

వాసిగఁ జూపినా రనుచుఁ బౌరుల నెల్ల ర స్వాగతించి రీ
దోసమిదేమి? మీరలతిథుల్ నతి గొండని వారు వేడఁగన్॥ 143

ఎవరికి వారు గేస్తులయి యెల్లర కెల్లరు నౌచు నాఁడు వై
భవముగ నెల్ల గ్రామముల వారికిఁ బౌరులు విందుసేసి రా
చవి మఱువంగ రానిదయి సంబర మందుటె కాక నేటి సం
భవములు ధన్యమైన వని భావన సేసిరి వార లెల్లరున్॥ 144

ఇది పురుషోత్తముండయిన యీశ్వరుఁ డేలిన పుణ్యదేశ మి
య్యది పరమోత్తమంబయిన యార్షత నందిన కర్మభూమి యో
గదమయి సర్వసంపదలు కాంచునదై పరమార్థ మందికో
నుదయము నందినట్టి సకలోత్తమ భూమి సమస్త సృష్టికిన్॥ 145

ఇట జననంబు నందుటయె యెన్నో భవంబుల పుణ్యపాకమా
పుట పుట పాపముల్ విరిసి పుట్టితి మిచ్చట రామభూపతిన్
బటుతర భక్తిఁగొల్చు పరిపాకము నందిన దింక మాకు నె
చ్చట జననంబు రా దనిన చందమునన్ జనముండి రయ్యెడన్॥ 146

తిరముగ నెత్తిపై నునిచి దేవిని దెచ్చిన యాంజనేయుఁడ
బ్బురముగ వాలమున్ నిడివి పొందఁగఁ జేయుచుఁ జుట్టుచుట్టుచున్
గరమరుదైన వట్రువగు కంబము వోలికఁ జేసి దానిపైఁ
దిరముగఁ గూరుచుండె నతి ధీరుఁడు పావని భావమేమియో? 147

జన్నము కోసమా ధరణిజా ప్రతిమంబులు రెండు నప్పుడే
స్విన్న మనస్కతన్ గరగి విచ్చిన వియ్యది యట్లుకాక తా
నున్నటులుండి సర్వులకు నున్నతి గూర్పగ నౌనటంచుఁ దా
నెన్నెనొ యేమొ యోగమున నిట్లు వహించును స్తంభమూర్తియై!

అపుడపుడే సమస్త జన మచ్చటికిన్ గొనితెచ్చు నిట్టికల్
త్రిపురములట్లు మూఁడయిన వృత్తములన్ విరచించి యెత్తుగా
నిపుణత షోడశారమును నిస్తుల నాగదళంబు వానిపై
విపుల చతుర్దశారమును విచ్చు సరోజము లట్లు కూర్చుచో॥ 149

సరిగ మరు త్తనూజుఁడుప సంహారణం బొనరించి వాలమున్
దరుగఁగఁ జేయుచున్ నిలువ దానికిఁ బై దశకోణ యుగ్మమున్
విరియఁగఁ జేసి యా పయిని విస్మయ మానటు లష్టకోణమున్
సరవి త్రికోణమున్ నిలుప స్వర్ణ మహీజను దింపి హన్మయున్॥ 150

ఎగిరి ధరాస్థలిన్ నిలిచి యింత మహా త్తర పీఠ నిర్మితిన్
నిగిడిన యన్నలున్ బొగడి నిర్భర మోదము వెల్వరించె మా
నిగ నిలుచున్న లక్ష్మణుఁడు నిస్తుల యోగి నిమేషమందె విం
తగ రఘునేత విగ్రహము దానికడన్ బ్రభవింపఁ జేసినన్॥ 151

గురుతర మోదమైన ప్రజ కోయని యార్చుచు దాని చుట్టునన్
దిరుగ పథంబు కూర్చికొని తేకువ నల్ చదరంబుగాఁగ నా
వరణము కట్టి నల్దెసల ద్వారము లొప్పగ నిల్పిరద్ది శ్రీ
పురమయి పొల్చె సర్వులకుఁ బూజ్యముగా నిలయుండు నంతకున్॥

సీతారాములు పార్వతీ శివులు లక్ష్మీ విష్ణు లవ్వారి ను
ద్ద్యోతంబౌ పరమోన్నత స్థలిని బిందుస్థాన మందెంచి యు
న్నీత శ్రీ పురవాసియై మెలఁగి మంటెన్నింటి నిర్జించి వి
ఖ్యాత బ్రహ్మ పదస్థుఁడైన ముని యోగ ప్రక్రియన్ జాటెడిన్॥ 153

అమ్మం దెచ్చిన సత్కథాగతియె బ్రహ్మానంద మందించు నం
దమ్మై యిమ్మెయి చారితార్థ్యమును పొందం జేయు నిశ్శ్రేణియై
యమ్మం జేరు నుపాయముం దెలుపు నాహా! యేమి లోకాద్భుతం
బిమ్మై పుట్టిన దెంత భాగ్యమొ కదే యీ నిర్మితిం గాంచుటల్॥

ప్రతిమం దెచ్చిన హన్మయూ పగిది స్తంభంబౌట యేమీ? కళా
ప్రతిముండౌ నలుఁడీ మహో విభవ నిర్మాణంబు గావించు టే
మి? తితిక్షా ఘనుఁడైన లక్ష్మణుఁడు స్వామిన్ వెంటఁ బుట్టించు టే
మి? తగెంబో కథ కంతకున్ మకుటమై మృష్టాన్న తాంబూలమై॥ 155

ఆ గతి రాఘవుండు పునరాగతి నందిన రామకూడి క
ల్పాగము కామధేను వునునై దశవర్ష సహస్ర హాయనం

వేగియు నేగనట్లె జగ మేలెను రాజన రాజు తానయై
భోగము యోగముఁ గలిగి పొందగ సర్వులు భోగమోక్షముల్॥

హయమేధంబులు నూఱొనర్చి నుతసంఖ్యఁ బౌండరీకాది ని
ర్భయ కృద్ యజ్ఞము లెన్నొ చేసె నతుల శ్రద్ధఁ దయావంతుఁడై
నియమం బూనిన రామ రాజెపుడు నిర్నిద్రుండు ధర్మానఁ బ్ర
త్యయ మొప్పఁ దనకైన వేదవిధి నుత్సాహంబునన్ నిల్పెడిన్॥

వేదము దైవశాసనము విశ్వమిదంతయుఁ దత్ప్రధానఁ గా
లూది చరించు మానవుఁడు నున్నతి నందగ నన్యమార్గమే
లేదు స్వబుద్ధి యెల్లపుడు లేపముచేఁ బెడదారిఁ ద్రిప్పున
వ్వేద విధిన్ గ్రహించి పదవింగని వీడక యేగఁగా వలెన్॥ 158

శాసకుఁ డెప్పుడున్ విధియె సర్గముతో సమకాలికంబుగా
శాసన మిచ్చి దానిబడి సాగుఁ డటంచును నిర్ణయించె వి
శ్వాసముతోడ రాజయినవాఁడు విధిన్ శిరసావహించి య
భ్యాసము తోడఁ బాల్యులను వర్తితు లౌనటు చూడగావలెన్॥159

మనువు మొదల్ ధరాపతులు మక్కువ నేగిన మార్గమిద్దియే
జనపతి స్వీయబుద్ధినిడి శాసనమున్ సవరింపలేదు దే
వుని యవతారమైనఁ దన పూర్వపు టాజ్ఞను దప్పరాదు రా
ముని మతి యట్లు సాగినది మోహనమై సకలార్థదంబునై॥ 160

తాను దృఢంబుగా నిలిచెఁ దత్పరమై జనమెల్ల పాగె స
ర్వాన వ్యతిక్రమంబు కనరామిఁ బ్రసన్నత సర్వదేవతల్
పూని సమస్థితిన్ నిలిపి పుష్కల సౌఖ్య మొసంగి రందుచే
నా నుడి పుట్టె, నేటికది సార్థమె, రాజ్యము రామరాజ్యమే! 161

భూకంపంబులు లేవు, నీరములు తెంపుంగాంచి జీవాళి న
ష్టాకం బెట్టగ లేదు, వహ్నియును తీవ్రంబౌచు దుర్దాహ భీ
నే కోనం గలిగింపలే, దనిలుఁడు ద్వృత్తిన్ బ్రభంజింపఁగా
దూకన్ లేదు రఘూత్తముం డవని నాథుండైన కాలంబునన్॥ 162

అయిదవదైన యాకసము నంతట నుండెడు నట్టిదై హృదంతరం
బయి పరమాత్మ రూపమయి యచ్చపు శాంతిని పొందనీక పె
ల్లయిన విచారముల్ గొలిపి యూరడి హెచ్చగ నేడిపించ లే
దెయి దిన ధర్మమై జగతి నెచ్చట చూచిన శాంతి సౌఖ్యముల్॥

అతివృష్టి యనావృష్టియు
నతి తర సంఖ్యాకమయిన యాఖు శుకాదుల్
మితిమీఱు మిడుత దండులు
నతి నికట స్థితిని పొంచు నన్యనృపుండున్॥ 164

ఈ తులనన్ బ్రసిద్ధమగు నియ్యవి మానవ ధర్మలోపమున్
నేత నెఱుంగఁ జేయుటకు నెక్కొనఁ జేయును పుట్టినంత నే
చేతము లందు భూపతులు చింతిలి ధర్మము తప్పిపోవు సం
కేత మిదంచుఁ దా మెఱిఁగి తీప్రగతిన్ సవరింపఁగావలెన్॥ 165

'నా విష్ణుః పృథివీశ' యన్న నుడి యా నారాయణాజ్ఞా సమ
గ్రా విష్కారకుఁడైన హేతువున ప్రఖ్యాతంబుగా నయ్యె నా
దేవుండే యిట రాజుగా నిలిచి యుద్దీప్తిన్ గనంజేయ దు
ర్దైవం బెట్లు ఘటిల్లు శాంతిమయమై ధాత్రీ తలంబుండెడిన్॥ 166

తమ తమకైన ధర్మములఁ దప్పక నిల్పుచు దైవమియ్య వు
త్తమ మని మా కొసంగె నరుదారుగ మమ్మిట మింతురెవ్వ ర
న్యము లవి యెట్టివైనను నియామకు దృష్టిని నన్ని యొక్కఁడౌ
సముఁడతఁ డాతఁడీ పనిని సల్పుమనన్ జవదాటు టొప్పునే? 167

నా ధర్మమ్మున నేను చచ్చుటకు నైనన్ సిద్ధమన్యమ్ము లు
న్మాద ప్రక్రియ నా కృషించినను ధర్మభ్రష్టుగాఁజేయు నా
కీ ధర్మంబని నేను పుట్టుటకు ముందే నిర్ణయం బౌట నే
నా ధర్మంబున నిల్చుటే యగును శ్రేయఃకారి ముమ్మాటికిన్॥ 168

అని భయ భక్తు లొప్పఁ దమ కబ్బిన ధర్మము లందు నిష్ఠతో
జనులు మెలంగ సర్వులకు సౌఖ్యము చుబ్బన చూఱలయ్యె నె
వ్వని ముఖమందుఁ జూచినను వానికి వాఁడె మహాత్ముఁడన్న తృ
ప్తిని గనఁజాలి సంఘమది పేరు గడించెను పూర్ణ తాప్తిచే॥ 169

సమరస భావమీ పగిది సాగుట సర్వము నొక్కరీతి యం
త్రమువలె గిర్గిరం దిరిగి తన్మయ మానను వర్తనమ్ముచేఁ
గ్రమగతి నున్నతోన్నతిని గాంచుటె కాక సమష్టి యత్నమై
సముచిత లబ్ధి నందుచును సర్వసమృద్ధిని గాంచె సంఘముః॥ 170

అవయవముల్ విభిన్న కృతులందు సమర్థము లౌచు సర్వ మా
యవయవి కోసమై నటులు వ్యక్తులు వేఱయి వారు వారు తా
మవయవి యా విరాట్పురుషు నందు విభక్తులు కాక భక్తితో
భవనము నెట్టగా నయిన భావమునన్ బరి నిష్ఠితాత్ములై॥ 171

వెలుఁగుట రామ భూ విభుని మేదిని రాజ్యము రాజ్యమెల్ల నే
తలకును నేతయైన రఘు నేతయె యాత్మగ సర్వభూజనుల్
కలిత విలక్షణాంగములుగా నొక దివ్య తనుత్వ మంది ని
స్తులమగు కీర్తి గాంచినది తోయజ నేత్రుని విశ్వరూపమై॥ 172

ఓహో రాముఁడ దేమి రాముఁడో హా హో యూహానభిజ్ఞుండు స
మ్మోహం బందఁగఁ జేయు నీ భువిని సంపూర్ణ ప్రభావాఢ్యుఁడై
దేహంబద్ది నిరింద్రియంబగుచుఁ దద్దీప్తిన్ విలీనంబుగా
నూహన్ ఫుట్టె తదీయ సంస్మృతియె యుభ్యుత్థాన మందించెడిన్॥

జగదనిత్యత్వమ్ము సంభావితంబయ్యె
నిత్య పరిశ్రమోన్నిద్రులగుచు
నద్వయంబగు నాత్మయను సంధితంబయ్యెఁ
జక్రాను వర్తన స్పర్థులగుచు
'సోఽహం' విభావనా శుద్ధ స్వరూపులై
విరహితా హంభావ విదితులగుచు
నిస్సంగ నిర్లేప నిత్యాత్మ రూపులై
నాట్య వేళా మహానటులె యగుచు
జనము లానాఁడు శ్రీరామ సదృశులగుట
నాప్తకాములె యయిరి సర్వార్థములను
సర్వమంగళ మాంగళ్య సహితమైన
రామరాజ్యంబు మహిమ వర్ణనను మించు॥ 174

నెలసరి మూఁడు వానలయి నిస్తుల పుష్కల సస్యశాలినీ
విలసితదేశమై మృదులవీచి సుగంధిల వాయుశోభియై
కులగురుఁడౌట సూర్యుఁడును గోమలతన్ భజియింప హాయికిన్
నెలవగు రామరాజ్యమున నింగికి నిచ్చెన వేసిరెల్లరున్॥ 175

తరువులు నిత్యపుష్ప ఫలధారులు, నిర్ఝర మేఘజాలముల్
తరుణ సమంచి తాచ్ఛ జలదాయులు, మాతృహృదంతరార్ద్రితా
భరములు వాహినుల్, మధురవాయువులెంతో సుఖస్పృశంబులై
నిరుపమ రామరాజ్యమున నిల్చిన వాపదివేల యేండ్లనున్॥ 176

రోగంబు రొష్టని సేగినందుట లేదు
ప్రజలెల్ల రారోగ్యవంతులచట
ఇది నాకు లేదని యేడ్చువారే లేరు
ప్రజలెల్ల నైశ్వర్య వంతులచట
ఆత్మబంధువుల వీడి యల్లాడుటయె లేదు
ప్రజలెల్లరు నదృష్ట వంతులచట
పనిలేక తోఁచక పనవు వారేలేరు
ప్రజలెల్ల రుద్యోగవంతు లచట

వర్ణ సంరక్షణమున నిర్వర్ణ్యులగుచు
హెచ్చు తగ్గుల సమత పాటించుకొనుచు
నీసు పొడలేక యన్యోన్య హితకరులయి
యక్షరజ్ఞాన మహితులై యలరుచుంద్రు॥ 177

పెద్దలుండగ మృతిన్ బిన్నలందుటె లేదు
అనుచిత మరణంబు లసలె లేవు
ఆద్యంగ వైకల్య మరుదుగాఁగనసైన
నాగంతు కమ్ము లేదచట నెచట
వనితలెల్లరు పతివ్రతలౌచు మనుచుంద్రు
వైధవ్య మెవ్వరుఁబడయకుంద్రు
విషజంతు దుర్భీతి వినఁబడ దెచ్చోటఁ
బ్రామాది కార్తి నెవ్వరును పడరు

నాఁడు లేనట్టివాని వర్ణనకునైన
కలిమె యోగ్యుఁడు చోఁటరాక కలఁతనంది
పేరు వినరాని దూరంబు పాఱుదెంచి
నేఁడు తన తెల్వి పండించి నింపు జగము॥ 178

కలి మల మెల్ల మాయుటకుఁ గాల మహోఘున క్రమగాత్రుఁడై
నలువుగ ధర్మమే నిలుచు నా యనిపించెడి రాము నామమే
యిలగలమందు తన్మహిమ నే మని చెప్పగ వచ్చు బోయకున్
బలుకుల పొందు నేర్పి నిజవైభవమున్ బ్రకటింపఁ జేసెఁబో॥ 179

రాముఁడు సర్వరక్షకుఁడు, రాముని వీడిన దిక్కు లేదెటన్
రాముని చేతనే కలినిరాసము, రామునికై వసించెదన్,
రాముని కంటె తత్త్వమెది? రామునకున్ శిరసా నమస్కృతుల్,
రాముని యందె సర్వమగు, రామ! ననున్ దయసేసి కావవే!! 180

## ఖండాంత పద్యములు

ఈ యది ప్రత్యానయనం
బోయి మహాకాల! నీదు నూహా జనించెన్
నీ యది నీ కిత్తును గాను
మో యీా నా యది యదేదియున్ లేదుగదే! 181

ఎదఁగల బర్వు దింపికొన నీశ్వర! నీ వొకరుండ దిక్కునై
కుదిరితి, నేను చెప్పునది గోడలకున్ గొఱగానిదయ్యె నీ
వెదఁగుదురాచు నీవె స్ఫురియింపఁగఁ జేయుచు నీవె కాదనన్
గుదురదు మోచి మోచి యెదకున్ బరువయ్యెను ధీప్రబోధకా! 182

నా కన్న భూమి భారతి
నా కన్నుల మ్రోలనిట్లు నానాగతులన్
బ్రాకుచుఁ దనంతఁగుపథ
స్వీకృతి సేయఁగ మనస్సు వికలము కాదే! 183

ఎన్నో వేలయుగంబు లీ మహి మహోహీంద్రమ్ము వైకుంఠ శ్రీ
మన్నారాయణు మోచునట్లుగనె నీ మాటా శ్రుతిన్ మోచె నేఁ

డున్న వ్యత్యయము పొంతఁబోక తినఁ గూడున్ గుడ్డ లేకున్ననున్
నిన్నున్ నమ్మి శ్రుతిన్ వహించు విబుధుల్ నిన్ గొల్తు రోహో శివా!

వేదపథమ్మునన్ నిలిచి వీడక యుండినదాఁక నీ మహిన్
లేదు కొఱంత సర్వమవ లీలఁగఁబొంది సమస్త భోగముల్
ప్రోది యొనర్చి యైహికము పుష్కలమైమని పారమార్థికం
బాదట నందికొన్న యది యాది జగద్గురు గౌరవంబునన్॥ 185

దిక్కుల వారు వచ్చి యిట దేశము నంగల భోగభాగ్యముల్
మక్కువఁ జూచి వాని మహిమంబున కచ్చెరువంది కీలకం
బెక్కడ నున్నదో యెఱుఁగ కేగియు నున్నది యున్న యట్టులే
నిక్కము దాపకుండ నవనిన్ ప్రకటించి రుదారమూర్తులై! 186

అప్పటిదాఁక దేశమున కబ్బగ లేదు మహార్తి స్వామి! నాఁ
డప్పటి యందు తిప్పలుగ నక్కడ నక్కడ చిన్నరాజ్యముల్
కుప్పలుగాగ నుండినవి కోరి యొకండును కూడిరాక యే
యొప్పరికించి రెల్లరును నొక్కటిగా నొనరించు యత్నమున్॥ 187

అయినను స్వీయధర్మమున నప్పటికిన్ నెలకొన్న హేతువై
బయటి విదేశవాసులకుఁ ప్రాభవమున్ గనఁజేసె హెచ్చుగన్
వియదఖిలమ్ము మ్రోగినది విస్తృత భారత సంపదున్నతుల్
నయనము లుల్ల సిల్లఁగన నాలుగు దిక్కుల వారు వచ్చిరిన్॥ 188

కాశికి యాత్ర కేగు యువక ప్రభు వింటిని మాయ లేదు, మే
ల్వాసి సువర్ణ భాండమది బాటను పడ్డది ముట్టలే దెవం,
డో సరి నీతిధర్మములు నప్పటి కింగల వంట భూమిలో
దేశమదెట్లు మాయు నవధీరిత ధర్మము కాక యుండఁగన్॥ 189

వీథుల వెంట వర్తకులు బేడల కుప్పలు వోలె రత్నముల్
దీధితు లొప్ప వాని నట దించుచు మానికతోడ గొల్చుచున్
బాధలు లేక యమ్మిరఁట! భాగ్యములంతగ నుండె నప్పుడున్
బాధిత మయ్యె ధర్మమని భావనచేయుటదెట్లు నాటికిన్॥ 190

ఆ తరువాత వచ్చె నొక యాయుధ ధారుల దండు వారలీ
పా తర త్రవ్వికొందమని వచ్చిన చోరులు గుళ్ళగోపురాల్
పా తులగల్చి కూల్చి కన వచ్చిన దంతయుఁగొల్లగొట్టి ని
ర్భీతిగ నేగి, రయ్యదియుఁ బ్రీతి జనింపఁగఁ జేయనాపయిన్ ॥ 191

వారల బంధులే నిలువ వచ్చిరి, రాజ్యము చేసిరిందు, నా
నా రభసం బొనర్చి కదనం బని కాక కసాయి పద్ధతిన్
ఘోరముగాఁగఁ జంపి కడు క్రూరముగాఁగఁ జరించి రిద్ధరన్
వారికి లొంగి దేశమున వారు మతాంతరు లౌట తప్పకన్ ॥ 192

అపుడున్ గొందఱు స్వీయధర్మరతి విద్యారణ్యు నాశీస్సులన్
రిపు సంహారక మూర్తులై నిలిచి కీర్తిన్ నిల్పి రీ దిక్కు నం
దపు రూపంబుగ నాఁటికిన్ దరుగలే దైశ్వర్య మీనాట క
ప్రపు మాటయ్యది యన్యదేశజులె చెప్పన్ మాటికిన్ మాటికిన్ ॥

ఆ పయి వచ్చినారు ప్రభువా! తెలివెల్ల మొగాల యందె తె
ల్పై పొలు పందు వర్తకులు నాశ్రయమిండని వేడి నిల్చి మా
కాపున కంచు కోటలను గట్టి యెదో యొక వంక రాజులన్
జోపుచు మెల్లమెల్లగను జూచుచు నుండఁగ రాజులై చనన్ 194

ఏనో మూర్తులు వారి పాలనము నందే యానో యింకొంచెమో
పోనేపోయిరి వారు నేఁటికి నహోభూయిష్ఠ పాపంబు సుం
తైనన్ బోదు శ్రమించి తెచ్చిన స్వరాజ్యంబెల్ల నవ్వారి మా
ర్గానన్ బోవుటకైన యట్లు ప్రజ లీ గడ్డన్ బ్రవర్తింతురే! 195

తొలుతటి వారు దోచినది తొయ్యలులన్ ధన రత్నరాశులన్
మలుసటి వారు మాపినది మానసమయ్యెను జాతి నేఁటికిన్
గలుషిత బుద్ధి వారిడిన కల్మషమున్ గ్రహియించి మ్రింగెడున్
దెలిసిన వారు చెప్పకయ దిక్కులు చూచుచు నూరకుండఁగన్ 196

పాలక జాతియై జనుల వశ్యులఁ జేయుట పొంటెఁ జీల్చియే
పాలన సేయు నీతిబడి వాఁడు పొనర్చిన దింత యంతయా
శూలము గుండెఁ గ్రుచ్చుకొని శూలివి నీవును దీయకుంటి వీ
నేలకు దిక్కు నీవె కరుణింపవె నిక్కము తెల్పి యీశ్వరా! 197

గీర్వాణిన్ మృతభాష చేసి, శుచియై కీడొంద కెల్లప్పుడున్
సర్వప్రాణి సుఖంబు కోరి మననౌ సంఘంబు తత్త్వంబునే
దుర్వాదంబులఁ గూల్చి, జీవనపు వృత్తుల్ మాపి యాత్మీయతా
గర్వంబే యుడి పోవఁ బాడు వఱిచెన్ గారుణ్యవారాన్నిధీ! 198

ఈ నా దేశము నిన్న మొన్నటి దటం, చీ గడ్డలో జ్ఞానముల్
లేనే లేవని, యార్యులీభువిని పాలింపంగ విచ్చేసి ముం
దీ నేలం గల దస్యులన్ గెలిచి యుండే నిల్చి నారంచుఁ, దత్
జ్ఞానం బైనను గ్రీకు వారిదని, విజ్ఞానంబు పొందగం లో
కానన్ సర్వుల కాంగ్లమే గతి సుడీ కాదన్న మాధ్యమ్మె మీ
దానంచున్, శ్రుతులున్ బురాణములు తప్పంచున్, జరిత్రంబె లే
దే నాఁడంచును, మీ చరిత్ర యిదిగో యిట్లున్నదంచున్ మహా
జ్ఞానంబున్ దయచేసి యేగె గదవే కారుణ్య వారాన్నిధీ! 199

ఈ యజ్ఞానమె జ్ఞానమై మనుచు నేఁడీ నాట శ్రీరాము నా
త్మీయున్ గాదని రావణున్ గొలుచు వార్ ధీమంతులై నారయా!
ధ్యేయుండౌ నినుఁ జెప్పు రామ కథయే ధ్యేయంబు కాకుండె నీ
మాయన్ విప్పి యనుగ్రహింప గదవే మాయీ! భవానీ పతీ! 200

ఆలిని దొంగిలింప నరుఁడై హతమార్చునె వంశమంతయున్
శూలి సహాయుడైన నర శూరుని కీర్తి శరీరమైన ఖ
డ్గాలను గ్రుమ్మగా వలయు గాయని రావణుఁడే నరాకృతిన్
వాలెనొ యన్నయట్లు ప్రభవంబయి రద్భుత ధీనిధుల్ శివా! 201

వారికి రామగాథ పెరవారి నుడింబడి ద్రావిడార్య దు
ర్వైర కథా ప్రకారకము ద్రావిడుఁడై యిట నుండు రావణున్
వైరము నూని యార్యుఁడగు వాఁడెట నుండియొ వచ్చి చంపె నీ
ఘోరము నెట్లు సైతు, మదిగో దహియింతుము వాని నందురున్॥

రావణ భక్తు లేమనెడి ద్రావిడు లుండిరి, రామభక్తియే
శేవధి యంచు వేదములిసీయను నార్యులు నుండి రందుచే
దైవము మాసి నట్లగుచు ధారుణి ధర్మమెఱుంగకుండఁగా
లావధి నందుచున్న యది యూపిన నాగని జాఱు పాటుగాన్

రాముని భక్తులేమనుచు రాముని రాజ్యమె మాకు లక్ష్యమం
చా మహనీయునిం దెలుపునట్టి మహత్తర వేదరాశి తా
నేమని చెప్పునో తెలియ కీరసమెత్తి వినిందసేయ నా
ధీమతు లెక్కువైన తఱిఁ దెచ్చితి పీకృతి నీవుగా శివా! 204

ధర్మమె విగ్రహంబయిన ధార్మికుఁ డారఘు రాముఁడుండి స
త్కర్మరతిన్ సమస్తభువి ధర్మమునన్ జ్యుతి లేక శాంతిమై
శర్మమునందఁజూడ నను శాసన మొప్పని దస్యుతస్కరా
ధర్మము మాసిపోయినది దానికి దుష్కలి సమ్మతింపకన్॥ 205

జాతివిరోధ చిత్రకథచాటి యధార్మిక మూలపూరుష
ప్రీతి ఘటింపఁజేసి తనివిం గనఁబోక సమస్త విశ్వని
ర్మాతయు రక్షకుండయిన రామునిపైఁబగఁ బెంచుచుండెఁ జే
యూత నొసంగి లోఁబఱచు నూబిని వెల్వడఁజేయుమో శివా! 206

అంతా రామ మయంబు విశ్వమగుట త్యంతంబు సత్యంబు వి
భ్రాంతిన్ గిర్గిర తిర్గితిర్గి తుదికా పాట్లన్ని యుందీఱె వి
శ్రాంతిన్ బొందుట విశ్వనైజముగ విస్పష్టంబుగాఁదోఁచు నా
శాంతాత్ముండగు రాముఁడే పరమ లక్ష్యంబా స్వరూపంబగున్॥ 207

రాతిరి నిద్రలేక శివరాత్రముగానయి నీవు చెప్పగా
నా తెలి వడ్డుగానిలిచి నాట్యము సేయఁగఁ గావ్యమెల్ల! సం
ధ్యా తరుణారుణాంశుకుల ధామముగా వెలువడ్డ దయ్య! నీ
ప్రీతికిఁ బాత్రమైన సురరీ కృతమయ్యెడు వేదగోచరా! 208

శ్రీ రామరాజ్య నామ ర
మారమణీ పద సరోజ మంజీర మణీ
చారుస్వన సుమనోహర
సారరసాలంబి కావ్య సరసి రుహంబున్॥ 209

నీ పద పంకజ ద్వయిని నిస్తుల భక్తి భజింపఁజేయు హృ
ద్దీప మహత్త్వ మేచి పది దిక్కుల వెల్గుల నింపుగావుతన్
దోఁపఁగఁజేయు దీవ మఱి తోఁచిన భావము నీవ యాచునన్
దేపకు ముంచి తేల్పకుము ధీనిధి! యీ భవ సాగరంబునన్॥ 210

మం. మహాశ్రీ

శ్రీకరి సరీసృప నిషేవిత పదాబ్జయుగ
శీతనగ యోని యుత దేహా!
ప్రాకృత కిరాతపతి పాటిత సులోచన వి
భాకలిత నూతన ముఖాబ్జా!
మూక ముఖ భక్తగణ మోచక సుధామసృణ
మోహన విలోకన విలాసా!
నీ కరుణ నా పయిని స్నేహవశ మూచు పడ
నీ పొరలి మంగళ మహాశ్రీ! 211

మం. మహాశ్రీ

జ్ఞాన కుసుమామృదిత సౌరభ పరీవహన
జాత నవ పావన శరీరా!
మాని హృదయా వసన మానితగుణాభరణ
మానసర తనూ విభవ భాసీ!
దాని పవనాశన కృత ప్రచుర వాదఫల
దాయక దృఢాశ్మఘన గాత్రా!
వీనులను నా మొఱలు విన్నటులుగా నయిన
వే కదలు మంగళ మహాశ్రీ! 212

మం. మహాశ్రీ

హే రజత శైల గృహా! హే ప్రసవబాణ జయ!
హే శ్రితజనావన దయాళూ!
హే రిపు నిరాకరణ! హే పురహర ప్రథితె!
హే భుజగ భూషణ వినోదా!
హే రహిత సర్వగుణ! హే ఘటిత మాళి శశి!
హే దివిజ వాఃప్లుత శిరోజా!
హే రచిత దిగ్వసన! హే నిజ కళత్రవపు!
హే పరమ మంగళ మహాశ్రీ! 213